# సూచన

రామాయణంలో యీ అరణ్యకాండ అంటే, రాముడు మన తెనుగు దేశంలో వుండినప్పుడు జరిగిన గాథ అన్నమాట.

తన అరణ్యవాసం పద్నాలుగేళ్ళలోనూ యేకొద్దిమాసాలో తప్ప చాలా కాలం మన దేశంలోనే వున్నాడతను.

ఈప్రదేశం అంతా దండకారణ్యం అప్పుడు.

ఆదిలో, దండకుడనే వొకరాజు విశాలరాజ్యం యిది.

శుక్రుడు శపించగా మహారణ్యం అయిపోయిందిది.

ఇక్కడ మున్యాశ్రమాలూ వున్నాయి, రాక్షసనివేశనాలూ వున్నాయప్పుడు దండిగా.

మన గోదావరీ మధురజలాలు సీతారాములక్ష్మణ స్నానపుణ్యాలు.

రాముడనేకనదులు చూశాడు, స్వయంగా వొక నది వొడ్డునే పుట్టి పెరిగి వ్యవహరించాడు కూడా; కాని మన గోదావరి వంటిది మాత్రం మరొకటి కనపడలేదతనికి.

రావణుడు సీత నెత్తుకుపోయిన స్థలం, మన భద్రాచలం దగ్గిర వున్న పర్ణశాల.

భద్రాచలం వెళ్ళే యాత్రికుల కదిప్పి వొక తీర్థక్షేత్రం.

సీత రావణుడి పాలబడడమూ — రాముడిక్కడి రాక్షసుల సందరసి చంపి, నిరాటంకంగా తపస్సు చేసుకోడానికి మహర్షులకు వీళ్ళు కలిగించడమూ—వీటన్నో, సీతారామలక్ష్మణులకూ మనకూ అవినాభావం యేర్పడిపోయింది.

మన దేశంలో యీ ముగ్గురి పేళ్లూ లేని వూళ్ళే కాదు — ఇళ్ళే లేవు.

నాలుగయినా కొంప లొక చోట వున్నాయంటే, అక్కడ రామా లయం వుందన్నమాటే.

మోక్షసాధనాల్లో రామభజన మనకు ప్రధానం.

మన రామదాసూ, మన త్యాగరాజూ రామభజన చేసుకోడానికి, శాస్త్రీయ మైన గొప్ప గేయవాఙ్మయం యిచ్చిపోయారు మనకి.

కర్ణాటకసంగీతాని కదే లక్ష్యసంపద యిప్పుడు.

మన దగ్గిరచుట్టం అయిన రాముడు మహావీరుడూ, ప్రకృతి సౌందర్యపిపాసీ, దుష్టశిక్షకుడూ, శిష్టరక్షకుడూ, ముఖ్యంగా, విప్ర లంభశృంగార యోగిన్నీ.

రాజ్యభ్రంశం అతనికి దుఃఖకారణం కాలేదు.

వనవాసమున్నూ అతనికి ఖేదహేతువు కాలేదు.

సీతావియోగమే అతని గుండెలు పగలగొట్టింది.

సీతను తలుచుకుని అత నేడ్చిన యేడ్పు కవిత్వానికి పరమావధి.

పురుషుడి కుండవలసిన రసస్నిగ్ధతకున్నూ అది పరాకాష్ఠ.

పురుషుడు తాను చేసుకున్న స్త్రీయెడల కనపరచివలసిన ఆత్మీయత కున్నూ అది అవతలి వొడ్డు.

మనుష్యజన్మకు అదే ప్రధాన మైన గమ్యం.

ఇక్కడ వుండినంతకాలమూ రాముడి జీవితంలో ఇలాంటి విశుద్ధ మానవత్వమే భాసించింది.

అతను మనలో వొక డయిపోడాని కిదే కారణం.

బుద్ధ ప్రసన్నగాడీ మానసవతకు పరిణామం దేవత్వమే అని నిరూపించాడు చివరికి మన కతను.

ఏదయినా అసందర్భం వస్తే, మనలో ప్రతీస్త్రీ-ప్రతీ పురుషుడూ-ఆబాలగోపాలమూ "రామరామా" అంటారే గాని మరో దేవుణ్ణి తలుచుకోరు.

రామసప్తాహాలూ, సామ్రాజ్యపట్టాభిషేకాలూ ఇక్కడ నిత్యోత్సవాలు.

భరతఖండంలో వొక్క మన తెనుగుదేశం మాత్రమే సీతారామ కల్యాణవైభవాలతో పచ్చతోరణం అయిపోతుం దీచివరినుంచి ఆచివరికి.

దాని కొంచెం ముందువెనకలుగానే మన దేశంలో వివాహాల సంరంభం.

దయనీయ మైన సీతారాముల కరుణామయజీవితాని కిది రంగస్థలం కావడమే మన భవభూతి ఉత్తరరామచరితం రచించడానికి హేతువు.

సంయోగశృంగారం గొప్పదే; కాని, విప్రలంభశృంగారంలో వున్నంత రసస్నిగ్ధతా లేదందులో, అంత స్పందనశీలమూ కాదది.

కనకనే రామాయణం అంటే మనకు మక్కువ యెక్కువ.

ఆరామాయణాని కంతకీ యీ అరణ్యకాండ ఉత్కృష్టమూ, దాని గాథ అంతా యిక్కడిదే కావడం మన అదృష్టమూను.

రాజమండ్రి
1-2-1956

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
అనువాదకర్త

# విషయసూచిక

# రామాయణం

## అరణ్యకాండ

### రాముడు దండకారణ్యంలో ఒక మున్యాశ్రమం చేరడం

సీతా, లక్ష్మణుడూ వెంట వస్తూవుండగా, మహాధైర్యశాలీ దుర్ధర్షుడూ అయిన రాముడు మహారణ్యాలలో వొకటయిన దండకారణ్యం ప్రవేశించాడు. ఆదిలో దండకు డనే వొక రాజు విశాలరాజ్యం అది. అయితే, శుక్రశాపం తగిలి అది మనుష్యులు చొరరాని వొక మహారణ్యం అయిపోయింది.

ప్రవేశించీ ప్రవేశించడంతోనే రాముడు ఆదండకారణ్యంలో వొక మునిపల్లె చూశాడు. ఆమునిపల్లెలో ప్రతీపర్ణశాలముందూ చక్కగా అలికి ముగ్గులు తీర్చారు. అక్కడక్కడ కుశలు ఆరబెట్టుకున్నారు. ఎక్కడచూసినా చక్కగా వుతికిన నారచీరలు ఆరుతున్నాయి. రకరకాల జంతువులూ పక్షులూ అక్కడ చాలా వుల్లాసంగా వున్నాయి. సకలప్రాణులకూ అది నిరపాయమైన వాసస్థలం అయివుంది.

అసాధారణమైన బ్రహ్మవర్చస్సుతో నిండి, అది, మధ్యందిన సూర్యమండలం లాగ చూడ శక్యం కాకుండా వుంది. ప్రతీదినమూ అప్సరసలు వచ్చి, ఆ మునులను పూజించి నృత్యం చేసి వారి నానంద పెడుతూ వుంటారు.

మహారణ్యాలలో వుండే రకరకాల ఫలవృక్షా లన్నీ అక్కడ విరగకాసి వున్నాయి. ఆ పల్లెలో వుండిన అగ్నిహోత్ర గృహాలు

చాలా పెద్దవి. అవి దర్భలతోనూ, సమిధలతోనూ, స్రుక్స్రువాల తోనూ, కృష్ణాజినాలతోనూ, నీళ్ళబిందెలతోనూ, కందమూల ఫలాలతోనూ నిండి వున్నాయి. ఎక్కడ చూసినా హోమాలూ భూతబలులూ జరుగుతున్నాయి. వేదఘోష శ్రావ్యంగా వినవస్తోంది. ఎటుచూసినా పూలచెట్లు తెగపూసి వున్నాయి. అక్కడ వుండిన విశాలతటాకం కలవలతోనూ, తామరపువ్వులతోనూ నిండివుంది. అక్కడి మునులందరూ సూర్యబింబంలాగా, అగ్నిహోత్రం లాగా ప్రకాశిస్తున్నారు. వారు కందమూలఫలాలు మాత్రమే భుజిస్తారు. నారచీరలూ, కృష్ణాజినాలూ, మట్టుకే ధరిస్తారు.

ఆమునులకు పూజ్యులైన పరమర్షులున్నూ అక్కడ యెందరో వున్నారు. వారందరూ నియతాహారులు. పుణ్యమూర్తులు. బ్రహ్మ జ్ఞానసంపన్నులైన బ్రాహ్మణులున్నూ అక్కడ చాలామంది వున్నారు. వారందరూ నిరంతరము వేదఘోష చేస్తూ వుంటారు.

ఇలాంటి మునులతోనూ, మహర్షులతోనూ, బ్రాహ్మణోత్తముల తోనూ నిండి ఆమునిపల్లె బ్రహ్మలోకం అంత ప్రసిద్ధిపొందింది. మహా తేజశ్శాలి అయిన రాముడు ధనుస్సు ఎక్కుడించేసి సవినయంగా ఆశ్రమం ప్రవేశించాడు. చంద్రుడు లాగ తేజరిల్లుతున్న రాముణ్ణీ యశస్విని అయిన సీతనూ, లక్ష్మణుణ్ణీ చూసి దివ్యజ్ఞానసంపన్నులైన ఆశ్రమవాసు లందరూ మంగళాశీర్వాదాలు చేస్తూ యెదురు వెళ్ళారు. రాముని సమవిభక్తాంగ సౌందర్యమూ, వర్చస్సూ, సౌకుమార్యమూ, సువేషమూ చూసి ఆపల్లెలో వుండినవా రందరూ ఆశ్చర్యచకితు లైనారు. జగన్మోహన దివ్యమంగళవిగ్రహులైన సీతనూ లక్ష్మణుణ్ణీ చూసిన్నీ వారు చాలా ఆశ్చర్యపడ్డారు.

మహాభాగులైన ఆ మునిపల్లెవాసు లందరూ అతిథిగా వచ్చిన — సర్వభూతహితులైన రాముణ్ణి ఒకపర్ణశాలలో ప్రవేశపెట్టి అర్ఘ్య

పాద్యాదికంతో యథాశాస్త్రంగా పూజించారు. మరిన్నీ వారు "ఇదే ఆశ్రమం. ఇవే పుష్పాలు. ఇవే ఫలాలు" అని ప్రాంజలులై నివేదించి "రామా! నువ్వు రాజువు. దుష్టశిక్షకుడవు. గురుడవు. వర్ణాశ్రమధర్మపరిపాలకుడవు. అందుచేత మా కందరికీ నువ్వు శరణ్యం. పూజ్యుడవున్నూ. రాఘవా! రాజంటే ఇంద్రుని నాల్గంశలలో ఒక అంశ, కనక, రాజు సకలభోగాలూ అనుభవించడానికి అర్హుడు. మేమందరమూ నీరాజ్యంలో నివసిస్తున్నాము. కనక, నీరక్షణ పొందడానికి మా కధికారం వుంది. నగరంలో వుండినా అరణ్యాలలో ఉండినా నువ్వే మాకు రాజువు. మేము జితేంద్రియులం. జితక్రోధులం. మాకెవ రెంత అపకారం చేసినా మాకు మేము వారిని దండించం. మేము నీబిడ్డలం. కనక, నువ్వు మమ్మెప్పుడూ రక్షిస్తూ వుండాలి" అని విన్నవించి, పూలతోనూ పళ్లతోనూ సీతాలక్ష్మణులతో కూడా రాముణ్ణి పూజించి అనేకవిధాల సంతృప్తిపరచారు.

## ౨

## విరాధుడు సీతను పట్టుకోడం

మర్నాడు సూర్యోదయం కాగానే తమకు అతిథిసత్కారాలు చేసిన ఆశ్రమవాసుల సెలవు పొంది రాముడు అడవికి బయలుదేరాడు. అది చాలాభయంకరమైన కీకారణ్యం. అన్నిరకాల క్రూరజంతువులూ ఆమహారణ్యంలో వున్నాయి. లేళ్లు దుప్పులు మొదలైన సాధుజంతువులున్నూ తండోపతండాలుగా వున్నాయి. అనేకమహావృక్షాలు కూలిపోయివున్నాయి. ఎంతో దూరం వ్యాపించివుండిన లతలున్నూ చాలా నలిగిపోయివున్నాయి. అక్కడక్కడ చెరువు లెన్నో వున్నాయి; కాని అన్నీ చూడశక్యం కాకుండా వున్నాయి.

రాముడు సీతతోనూ లక్ష్మణునితోనూ ఆ కీకారణ్యం ప్రవేశించిన వెంటనే వొక రాక్షసుడు కనపడ్డాడు. వాడు గొప్ప పర్వతశిఖరం లాగ వున్నాడు. వాడి మాట వురిమినట్టుంది. వాడింతవరకూ ఎందరో నరులను భక్షించివున్నాడు. మిడిగుడ్లతో వాడి ముఖం మహాభయంకరంగా వుంది. పొడుగ్గా, వికృతంగా, వంకరటింకరగ్గా, చాకిబానంత కడుపుతో చాలాభీభత్సంగా వున్నాడు వాడు.

ఈరూపానికి సాయం వాడు పులితోలు చుట్టబెట్టుకున్నాడు. అది అప్పుడే తీసింది. ఇంకా రక్తమూ కొవ్వూ కారుతూనే వుంది. వాడు సావకాశంగా కూచుని తినడానికి ఇనపశూలానికి మూడు సింహాలనూ, నాలుగు పులులనూ, రెండు తోడేళ్లనూ, పదిజింకలనూ, పెద్దదంతం గల యేనుగుతల వొకటీ గుచ్చి బుజాన పెట్టుకుని వున్నాడు.

సీతనూ, రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ చూశాటప్పటికి వాడు ఉగ్రుడై పోయాడు. వెంటనే ఆకాశం చిల్లులుపడేటట్టు అరుస్తూ, భూమి వొణికి పోయేటట్టు అడుగులు వేసుకుంటూ వచ్చి గభీమని సీతనుపట్టుకుని చంకని పెట్టుకుని "విల్లంబులూ ఖడ్గాలూ ధరించి భార్యతో కూడా వచ్చారు మీరెవరురా? ఇది నానివాసం. ఆయువు మూడి మీరిక్కడికి వచ్చారు. మునివేషాలు వేసుకువచ్చారు కాని మిమ్మల్ని నేను సహించను. నాపేరు విరాధుడు. నేను మునులను చంపి భక్షిస్తూ ఈవనంలో స్వేచ్ఛగా వుంటున్నాను. ఈపిల్ల చాలా చక్కగా వుంది. కనక నాకు పెళ్లామయి వుంటుంది. మీరక్తంమాత్రం నేను తాగేస్తాను" అంటూ పరవళ్లు తొక్కాడు.

వాణ్ణి చూసీ, వాడి మాటలు విని, వాడిచేతుల్లో చిక్కి సీత గాలి వానలో అరటిచెట్టులాగ వొణికిపోతూ కొయ్యఅయిపోయింది. అది చూడగానే రామునకు నోరెండిపోయింది; కాని యెలాగో ప్రకృతిస్థుడై అతికష్టంమీద మాట తెచ్చుకుని లక్ష్మణునితో "తమ్ముడా!

జనకమహారాజు కూతురూ, నాభార్యా అయిన సీత కెలాంటి గతి పట్టిందో చూడూ. వరంకోరినప్పుడు కైక యేమి భావించిందో అది యిప్పుడే మనకి సంభవించింది. కైక తన కొడుక్కి రాజ్యం కావాలని వూరుకుందా? నేను వనవాసం చెయ్యాలనడంలో ఆమె వుద్దేశం యేమిటో గ్రహించావా? అరణ్యాలలో సీత కిలాంటి ఆపత్తు రాక తప్ప దనీ, దానిమీద నేను సర్వనాశనం అవుతా ననీ, అలా అయితే తన కొడుకు రాజ్యం నిష్కంటకం అవుతుం దనీ ఆమె వూహా. నిజంగా ఇప్పుడు కైక వూహా నెరవేరింది. నాయునగారిని విడిచివుండడం సందుకూ, నాకు రాజ్యం లేకుండా పోయినందుకూ దుఃఖం లేదు; కాని సీతను మరొకడు తాకడం నాకు దుస్సహంగా వుంది" అంటూ కళ్లల్లో నీళ్లు పెట్టుకున్నాడు.

అది చూసి లక్ష్మణుడు క్రుద్ధుడై కాలసర్పంలాగ రోజుకుంటూ "అన్నా! నువ్వు సకలజగత్తుకూ నాథుడవు. దేవేంద్రునితో సమానుడవు. నీసేవకుణ్ణి నేనుండగా నువ్వనాథ లాగ యెందుకు దుఃఖిస్తావు? నేనొక్క బాణంతో క్రూరరాక్షసు డైన యీవిరాధుణ్ణి కూలగొడతాను. భూదేవి వీడి కవోష్ణరక్తం తృప్తిగా పానంచేస్తుంది. కైక తన కొడుక్కి రాజ్యం కావా లన్నప్పుడు నాకు భరతునిమీద వచ్చిన కోపం అంతా యిప్పుడు డీవిరాధునిమీద, ఇంద్రుడు పర్వతం మీద వజ్రాయుధం విడిచినట్టు విడిచిపెడతాను" అని గర్జించాడు.

## 3

### సీతను విడిచి విరాధుడు రామలక్ష్మణులను ఎత్తుకుని బయలుదేరడం

రాముడితో ఇలా/అని లక్ష్మణుడు విరాధుణ్ణి చూసి వికటంగా నవ్వుతూ "ఎవడవురా నువ్వు?" అని అడిగాడు. అందుకు వాడు విరా

ధుడు "నే నడిగిందే మీరడుగుతున్నారు. మీరెవరు? ఎక్కడికి వెడతారు?" అని ఎదు రడిగాడు. దానిమీద రాముడు "మేము ఇక్ష్వాకువంశీయులం. క్షత్రియులం. దశరథమహారాజు కొడుకులం. మా నాయనగారి ఆజ్ఞచొప్పున మేము వనవాసం చెయ్యడానికి వచ్చాము. అసలు నువ్వెవడవు? ఈదండకారణ్యంలో ఎందుకున్నావు!" అనడిగాడు.

అది విని సత్యపరాక్రముడైన రాముణ్ణి చూసి విరాధుడు "రామా, విను. నాతండ్రి జయుడు. నాతల్లి శతహ్రద. రాక్షసు లందరూ నన్ను విరాధు డని పిలుస్తారు. ఎలాంటి శస్త్రంతోనూ ఎవరూ కూడా నన్ను నరకలేరు. చీల్చలేరు. చంపలేరు. ఘోర తపస్సు చేసి మెప్పించగా బ్రహ్మదేవుడు నాకీవరం అనుగ్రహించాడు. మీరు ఈసుందరిని, దీనిమీది ఆశా విడిచి వెళ్ళిపొండి. పరుగెత్తి పొండి. లేకుంటే మాట తక్కువ. నిజానికి మీప్రాణాలతో నాకేమీ పని లేదు" అంటూ వురిమాడు.

ఈమాటలు వినేటప్పటికి రాముడు అగ్నిహోత్రం అయిపోయాడు. "తుచ్ఛుడా! ఉత్తమకులస్త్రీమీద ఆశపెట్టుకుని నువ్వు చాలా నీచమైన కోరిక కోరుకుంటున్నావు. ఇది నీమరణానికి కారణం అవుతుంది. నాయెదట నువ్వు ప్రాణాలతో పోలేవు" అని గర్జించి అతను, వెంటనే ధనుస్సు ఎక్కుపెట్టి కరుకుబాణాలు తొడిగి లాగి విరాధుణ్ణి కొట్టాడు. ఇలాగ అతను ఏడు బాణాలు విడిచాడు. అవి గరుత్మంతుడులాగ వాయువేగంతో వెళ్ళి విరాధుణ్ణి నాటుకున్నాయి. నెమిలి రెక్కల పుంఖాలు గల ఆబాణాలేమో విరాధుని శరీరం దూసుకుపోయి రక్తంతో తడిసి అగ్నిజ్వాలల్లాగ నేలమీద పడ్డాయి.

ఆదెబ్బలు తిని వాడు మిక్కిలి కోపించి సీతను కిందదించి శూలం పుచ్చుకుని రాముని మీదా లక్ష్మణుని మీదా వురికాడు. శూలం

పుచ్చుకుని వాడు ముందు కురికినప్పుడు నోరు తెరుచుకుని మృత్యువే మీదపడ్డట్టుంది. అప్పుడు రామలక్ష్మణులు వాడిమీద శరవర్షం కురిశారు. అందుకు వికటంగా నవ్వి వాడు వొళ్ళువిరుచుకున్నాడు. రాఘవుల బాణాలు వాడి శరీరంలోనుంచి కిందపడిపోయాయి.

వరమహిమవల్ల అంతట ఆవిరాధుడు ప్రాణాలుహృదయంలో భద్రపరుచుకుని, మళ్ళీ శూలం పుచ్చుకుని రామలక్ష్మణులమీద కురికాడు. ఆశూలం ఆకాశాన దావాగ్నిలాగ మెరిసింది. రెండుబాణాలతో రాముడు దాన్ని ముక్కలు చేసేశాడు. ఆశూలం వజ్రాయుధంతో ఇంద్రుడు కొట్టగా పడిపోయిన మేరుపర్వతశిఖరం లాగ భూమిమీద పడిపోయింది. అప్పుడు విరాధుడు మళ్ళీ మీది కురకగా నల్లతాచులాంటి ఖడ్గాలతో దెబ్బమీద దెబ్బచొప్పున కొట్టారు. అందుకా విరాధుడు మిక్కిలీ రౌద్రుడై పర్వతాలలాగ చలించకుండా నిలిచివుండిన రామలక్ష్మణులను చేతులలో యిరికించుకుని బయలుదేరాడు.

దానిమీద రాముడు "తమ్ముడా! వీడీదారిని మనలను తీసుకుపోవడం మంచిదే. ఏమంటే? వీడు మనం వెళ్ళవలసిన దారినే బయలుదేరాడు" అని లక్ష్మణునితో అన్నాడు. అప్పుడు విరాధుడు వారిద్దరినీ భుజాలమీద యెక్కించుకుని పిడుగులు పడుతున్నట్టురిమి అరణ్యంలోకి బయలుదేరాడు. ఆఅరణ్యం నీలజీమూతంలాగ దట్టంగా వుంది. అందులో ఆకాశం అంటుతూ రకరకాల చెట్లు ఎన్నో వున్నాయి. చిత్రవిచిత్రాలైన పక్షులు కూడా అందులో లక్షలూ కోట్లూ వున్నాయి. నక్కలకు లెక్కలేదు. కాలసర్పాలున్నూ అసంఖ్యాకంగా వున్నాయి. ఆ ఘోరారణ్యంలో వాడు నిరాటంకంగా నడిచిపోసాగాడు.

## రామలక్ష్మణులు విరాధుణ్ణి గోతిలో పూడ్చిపెట్టడం

విరాధుడలాగ రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ యెత్తుకుపోతూ వుండడం చూసి సీత చేతులు నలుపుకుంటూ "నారాముడు సత్యవాది. శీలవంతుడు. శుచి. రౌద్రాకారుడైన యీరాక్షసుడు లక్ష్మణునితో కూడా నారాముణ్ణి తీసుకుపోతున్నాడు. నన్నిక తోడేళ్ళూ, పులులూ, చిరుతలూ మింగేస్తాయి" అనుకుని "ఓరాక్షసుడా. నీకు దండాలు. రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ విడిచిపెట్టి నన్ను తీసుకుపో" అంటూ సీత గొంతెత్తి యేడ్చింది.

అది విని రాముడూ లక్ష్మణుడూ "ఇక యీరాక్షసుణ్ణి త్వరగా సంహరించివెయ్యాలి" అనుకున్నారు. వెంటనే లక్ష్మణుడు వాడి యెడమచెయ్యి నరికేశాడు. ఆవెంటనే రాముడు కుడిచెయ్యి నరికేశాడు. దాంతో విరాధుడు నీలమేఘంవంటి పర్వతశిఖరం నేలకూలినట్టు బొబ్బలుపెడుతూ పడిపోయాడు. వెంటనే రాముడూ లక్ష్మణుడూ వాణ్ణి కాళ్ళతో తన్నారు. పిడికిళ్ళతో కుమ్మారు. మోకాళ్ళతో పొడిచారు. నేలమీద ఇటూ అటూ దొర్లించి పచ్చడి చేశారు. బాణాలతో తూట్లు పొడిచారు. కత్తులతో నరికారు. అయినా వాడు చావలేదు.

అది చూసి రాముడు "తమ్ముడా! తపోమహిమవల్ల యేమిచేసినా వీడు చావకుండా వున్నాడు. కనక గొయ్యితీసి వీణ్ణి పాతి పెట్టేదాం" అన్నాడు. ఆమాటమీద విరాధుడు "రామా, నువ్వు మహేంద్రునితో సమానుడవు. నీచేతిలో నేను చచ్చిపోయాను. అజ్ఞానంవల్ల మొదట నీసంగతి నేను తెలుసుకోలేకపోయాను. కౌసల్య కడుపుచల్లగా, నువ్వు మహానుభావుడవు. నీసంగతే కాక లక్ష్మణుని

సంగతీ, సీతసంగతీ కూడా నాకిప్పుడు తెలిసివచ్చింది. నేను తుంబురుడనే గంధర్వుణ్ణి. కుబేరుని అధికారవర్గంలో వాకణ్ణి. అయితే, రంభని విడిచివెళ్ళలేక నేను నావిధులు అశ్రద్ధచేశాను. అందుకు కోపించి నాప్రభువైన కుబేరుడు ఇలాగ రాక్షసుడవయిపొమ్మని నన్ను శపించాడు, "దశరథమహారాజు కొడుకైన రాముడు నిన్నెప్పుడు యుద్ధంలో సంహరిస్తాడో అప్పుడు నీకు శాపం తొలగిపోతుంది. మళ్ళీ నువ్వు స్వర్గానికి వస్తావు" అని కుబేరుడు నాకు శాపాంతం కూడా అనుగ్రహించాడు. అలాంటినేను నీఅనుగ్రహంవల్ల ఘోరశాపవిముక్తుణ్ణాయినాను. ఇదే నేను స్వర్గానికి వెళ్ళిపోతాను. మీకు క్షేమం అగుగాక" ఇక్కడికి ఒకటిన్నర ఆమడల దూరాన ధర్మాత్ముడైన శరభంగమహర్షి వున్నాడు. సూర్యసన్నిభుడైన ఆమహర్షి ఆశ్రమానికి నువ్వు త్వరగా వెళ్లు. అతను నీకు సకల శ్రేయస్సులూ కలిగిస్తాడు. గొయ్యితీసి పూడ్చిపెట్టడం రాక్షసులకు కులధర్మం. కనక, నన్ను గోతిలో పూడ్చిపెట్టి వెళ్లు. అలా చేస్తే నాకు పుణ్యలోకాలు లభిస్తాయి" అని చెప్పాడు.

అది విని రాముడు "ఏనుగును పూడ్చిపెట్టాలంటే యెంత గొయ్యి కావాలో అంతగొయ్యి తవ్వు" అని లక్ష్మణునితో చెప్పి, విరాధుణ్ణి కదలకుండా కంఠం తొక్కిపట్టి నుంచున్నాడు. అప్పుడు గునపం పుచ్చుకుని లక్ష్మణుడు విరాధుని పక్కనే పెద్దగొయ్యి తవ్వాడు. వెంటనే అన్నదమ్ములిద్దరూ విరాధుణ్ణి గోతిలోకి తోసివేసి రాళ్లతో పూడ్చివేశారు. గోతిలో పడతోసినప్పుడు విరాధుడు అడవి అంతా దద్దరిల్లిపోయేటట్టు పెడబొబ్బలు పెట్టి చివరికి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

ఘోరరూపుడూ, దురంతకుడూ అయిన విరాధుడు ఈవిధంగా చనిపోయినందుకు రామలక్ష్మణులు చాలా సంతోషించారు. మరిన్ని

వారు భూమికి వచ్చిన సూర్యుడు లాగా, చంద్రుడు లాగా, భాసిస్తూ, మళ్ళీ ధనుర్బాణాలు ధరించి సీతను వెంటబెట్టుకుని మహోత్సాహంతో అడవిలో ముందుకి సాగారు.

## ౫

## రాముడు చూస్తుండగా శరభంగుడు బ్రహ్మలోకానికి పోవడం

భీమబలు డైన విరాధుణ్ణి అలా చంపి, రాముడు, సీతను కౌగిలించుకుని వూరడించి, దీప్తతేజు డైన లక్ష్మణునితో "తమ్ముడూ చొరశక్యం కాని యీఅరణ్యంలో చాలా అపాయకరంగా వుంది. మనకి వనవాసానుభవం లేదు ; కనక, మనం త్వరగా శరభంగాశ్రమానికి వెళ్ళిపోదాం" అని చెప్పి బయలుదేరాడు.

శరభంగుడు దేవతలకున్నూ దుర్లభ మైన మహాప్రభావం గలవాడు. బ్రహ్మసాక్షాత్కారం పొందినవాడు. రాముడు సీతా లక్ష్మణులతో అతని ఆశ్రమం సమీపించాటప్పటికి అద్భుత మైన గొప్పవస్తు వొకటి కనపడింది.

అక్కడికి దేవేంద్రుడు వచ్చివున్నాడు. సూర్యుడు లాగా అగ్నిహోత్రం లాగా వెలిగిపోతున్నా డతను. అతను వెలలేని ఆభరణాలూ మిలమిల మెరిసిపోయే తెల్లని వస్త్రాలూ ధరించివున్నాడు. అచ్చంగా అతనిలాగే వుండినవా రెందరో పరివేష్టించి అతణ్ణి సేవిస్తున్నారు. అతని రథం అప్పుడే వుదయించిన సూర్యబింబంలా వుంది. గుర్రాలు నీలమణుల్లాగ మిలమి ల్లాడుతున్నాయి. అతని ఛత్రం తెల్లగా పాండుర మేఘంలా వుంది. చంద్రమండలం లాగ మెరుస్తోంది. రకరకాల దండలతో అది చాలా చక్కగా వుంది. బంగరు కామ లున్న చామరాలూ వీవనలూ పుచ్చుకుని దేవతాస్త్రీలు అతణ్ణి సేవిస్తున్నారు.

గంధర్వులూ, దేవతలూ, సిద్ధులూ, అనేకమంది మహార్షులూ ఆకాశాన వుండిన ఆయింద్రుణ్ణి రసవంతంగా కొనియాడుతున్నారు. మరిన్నీ, ఆదేవేంద్రుడు, రథందిగి భూమి అంటకుండా అంతరిక్షంలోనే నిలిచి శరభంగమహర్షితో మాట్లాడుతున్నాడు.

అది చూసి, ఆరథం చూపిస్తూ రాముడు లక్ష్మణునితో "తమ్ముడూ! మధ్యాహ్నదినసూర్య మండలంలాగ ఆకాశాన మెరిసి పోతున్న ఆరథం చూడూ. మహేంద్రుని గుర్రాలనుగురించి మనం చాలా సంగతులు విన్నాం. అవే ఆగుర్రాలు. రథం చుట్టూ వుండిన పురుషుల్ని చూశావా? వారందరూ నవయౌవనులు. కుండలాలూ ఖడ్గాలూ ధరించి వున్నారు. వారి వక్షస్థలా లెంత విశాలంగా వున్నాయో చూడూ. పరిఘల్లా వున్నాయి వారి చేతులున్నూ చూడూ. ఎర్రని పట్టుబట్టలు కట్టుకుని వారందరూ పెద్దపులులా అన్నట్టు చూడశక్యం కాకుండా వున్నారు. అందరికీ మెడలో గొప్ప గొప్ప రత్నహారాలున్నాయి. వారందరూ కూడా ఇరవైఅయిదు సంవత్సరాలకు లోపుగా వున్నారు. ఇది దేవతలకు తరగని వయస్సు అన్నమాట. పెద్దపులుల్లాగే వుండిన వారందరూ చాలా ముచ్చటగా వున్నారు సుమా. ఆతేజస్వులెవరో తెలుసుకుని వస్తాను. అంతవరకూ సీతతో కూడా నువ్విక్కడే వుండు."

ఇలా చెప్పి రాముడు శరభంగాశ్రమానికి బయలుదేరాడు. ఇంద్రుడది చూశాడు. వెంటనే అతను శరభంగునితో "మహర్షీ! రాముడిలా వస్తున్నాడు. అతను నాతో మాట్లాడకముందే కార్యం పూర్తిచేసుకోవాలి. అతను చాలా గొప్పపను లెన్నో చెయ్యవలసి వున్నాడు. అతను తప్ప అవి మరెవరూ చెయ్యలేరు. అవి పూర్తి అయిన తరవాతే అతను నాతో మాట్లాడడం మంచిది" అని చెప్పి మహర్షి సెలవు పుచ్చుకుని రథం ఎక్కి వెళ్ళిపోయాడు.

ఇంద్రుడు వెళ్ళిపోయిన తరవాత రాముడు శరభంగమహర్షి దర్శనం చేశాడు. అప్పటికి మహర్షి అగ్నిహోత్రం చేసుకుంటున్నాడు. రాముడూ, సీతా, లక్ష్మణుడూ మునికి సాష్టాంగ నమస్కారాలు చేశారు. ముని వారిని చాలా గౌరవించి, కూచోమని ఆసనా లిచ్చాడు.

అప్పుడు రాముడు ఇంద్రుని సంగతి అడగ్గా, మహర్షి జరిగిం దంతా చెప్పి "రామా! ఇంద్రుడు నన్ను బ్రహ్మలోకానికి తీసుకువెళ్ళా .లని వచ్చాడు. నేను చేసిన తపస్సుకి మెచ్చి వచ్చా డతను; కాని నేను నీరాక చూశాను. నువ్వు ధార్మికుడవు. మహాత్ముడవు. నిన్ను చూడకుండా, నీకు అతిథిసత్కారాలున్నా చెయ్యకుండా బ్రహ్మలోకానికి వెళ్ళడం యిష్టం లేక నేనుండిపోయాను. నేను అక్షయలోకా లనేకాలు — అంటే బ్రహ్మలోకమూ దేవలోకమూ మొదలైనవి, శాశ్వతమైనవి సంపాదించుకున్నాను. అవన్నీ యిప్పుడు సమర్పించుకుంటున్నాను నువ్వు స్వీకరించు" అని ప్రార్థించాడు.

అందుకు రాముడు "మహర్షీ! నువ్వు చెప్పిన లోకా లన్నీ నేను స్వీకరిస్తాను; కాని ప్రస్తుతం నేనీ అడవిలో నివసించవలసివుంది" అని బదులు చెప్పాడు. దానికి శరభంగుడు "రామా! ఈవనంలో సుతీక్ష్ణు డనే మహర్షి వున్నాడు. అతను పరమధార్మికుడు. చాలా గొప్పవాడు. నువ్వు అతని దగ్గిరికి వెళ్ళు. అతను ఈమహారణ్యంలో రమణీయ మైన ప్రదేశంలో నీకు వసతి యేర్పాటు చేస్తాడు. నువ్వీ మందాకినీనది గట్టునే బయలుదేరి వెడితే అతణ్ణి చేరగలవు. నీకది మంచిదారి. అయితే, నాయనా! ఇక్కడ వొక్క క్షణం వుండు. తాచుపాము కుబుసం విడిచిపెట్టేటట్టు నేనిప్పుడు ఈబడుగు దేహం విడిచిపెట్టేస్తాను" **అని** చెప్పి, మంత్రవేత్త అయిన ఆశరభంగుడు ఆజ్యహోమం చేసి అగ్నిని ప్రజ్వలింపచేసి ఆహోమగుండంలో పడ్డాడు.

వెంటనే అగ్ని ఆమహర్షి రోమాలూ, కేశాలూ, జీర్ణమయిపోయిన చర్మమూ, ఎముకలూ, రక్తమూ, మాంసమూ చూస్తుండగా భస్మం చేసేశాడు. రాముడూ సీతా లక్ష్మణుడూ అది చూసి చాలా ఆశ్చర్యపడ్డారు. ఇంతలో శరభంగుడు నవయౌవనసంపన్నుడై ఆఅగ్ని గుండంలోనుంచి అగ్నిహోత్రం లాగ వెలిగిపోతూ వచ్చి ఆహితాగ్నులూ, మహాత్ములైన మహర్షులూ, దేవతలూ నివసించే లోకాలన్నీ దాటి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. అప్పటికి బ్రహ్మ అనుచరులందరూ పరివేష్టించగా నిండుకొలువుతీరి వున్నాడు. అతను, బ్రాహ్మణోత్తముడైన శరభంగుడు వచ్చీరావడంతోనే చాలా సంతోషించి "సుస్వాగతం" అన్నాడు సాదరంగా.

## ౬

## రాముడు మునులకు అభయదానం ఇవ్వడం

శరభంగమహర్షి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాక రాముణ్ణి చూడ్డానికి మునులు గుంపులుగుంపులుగా వచ్చారు. వారిలో వైఖానసు లున్నారు. వాలఖిల్యు లున్నారు. సంప్రక్షాళికులూ, సదా అంతఃకిరణా లాస్వాదించే మరీచిపులూ, అశ్మకుట్టులూ, పత్రాహారులూ, దంతోలూఖలినులూ, ఉన్మజ్జకులూ, గాత్రశయ్యావ్యపరులూ, అశయ్యులూ, అభ్రావకాశకులూ, జలాహారులూ, వాయుభక్షులూ, ఆకాశనిలయులూ, స్థండిలశాయులూ, వ్రతోపవాసులూ, దాంతులూ, ఆర్ద్రివస్త్రులూ, సజపులూ, తపోనిత్యులూ, పంచతపోన్వితులూ కూడా వున్నారు. అందరూ బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్నారు. అందరూ జితేంద్రియులు. అందరూ యోగనిష్ఠులు.

ధర్మజ్ఞులైన ఆమహర్షు లందరూ రాముని చుట్టూ చేరి "రామా! దేవతలకు ఇంద్రుడు లాగ, ఇక్ష్వాకుకులానికీ ఈ పృథివికీ నువ్వు

నాథుడవై ఉన్నావు. నీకీర్తీ, నీపరాక్రమమూ ముూడులోకాల్లోనూ ప్రఖ్యాతివహించి వున్నాయి. పితృభక్తీ, సత నిష్ఠా, ధర్మచింతా నీదగ్గిర పుష్కలంగా వున్నాయి. అలాంటి మహాత్ముడవు నువ్వు, నిన్నొకటి కోరుతున్నాము మేము అందుకు క్షమించు. ప్రజల ఆదా యంలో ఆరోవంతు పన్నులరూపంగా వసూలుచేస్తూ ఏరాజు తన ప్రజలను పుత్రవతుగా పాలించడో ఆ రాజు మహాపాపానికి అయిపో తాడు. ఏ రాజు ప్రజల సుఖమే తన సుఖంగా భావించి పరిపాలిస్తాడో ఆ రాజు చిరస్థాయి అయిన కీర్తి సంపాదించుకోడమే కాకుండా అంతమందు బ్రహ్మలోకానికి వెళ్ళి అవ్యయానందం అనుభవిస్తాడు. కందమూల ఫలాలు మాత్రమే భక్షిస్తూ మహర్షులు ఆర్జించే ధర్మంలో, నాలుగో వంతు ప్రజలను న్యాయంగా పరిపాలించే రాజుకి సంక్రమిస్తుంది. ఇంతకీ: బ్రహ్మవేత్త లయిన యీవానప్రస్థులను చూడూ. వీరి కందరికీ నువ్వు రాజవే; కాని అనాథల్లాగ వీరందరూ రాక్షసుల వల్ల నానాకష్టాలూ పడుతున్నారు. రామా, ఇదిగో, యీఅరణ్యంలో యెక్కడ చూసినా మహామునుల శరీరా లెలాపడివున్నాయో చూడూ. దుర్మార్గులైన రాక్షసులచేతుల్లో చిక్కి వీరందరూ మృతులైనారు. ముఖ్యంగా, పంపానదీప్రాంతానా, మందాకినీనది పొడుగునా, చిత్ర కూట పర్వతప్రాంతానా వున్న మునులు ఈపీడ అనుభవిస్తున్నారు. ఈరాక్షసపీడ మేము సహించలేకుండా వున్నాము. అంచేత మేమంద రమూ నిన్ను శరణుపొందడానికి వచ్చాము. రామా! రాక్షసులబారి పడకుండా మమ్మందరినీ రక్షించు. నీకంటే మాకు మరో గతి లేదు” అని ప్రార్థించారు.

దానిమీద రాముడు “మహాత్ములారా! మీరు నన్ను రక్షించ మని కోరడం ధర్మం కాదు. మీరు నన్ను ఆజ్ఞాపించడానికి అర్హులు. సొంతపనిమీద నేనీ అడవులకు వచ్చాను. అయినా, మీకు రాక్షస

బాధ లేకుండా చెయ్యడం నాకు ప్రధానం. నా తండ్రి ఆజ్ఞ చొప్పున వచ్చినా మీ క్షేమంకోసం నేను వచ్చినట్టున్నూ అయింది. కనక, నేనీ అరణ్యంలో వుండడంవల్ల గొప్ప ఫలమే కలుగుతుంది. మహర్షులయిన మీరంతా మా అన్నదమ్ముల బలపరాక్రమాలు చూడండి. మీ శత్రువు లైన రాక్షసుల నందరినీ మేము సంహరించి వేస్తాము” అని చెప్పి, సీతతోనూ, లక్ష్మణునితోనూ వారందరితోనూ కలిసి సుతీక్ష్ణాశ్రమానికి వెళ్ళాడు.

## ౨

## రాముడు సుతీక్ష్ణాశ్రమం ప్రవేశించడం

సీతారామలక్ష్మణులు మునులతో కూడా చాలాదూరం నడిచారు. దారిలో కూలంకషా లైన అనేకనదులు దాటారు. చివరికి మహా మేఘంలాగ ఎత్తయిన పర్వతం చూశారు. అదొక కీకారణ్యంలో వుంది. ఆ అరణ్యంలో రకరకాల పుష్పవృక్షాలూ, ఫలవృక్షాలూ ఎన్నో వున్నాయి. వాటిమధ్య వుంది సుతీక్ష్ణమహర్షి ఆశ్రమం. ఆశ్రమం అంతటా నారచీర లారుతున్నాయి. ఆశ్రమంలో ఒకచోట మహర్షి కూచుని వున్నాడు. అతని శరీరం అంతా దుమ్మూ ధూళీ నిండి వుంది. పెద్దపెద్ద జడలతో కప్పబడిన్నీ వుంది.

రాముడతని యెదటికి వెళ్ళి “మహర్షీ! నా పేరు రాముడు. నేను నిన్ను చూడ్డానికి వచ్చాను. నన్నాశీర్వదించు” అని వినయంగా అన్నాడు. సుతీక్ష్ణుడున్నూ రాముణ్ణి చూసి, కౌగిలించుకుని “వీరాధి వీరా! రామా! నీకు స్వాగతం. నువ్వు వచ్చివుండడంవల్ల ఈ ఆశ్రమం ఇప్పటికి సనాథం అయింది. నిన్ను చూడ్డంకోసం నేను ఈ శరీరం విడిచి దేవలోకానికి వెళ్ళకుండా వుండిపోయాను. నువ్వు చిత్రకూటం చేరు

కున్నప్పుడే రాజ్యభ్రష్టుడవై అడవులకు వచ్చావని నాకు తెలిసింది. దేవతలకు ప్రభువూ, శతక్రతువూ అయిన మహేంద్రుడిక్కడికి వచ్చి నన్ను చూసి వెళ్ళాడు. "గొప్ప తపస్సు చేసి మహాపుణ్యాం సంపాదించి నువ్వు సకలలోకాలూ జయించా" నని చెప్పాడు మహేంద్రుడు. దేవర్షిజుష్టాలయిన ఆ నాకలోకాలన్నింటా నువ్వు సీతతోనూ లక్ష్మణునితోనూ స్వేచ్ఛగా విహరించు" అని చెప్పాడు.

అప్పుడు బ్రహ్మ యెదట కాశ్యపుడు విన్నవించుకునేటట్టు రాముడు మహాతపశ్శాలి అయిన సుతీక్ష్ణమహర్షిని చూసి "మహర్షీ! సకల లోకాలనూ నేనే సంపాదించుకుంటాను. నువ్వు చెప్పినట్టు ఈఅడవిలో నేను నివసిస్తాను. నువ్వు సర్వభూతహితం కోరే మహానుభావుడవు. చాలా సమర్థుడవు. గౌతమవంశీకుడైన శరభంగమహాముని నీసంగతి నాకు చాలాచాలా చెప్పాడు" అని విన్నవించుకోగా ఆమహాముని చాలా ఆనందించి "రామా! ఈఆశ్రమం చాలామంచిది. ఇక్కడ సకలసదుపాయాలూ వున్నాయి. నువ్విక్కడే వుండు. ఏకాలంలోనూ కందమూలఫలాలు నీకిక్కడ సమృద్ధిగా దొరుకుతాయి. మహర్షులున్నూ ఇక్కడ చాలామందే వున్నారు. ఇక వున్నదల్లా యేమిటంటే? గుంపులుగుంపులుగా క్రూరమృగాలు వచ్చి యిక్కడ నిర్భయంగా సంచరించి పీడించి వెళ్ళిపోతాయి. ఇంతకంటే యిక్కడ మరే యిబ్బందీ లేదు" అని చెప్పాడు.

వెంటనే రాముడు ధనుస్సు ఎక్కుపెట్టి టంగుటంగున నారి మోగించి బాణం తొడిగి "మహాత్మా! ఎన్ని మృగాలు రానీ, ఈ శరంతో నేను వాటిని సంహారించివేస్తాను. అది నీకు కష్టం అనిపిస్తుంది. ఇంతకంటే కష్టం మరేమీ లేదు. కనక, నేనిక్కడ చిరకాలం వుండను" అని మహర్షికి చెప్పి వెళ్ళి రాముడు సంధ్యావందనాదికం ముగించుకున్నాడు.

ఆ రాత్రి మహర్షులు భుజించే అన్నాదికం స్వయంగా తెచ్చి సుతీక్ష్ణమహర్షి సీతారామలక్ష్మణులకు వడ్డించాడు.

౮

## రాముడు మునుల ఆశ్రమాలు చూడడానికి బయలుదేరడం

రాముడు, సీతతోనూ లక్ష్మణునితోనూ ఆరాత్రంతా సుఖంగా గడిపి వేకువజామునే మేలుకున్నాడు. వెంటనే సీతతో కూడా తామర పూలతో సువాసిత మైన నీట స్నానంచేశాడు. తరవాత, వారు అగ్నిహోత్రం చేసుకుని, దేవతాపూజ కూడా నెరవేర్చుకుని, అటు సూర్యోదయం అవుతూ వుండగా సుతీక్ష్ణమహర్షిని సందర్శించి నమస్కరించి "మహాత్మా! పూజ్యుడ వైన నీపూజలందుకుని రాత్రి సుఖంగా వున్నాము. ఈమునులు మమ్మ్ల త్వరపెడుతున్నారు; కనక, మాకు అనుజ్ఞదయచెయ్యి. ఈదండకారణ్యంలో వుండిన మునుల ఆశ్రమాలు చూడా లని మాకు చాలా తొందరగా వుంది. మాతో వుండిన యీమును లందరూ ధర్మనిరతులు. తపోదాంతులు. మహాతేజశ్శా లులు. ఎండ ముదరకముందే మేము వెళ్ళాలి. మాకందరికీ సెల వియ్యి" అని అతని పాదాలకు మొక్కాడు. సీతా లక్ష్మణుడూ మొక్కిన తరవాత ఆసుతీక్ష్ణమహర్షి రాముణ్ణి కౌగిలించుకుని "రామా! నీడలాగ నిన్ననుసరిస్తూవున్న సీతతోనూ లక్ష్మణునితోనూ వెళ్ళి దండకారణ్యవాసుల ఆశ్రమాలన్నీ చూసిరా. ఇక్కడి అడవి అంతా కందమూలాలతోనూ, పూలచెట్లతోనూ, ఫలవృక్షాలతోనూ నిండి వుంది. రకరకాలమృగాలున్నూ ఇక్కడ యెన్నో వున్నాయి. చక్కని పక్షులు లక్షలూ కోట్లూ వున్నాయి. ఇక్కడి తటా కాలూ సరస్సులూ కారండవాలతోనూ హంసలతోనూ నిండివు

న్నాయి. ఇక్కడి జలధారలూ పర్వతాలూ చాలా రమ్యంగా వుంటాయి. నెమళ్లు గంభీర కేంకారాలతో మిమ్మల్ని ఆనందపెడతాయి. లక్ష్మణా, నువ్వుకూడా వెళ్లు నాయనా! రామా, నువ్వు నా ఆశ్రమానికి మళ్ళీ రావాలి సుమా" అని చెప్పాడు.

రాముడూ లక్ష్మణుడూ సీతా మునికి మళ్ళీ ప్రదక్షిణ నమస్కారాలు చేశారు. అప్పుడు సీత అమ్ములపొదులూ, ధనస్సులూ ఖడ్గాలూ తెచ్చి రామునకూ లక్ష్మణునకూ అందిచ్చింది. వెంటనే ఆ అన్నదమ్ములు అమ్ములపొదులు గట్టిగా కట్టుకుని ఖడ్గాలూ ధనస్సులూ చేతబుచ్చుకుని, సీతతో కూడా బయలుదేరారు.

౬

## సీత రాముణ్ణి ఆయుధాలతో బయలుదేర వద్దనడం

సీత మెల్లిగా ప్రారంభించింది. "ఈమునిధర్మం చాలా జాగ్రత్తగా నడపవలసినది. కామవ్యసనాలు తగ్గించుకుంటే గాని యిది శక్యం కాదు. ఆవ్యసనాలు మూడు. వాటిలో మొదటిది అసత్యవాక్యం. ఇది చాలా గొప్పది. తక్కినవి దీనికంటే మరీగొప్పవి. అది పరస్త్రీగమనమూ, అకారణహింసానూ. అయితే, అసత్యం నువ్విదివరకు ఎరగవు. ఇకముందున్నూ దానిపొంతపోవు. ధర్మనాశనం చేసే పరస్త్రీవాంఛ కూడా నువ్వెరగవు. నువ్వు ఎప్పుడూ సత్యసంధుడవు. స్వాధ్యాయనిరతుడవు. పితృవాక్యపరిపాలకుడవు. రామా, నీదగ్గిర సత్యమూ ధర్మమూ అపారంగా వున్నాయి. అవి జితేంద్రియులకే సాధ్యపడతాయి. నువ్వు జితేంద్రియుడవని నాకు బాగా తెలుసు. ఇక మూడవది పరుల ప్రాణాలు తియ్యడం. అజ్ఞానంవల్ల పామరులు చేస్తారది.

అది నీకిప్పుడు తటస్థించింది. ఏమంటే? దండకారణ్యంలో వున్న మునులను రక్షించడానికి రాక్షసులను సంహారిస్తానని ప్రతిజ్ఞచేశావు. ఇందుకోసమే నువ్వు ధనుర్బాణాలు ధరించి తమ్మునితో కూడా దండకారణ్యంలో సంచరించడానికి బయలుదేరావు. అందువల్ల, నీసంగతి తెలిసి నీశ్రేయస్సును గురించే ఆలోచిస్తున్న నాకు మనస్సంతా చింతా వ్యాకులం అయిపోయింది. కనక, నువ్వు దండకారణ్యంలో సంచరించడం నాకిష్టంలేదు. అందుకు కారణం చెబుతావిను. ధనుర్బాణాలు ధరించి తమ్మునితో బయలుదేరిన నువ్వు రాక్షసులు కనపడితే బాణం విడవక మానవు. ఏమంటే? సమీపాన వుంచిన కట్టెలు అగ్నికి తేజస్సూ బలమూ వృద్ధిచేస్తాయి. అలాగే క్షత్రియునకున్నూ చేతనున్న ధనుర్బాణాలు తేజస్సూ బలమూ వృద్ధిచేస్తాయి. దీని కుదాహరణం చెబుతా విను. పూర్వం, సకల జాతి మృగాలూ పక్షులూ నిండి వుండిన వొక మహారణ్యంలో సత్యభాషీ శుచీ అయిన ముని వొకడుండేవాడు. అతని తపస్సు విఘ్నం చెయ్యాలని తలచి దేవేంద్రుడు బంటురూపం ధరించి తీక్ష్ణమైన ఖడ్గం పట్టుకొని అక్కడికి వచ్చి "మహాత్మా నేను మళ్ళీ వస్తాను. అంతవరకూ నావద్ద ఖడ్గం దాచిపెట్టు" అని ప్రార్థించి ఆఖడ్గం మునికిచ్చి వెళ్ళిపోయాడు. ఆముని ఎలాగయినా ఆఖడ్గం భద్రంగా వుంచి మళ్ళీ ఆమనిషికి ఇవ్వాలన్న వుద్దేశంతో అడవిలో తిరిగేటప్పుడు కూడా అది చేతపట్టుకునే వుండేవాడు. ఆముని అడవిలో కందమూలాలకోసమూ, ఫలాలకోసమూ, పూలకోసమూ, తిరిగేటప్పుడుకూడా ఆకత్తి విడిచిపెట్టేవాడు కాడు. ఇలా కొన్నాళ్ళు గడిచేటప్పటికి అతను తపస్సుమరిచిపోయి వీరకృత్యాలు చెయ్యాలన్న స్థితికి వచ్చేశాడు. ఇలాగ స్వధర్మం విడిచి ఖడ్గం దగ్గిర వుండడంవల్ల మదించి ఘోరకృత్యాలు చేసి చివరకి నరకానికి పోయాడు. ఆయుధసంపర్కం వల్లనే మునికిలా జరిగింది. అగ్ని శాస్త్ర

యించిన వస్తువు నెలా భస్మం చేస్తుందో తన్ను చేపట్టినవాణ్ణి ఆయుధం కూడా అలాగే నాశనం చేస్తుంది. అయితే, ఆయుధాల సంగతి నీకు తెలియంది కాదు సుమా. నీయెడల వుండిన గౌరవంవల్లా స్నేహంవల్లా నీకిది జ్ఞాపకం చేశాను; గాని నీకు బోధించలేదు సుమా. నువ్వు ధనుర్బాణాలు ధరించివున్నావు కనక, దండకారణ్యంలో వుండిన రాక్షసులను అపరాధం లేందే నువ్వు చంపకూడదుసుమా! వీరులైన క్షత్రియులకు అడవులలో ఆర్తులయి వుండేవారిని రక్షించడానికి ధనుర్బాణాలు వాడడం మాత్రం అధర్మంకాదు. ఆయుధం యెక్కడ? అరణ్యం యెక్కడ? క్షాత్రం యెక్కడ? తపస్సెక్కడ? ఇవన్నీ అన్యోన్య విరుద్ధాలు. కనక, మనం అరణ్యాలకు తగిన మునివృత్తే అవలంబింతాము. శస్త్రధారణంవల్ల తప్పకుండా బుద్ధి కలుషం అయిపోతుంది. అయోధ్యకు వెళ్ళాక మాత్రం మనం క్షత్రియధర్మానుసారంగా ఖడ్గాలు వాడవచ్చు. "ఎన్నటికీ నాకు రాజ్యం అక్కర్లేదు" అని శాశ్వతంగా నువ్వు మునివృత్తి అవలంబిస్తావా, ఇబ్బందే లేదు. నా అత్తమామలైన కైకకూ దశరథమహారాజుకూ చాలా ఆనందం కలుగుతుంది. ధర్మంవల్లనే ధనధాన్యాలు సమకూడుతాయి. ధర్మం వల్లనే సుఖం కలుగుతుంది. ధర్మంవల్లనే సమస్తమూ లభిస్తుంది. ఏమంటే? ఈజగత్తంతా ధర్మసారమే. ఎన్నెన్నో వ్రతాలుచేసీ, నియమాలు అవలంబించీ శరీరం కృశింపచేసుకుని నిపుణులు ధర్మం సంపాదించుకుంటారు. అంతేగాని సుఖంవల్ల యెంతమాత్రమూ సుఖం కలగదు. శుచివై నిత్యమూ ధర్మం అనుష్ఠించు. త్రిలోకాలలోనూ నీకు తెలవంది ఏమీ లేదు. ఇదంతా స్త్రీలకు సహజమైన చాపలంవల్ల నేను నీకు చెప్పాను; గాని నీకు ధర్మాధర్మాలు ఉపదేశించడానికెవరు సమర్థులూ? నీతమ్ముడితో ఆలోచించి నీకెలా తోస్తే అలా చెయ్యి."

## మునులకు మాటయిచ్చిన సంగతి రాముడు సీతకు చెప్పడం

సీతకి తనయెడల యెలాంటి భర్తృభక్తి వుందో అది రాముడికు బాగా తెలుసు. అంచేత ధర్మాత్ముడైన రాముడు మెల్లిగా ఆమె కిలా చెప్పాడు.

"జానకీ! నువ్వు నామీద వుండిన స్నేహానికీ నీ కులమర్యాదకీ తగినట్టు చెప్పావు. నువ్వు హితమే చెప్పావుగాని మరేమీ చెప్పలేదు. అయితే, ఎవరూ ఆర్తులు కాకుండా వుండడానికే క్షత్రియులు ఆయుధాలు ధరిస్తారని నువ్వే చెప్పావు. దండకారణ్యవాసులైన మునులు ఆర్తులు. స్వయంగావచ్చి వారు నన్ను శరణు పొందారు. ఈమునులు కందమూలఫలాలు మాత్రమే భక్షిస్తూ అరణ్యంలో ధర్మనిరతులయి వుండినారు. కాని క్రూరకర్ములైన రాక్షసులు అకారణంగా వీరిని భయపెడుతున్నారు. బాధిస్తున్నారు. ఎప్పటికప్పుడే మాంసభుక్కులైన దుష్టరాక్షసులు వీరిని చంపి తినేస్తున్నారు. అలాంటి దండకారణ్యవాసు లందరూ వచ్చి 'మమ్మల్ని రక్షించు' అని నన్ను కోరారు. అప్పుడు నేను వారి పాదసేవచేసి "మహాత్ములారా! నా మీద అనుగ్రహం వుంచండి. నేను మిమ్ము సేవించడానికి రాగా నన్ను మీరిలా ప్రార్థిస్తున్నారు. మరి నన్నేమి చెయ్యమంటారు?" అని నేను వారి నడిగాను. అందుకు వారు అందరూ కలిసి "కామరూపులైన రాక్షసులు మమ్మనేకవిధాల బాధిస్తున్నారు. సర్వకాలాల్లోనూ హోమాలు చేసుకునేటప్పుడూ వచ్చి నరమాంసభక్షకులైన ఆరాక్షసులు మమ్మనేక విధాల బాధిస్తున్నారు. మాకు నువ్వుతప్ప మరి గతి లేదు. మాతపఃప్రభావంవల్ల మేము వాళ్ళను నాశనం చేసెయ్యగలం; కాని తపస్సు వ్యయం చేసుకోవడం మాకిష్టం లేదు. ఎన్నో విఘ్నాలు దాటుకుంటూ ఎంతో కష్టపడి ఎంతోకాలంగా మేము ఈ తపోధనం

సంపాదించుకున్నాం. అంచేత రాక్షసులు మమ్మల్ని చంపేస్తున్నా తినేస్తున్నా తపస్సు పాడుచేసుకుని వాళ్ళని శపించలేకుండా వున్నాము. నువ్వే మాకు నాథుడవు. కనక, నీతమ్మునితో కూడా నువ్వు మమ్మల్ని రక్షించు" అని నన్ను కోరారు. దానిమీద నేను "ఎన్ని కష్టాలు వచ్చినా నేను మిమ్మల్ని రక్షిస్తా" నని వారికి మాట యిచ్చాను. బతికి వున్నంతకాలమూ నేనీ మాట తప్పలేను. ఎల్లప్పుడూ నాకు సత్యమే యిష్ట మని నీకు తెలవనే తెలుసు. నేను నాప్రాణా లయినా విడిచి పెడతాను. లక్ష్మణు ణ్ణయినా విడిచిపెడతాను. చివరికి నిన్నయినా విడిచిపెడతాను; కాని అన్నమాట — అందులోనూ బ్రాహ్మణుల కిచ్చిన మాట తప్పను. వారు నన్ను కోరకపోయినా నేను వారిని రక్షించవలసినవాణ్ణే. వారు కోరినప్పుడు — వారికి నేను మాట కూడా యిచ్చినప్పుడు ఇక చెప్పే దేముందీ? నువ్వు నామీది స్నేహంవల్లా సౌహార్దంవల్లా యీమాటలు చెప్పావు. ఇందుకు నేను చాలా సంతోషించాను. ఎవ రయినా యేమి చెప్పినా ప్రియులకు చెబుతారు; గాని అప్రియులకు చెప్పరుకదా? నువ్వు చెప్పిన మాటలు నీసొంతానికీ నీకులానికీ కూడా బాగా తగివున్నాయి. ధర్మచారిణివైన నువ్వు నాకు ప్రాణాలకంటే యెక్కువదానవు."

ప్రియురాలైన సీత కిలా చెప్పి రాముడు ధనుర్బాణాలు ధరించి లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకుని రమ్యాలైన తపోవనాలకు బయలుదేరాడు.

## ౧౧

## రాముడు పంచాప్సరసం చేరడం

రాముడు ముందూ, మధ్య సీతా, ధనుర్బాణాలు ధరించి వెనక వాత లక్ష్మణుడూ బయలుదేరారు. దారిలో వారు నదుల యిసుకతిన్నెల

మీాద క్రీడించే సారసపక్షులూ చక్రవాకపక్షులూ ఎన్నో చూశారు. తామరపూలతోనూ, నీటిపిట్టలతోనూ నిండివుండిన ఎన్నో సరస్సులున్నూ చూశారు. రకరకాల పర్వతసానువులు చూశారు. ఎన్నో చూశారు. ఎన్నో అరణ్యాలు చూశారు. ఎన్నో జింకలు గుంపులు గుంపులుగా సంచరిస్తున్నాయి. మదించిన ఏనుబోతు లెన్నో తిరుగుతున్నాయి. సుహిాపాలూ అడివిపందులూ వందలూ వేలూ కనపడ్డాయి. ఎంతెంతలేసి చెట్లనయినా అవలీలగా విరిచివెయ్యగల యేనుగులున్నూ ఎన్నో కనపడ్డాయి. ఇవన్నీ చూస్తూ వింతపడుతూ, ఆశ్చర్యపడుతూ, ఆనందిస్తూ సూర్యాస్తమయం కాబోయే టప్పటికి ఎంతో దూరం నడిచి చివరి కొక తటాకం చేరారు.

అది నాలుగు యోజనాల పరిమాణం కలది. ఎంతో లోతైనది. అది తామరపూలతోనూ కలవపూలతోనూ నిండివుంది. హంసలూ చక్రవాకాలూ అందెన్నో విహరిస్తున్నాయి. ఎన్నో యేనుగులున్నూ ఆతటాకంలో యీాతాలాడుతున్నాయి.

ప్రసన్న గంభీరమైన ఆ తటాకజలంలోనుంచి వారికి చక్కని సంగీతం వినవచ్చింది. యువతులు పాడుతున్నారు వీణలు ధ్వనిస్తున్నాయి. మద్దెలలు మోగుతున్నాయి. గజ్జెలచప్పుడున్నూ వినవస్తోంది. కాని స్త్రీలుగాని పురుషులుగాని ఒక్కరైనా కనపడ్డంలేదు.

అందుకు వారు మరీ వింతపడ్డారు. అప్పుడు రాముడు దగ్గిరగావున్న ధర్మభృత్తు అనే మహర్షిని చూసి "మహాత్మా! ఏమిటిది? మాకేమీా బోధపడ్డంలేదు. ఇది చెప్పరాని రహస్యం కాకపోతే ఏమిటో వివరించి మాకానందం కలిగించు" అని ప్రార్థించాడు.

అందుకా మహర్షి "రామా! ఇది పంచాప్సరసం అనే తటాకం. మాండకర్ణి అనే మహర్షి తన తపోబలంతో ఇది నిర్మించాడు. అతను నీటిలోనిలిచి వాయువు భక్షిస్తూ పదివేల సంవత్సరాలు

తీవ్రంగా తపస్సుచేశాడు. అదిచూసి భయపడిపోయి అగ్నిపురోగ ముశై దేవత లొకచోట చేరి "మనలో వొకని పదవి ఆక్రమించడాని కీమహర్షి యింతతీవ్రంగా తపస్సు చేస్తున్నాడు" అని కూడబలుక్కుని చాలాకంగారుపడి ఆమాండకర్ణికి తపోవిఘ్నం చెయ్యడాని కయిదు గురు అప్సరసలను నియమించారు.

ఆ అయిదుగురూ మెరుపుతీగల్లా వుంటారు. అప్సరస లందరిలోనూ వాళ్ళే మహాచక్కనివాళ్ళు. పరమేశ్వరసాక్షాత్కారం పొందిన ఆమహా త్మ్మణ్ణి కూడా వాళ్ళు మోహావిష్టుణ్ణి చేసేశారు. మరిన్నీ ఆమహర్షికి భార్యలు కూడా అయినారు. వాళ్ళకోసం ఈతటాకంలో అంతర్గృ హాలు నిర్మితా లయినాయి. తన తపోమహిమవల్ల పడుచువాడై ఆమహర్షి ఆ గృహాలలో వాళ్ళతో క్రీడిస్తూ కాలం గడుపుతున్నాడు. అతణ్ణి సంతోషపెట్టడానికి వాళ్ళు అలా ఆడుతూ పాడుతూ వుంటారు. ఆగీతధ్వని అది" అని వివరంగా చెప్పాడు.

అది విని రాముడూ, సీతా, లక్ష్మణుడూ మరీ వింత పడి, అక్క ణ్ణించి బయలు దేరారు. ఎదట బ్రహ్మతేజస్సుతో నిండివున్న మున్యా శ్రమా లున్నాయి. వాటిలో ఎక్కడ చూసినా నారచీర లారు తున్నాయి. అక్కడి ముని లందరూ సేవిస్తూ వుండగా సీతా రామ లక్ష్మణులు ఆ మున్యాశ్రమాలు ప్రవేశించారు. ప్రతీ ఆశ్రమంలోనూ వారు ఒకమాటు కొంతకాలమూ మరోమాటు మరోకొంతకాలమూ ఉంటూ వచ్చారు.

మొత్తానికి, వారు, ఒక ఆశ్రమంలో పదమూడు మాసాలున్నారు. మరో ఆశ్రమంలో వొకసంవత్సరం నివసించారు. మరో ఆశ్రమంలో నాలుగుమాసా లున్నారు. ఇంకో ఆశ్రమంలో అయిదు మాసా లున్నారు. మరో ఆశ్రమంలో ఆరుమాసా లున్నారు. మరో ఆశ్ర మంలో ఏడుమాసాలున్నారు. ఇంకో ఆశ్రమంలో నెలమీద వారం

దినా లున్నారు. ఇంకో ఆశ్రమంలో మూ‌డువారా లున్నారు. మరో ఆశ్రమంలో మూడుమాసా లున్నారు. చివరి ఆశ్రమంలో ఎనిమిది మాసా లున్నారు. ఇలాగ వారు ఆమున్యాశ్రమాలలో సుఖంగా పది సంవత్సరాలు గడిపారు.

ఇలాగ యీ ఆశ్రమా లన్నీ చూసి ధర్మజ్ఞు డైన రాముడు సీతతో కూడా మళ్ళీ సుతీక్ష్ణాశ్రమానికి వచ్చాడు. మరిన్నీ అక్కడి మునులున్నూ అనేకవిధాల ఆదరిస్తూ వుండగా అక్కడకూడా కొంత కాలం నివసించాడు. ఒకనాడు సుతీక్ష్ణుని చెంతకు మెల్లిగా చేరి రాముడు " మహాత్మా! ఈఅరణ్యంలోనే మునిసత్తము డైన అగస్త్యమహర్షి నివసించివున్నా డని చాలామంది చెప్పగా విన్నాను; గాని యిది అంతులేని అరణ్యంకావడంవల్ల అతని ఆశ్రమం జాడే మాకు కనపడలేదు. దయవుంచి అదెక్కడ వున్నదో యెలా వెళ్ళాలో చెబితే మేము ముగ్గురమూ వెళ్ళి అతణ్ణి కూడా సేవించుకుంటా మని వుంది. అతనికిన్నీ శుశ్రూష చెయ్యా లని నాకీకోరిక చాలాకాలంగా వుంది" అని సవినయంగా అడిగాడు. అందుకా సుతీక్ష్ణుడు "రామా లక్ష్మణునకూ సీతకూ నీకూ నేనున్నూ యిది చెప్పా లనే అనుకుంటు న్నాను. సరిగా ఈక్షణంలోనే నువ్వు నన్నిది అడిగావు. ఇక్కడికి దక్షిణంగా నాలుగు యోజనాలు వెడితే అక్కడ అగస్త్యభ్రాత ఆశ్రమం వుంది. వెళ్ళగా వెళ్ళగా నీకు రావిచెట్ల గుంపు కనపడుతుంది. దానిమధ్య విశాలమైన బయలుంది. ఆబయట వుంది ఆఆశ్రమం. అక్కడ పుష్పవృక్షాలూ ఫలవృక్షాలూ చాలా మనోహరంగా వున్నాయి. అక్కడి చెరువులు తామరపూలతోనూ, కలువపూలతోనూ హంసలతోనూ చక్రవాకాలతోనూ నిండి చాలా రమ్యంగావుంటాయి. అక్కడ వొకరాత్రి వుండి చీకటితోనే బయలుదేరి అడవినానుకునే వెడితే అక్కడి కొక ఆమడదూరాన అగస్త్యాశ్రమం వుంది. అక్కడ రక

రకాల చెట్లు గుంపులుగుంపులుగా వున్నాయి. అక్కడ సీతకూ నీకూ చాలా ఉల్లాసం కలుగుతుంది. అగస్త్యుణ్ణి చూడాలని వుంటే నువ్విప్పుడే బయలుదేరు” అని చెప్పాడు.

రాముడు సీతతోనూ లక్ష్మణునితోనూ సుతీక్ష్ణునకు పాదాభివందనం చేసి వెంటనే అగస్త్యాశ్రమానికి బయలుదేరాడు. దారిలో యెన్నో పర్వతాలు కనబడ్డాయి. ఎన్నో రకాల చెట్లు నేత్రపర్వం చేశాయి. అప్పుడు రాముడు లక్ష్మణుణ్ణి చూసి “తమ్ముడూ! ఇదే అగస్త్యభ్రాత ఆశ్రమంలా కనపడుతోంది. సుతీక్ష్ణుడు చెప్పిన పుష్పవృక్షాలూ ఫలవృక్షాలూ అవిగో విరగబూసీ విరగకాసీ వున్నాయి. రావిచెట్లమీద నుంచి కషాయగంధమున్నా ముమ్మరంగా వస్తోంది. వంటకట్టెలూ గుట్టలు గుట్టలుగా వున్నాయి. కోసిన దర్భబీళ్ళు కూడా అవిగో. ఆ చెట్లగుంపులోనుంచి నల్లని మహామేఘం లాగ పొగవస్తోంది. చెట్ల గుంపులలో అక్కడక్కడ వున్న రేవుల్లో స్నానంచేసి బ్రాహ్మణులు స్వయంగా కోసి తెచ్చి పుష్పబలులు సమర్పిస్తున్నారు. సుతీక్ష్ణ మహర్షి చెప్పిన అగస్త్యభ్రాత ఆశ్రమం తప్పకుండా యిదే అయి వుంటుంది. మహాతపస్సు చేసి మృత్యువును జయించి అగస్త్యమహర్షి యీదక్షిణదిక్కు మునులు నివసించడానికి తగ్గట్టు చేశాడు. ఒకప్పుడు ఇక్కడ వాతాపి ఇల్వలుడు అని యిద్దరు ఘోరరాక్షసు లుండేవారు. బ్రాహ్మణులను చంపి తినడమే వాళ్ళపని. ఇల్వలుడు బ్రాహ్మణరూపం ధరించి “అయ్యా, మాయింట శ్రాద్ధభోజనం చేసి వెళ్ళండి” అని ముందు బ్రాహ్మణులను పిలిచేవాడు. తరవాత మేకరూపం ధరింపజేసి వాతాపిని సంహరించి ఆమాంసం వండి బ్రాహ్మణులకు వడ్డించేవాడు. ఇదేమీ యెరగని బ్రాహ్మణులు కమ్మని ఆపదార్థాలు కడుపునిండా తినేవారు. అప్పుడు ఇల్వలుడు “వాతాపీ! బయటికి రావోయీ” అని గట్టిగా పిలిచేవాడు. వెంటనే వాతాపి మేకలాగ అరుస్తూ

బ్రాహ్మల కడుపులు బద్దలుచేసుకుని బయటికి వచ్చేవాడు. నరమాంస భుక్కులైన ఆ రాక్షసులు కామరూపులై యిలాగ వేలకొద్దీ బ్రాహ్మణులను నాశనం చేశారు. ఇది చూడలేక దేవతలందరూ "యిది నివారించు" అని అగస్త్యమహర్షిని ప్రార్థించారు. దానిమీద బుద్ధిపూర్వకంగా అక్కడికి వెళ్ళి అగస్త్యుడు రాక్షసునియింట భోజనం చేశాడు. ఇల్వలుడు అంతా అయినాక "సుసంపన్నం" అని అగస్త్యునకు హస్తోదకం యిచ్చి "వాతాపీ! రావోయి నాయనా" అని యథాప్రకారం పిలిచాడు. అప్పుడు అగస్త్యుడు మేకరూపం తాల్చిన నీసోదరుడు నాకడుపున జీర్ణం అయిపోయి యమలోకానికి వేంచేశాడు. "ఇంక మళ్ళీ రావడం యెక్కడిది?" అంటూ వికటంగా నవ్వాడు.

తమ్ముడు చచ్చిపోయాడనేటప్పటికి ఇల్వలుడు మండిపడి కొడదామని అగస్త్యునిమీద ఉరికాడు; కాని ఆమహాముని అంతకు ముందే తన నేత్రాగ్నిజ్వాలలతో వాణ్ణి భస్మం చేసేశాడు. అగస్త్యుడు ఈటాక వనశోభిత మయివుండే యీస్థలంలోనే బ్రాహ్మణులను రక్షించడానికి ఈమహాకార్యం చేశాడు. ఇదే అతని భ్రాత ఆశ్రమం" అని చెప్పాడు.

అప్పటికి సూర్యాస్తమయం అయింది. అప్పుడు రాముడు తన వారితో కూడా సంధ్యావందనాదికం ముగించుకుని మెల్లిగా ఆశ్రమంలోకి వెళ్ళి యథావిధిగా మునిని పూజించాడు. మునికూడా రాఘవులను చాలా ఆదరించాడు. మర్నాడు తెల్లవారగానే రాముడు "మహాత్మా! నీదయవల్ల నీఆశ్రమంలో రాత్రి మాకు సుఖంగా గడిచింది. ఇక నీఅగ్రజుడైన అగస్త్యమహర్షిని చూడబోతున్నాము. మాకు సెలవు దయచెయ్యి" అని కోరాడు. "మంచిది నాయనా" అని ముని వారికి దారితెన్నులు వివరంగా చెప్పాడు.

## రాముడు అగస్త్యాశ్రమం చేరడం

మళ్ళీ ముగ్గురూ బయలుదేరారు. ఆప్రశాంత ప్రాంతాలు ఆవనం ఎంతో శోభగా వుంది. పనసచెట్లూ, తాలవృక్షాలూ, నేరు వృక్షాలూ, పొగడచెట్లూ చంద్రచెట్లూ, గానుగుచెట్లూ, ఇప్ప చెట్లూ, మారేళ్ళూ, తుమికిచెట్లూ ఏపుగా పెరిగి ఫ్రూసీ కాసీ చక్కగా వున్నాయి. పూలతో నిండిన లతలు అల్లిబిల్లిగాపాకి వాటికి మరీ అందం తెచ్చాయి. మధ్యమధ్య కొన్నిచెట్లను ఏనుగులు కుమ్మి పడగొట్టాయి. ఒక్కొక్కచోట కొన్నికొన్ని చెట్లమీద కోతులు గుంపులుగుంపులుగా వున్నాయి. ఏచెట్టుచూసినా రకరకాల పిట్టలతో సొగసుగా వుంది.

ఇదంతా చూసి రాముడు "తమ్ముడూ, ఇక్కడి లతావృక్షా లన్నీ స్నిగ్ధపత్రాలతో మెరుస్తున్నాయి. ఇక్కడి మృగాలూ పక్షులూ విరోధభావం లేక మచ్చికగా వున్నాయి. దీన్నిబట్టి అగ స్త్యాశ్రమం యిక్కడికి చాలా దగ్గిరగా వున్నట్టు కనబడుతోంది. ఆమహార్షి అగమును — అనగా వింధ్యపర్వతాన్ని స్తంభింపజెయ్యడంవల్ల అగస్త్యుడని బిరుదుపొందాడు. ఇక్కడికి వచ్చాటప్పటికి మన శ్రమ అంతా పోయింది. అదిగో పొగ కనపడుతోంది. అవిగో నార చీరలు చెట్లని వేలాడుతున్నాయి. అగస్త్యమహార్షి అంటే రాక్షసులు గడగడ లాడిపోతారు. వాళ్ళు యిక్కడికి రాలేకపోవడమే కాదు, ఈ దిక్కుకే చూడలేరు. అగస్త్యుడిక్కడ నివసించినది మొదలు ఈప్రాంతాలలో వున్న రాక్షసులందరూ మునులమీద విరోధం విడిచి పెట్టేశారు. ఈదక్షిణదిక్కునకు ఈమహార్షివల్ల అగస్త్యదిక్కు అనిన్నీ పేరు వచ్చింది. వింధ్యపర్వతం వొకప్పుడు సూర్యునకు దారి లేకుండా పెరిగిపోయింది. అప్పుడు ఈమహార్షి దాని ఔద్ధత్యం అడిచివేశాడు.

అలాంటి మహానుభావుని ఆశ్రమం యిది. ఇతను సత్పురుషుడు. సకలలోకారాధ్యుడు. సత్పురుషుల శ్రేయస్సు కోరుతూ వుంటాడు. ఇతణ్ణి ఆశ్రయించడం మనకి శ్రేయస్కరం. ఈమహర్షిని సేవించుకుంటూ మిగిలివున్న వనవాసకాలం అంతా మనం యిక్కడే గడుపుదాం. సిద్ధులూ, గంధర్వులూ దేవతలూ, పరమర్షులూ నియతాహారులైన అగస్త్యమహర్షిని సేవించుకుంటూ వుంటారు. అసత్యవాదులూ, క్రూరులూ, శఠులూ, వంచకులూ, ఘాతుకులూ యిక్కడ బతకలేరు. ఈమునీ అలాంటివాడు. యక్షులూ, నాగులూ, దేవతలూ ధర్మం ఆరాధిస్తూ నియతాహారులై యిక్కడ నివసిస్తూవుంటారు. ఇక్కడ మహర్షు లెందరో తపస్సిద్ధి పొంది, జీర్ణదేహాలు విడిచి, కొత్త శరీరాలు తాల్చి సూర్యమండలం లాగ మెరిసిపోయే విమానాలెక్కి స్వర్గానికి వెళ్ళిపోయారు. దేవత లిక్కడ పూజలు పొంది మనుష్యులకు యక్షత్వమూ, అమరత్వమూ, రాజ్యాధిపత్యమూ యిస్తారు.

తమ్ముడూ మనం అలాంటి మున్యాశ్రమానికి వచ్చాము. నువ్వు ఆశ్రమం ప్రవేశించి సీతా నేనూ వచ్చివుండిన సంగతి నివేదించి రా" అని చెప్పాడు.

## ౧౨

## అగస్త్యుడు రామునకు దివ్యాయుధాలు ఇవ్వడం

వెంటనే లక్ష్మణుడు ఆశ్రమంలోకి వెళ్ళి, వొకచోట వొక శిష్యుడు కనబడగా " దశరథు డని వొకమహారాజు. అతని పెద్దకొడుకూ బలపరాక్రమశాలీ అయిన రాముడు భార్య అయిన సీతకూడా అగస్త్యమహర్షిని సందర్శించడానికి వచ్చివున్నాడు. నే నారాముని తమ్ముణ్ణి, పేరు లక్ష్మణుడు. మాసంగతి నీకేమయినా తెలుసునా? మా తండ్రి ఆజ్ఞవల్ల మేము ఘోరారణ్యాలలో నివసించడానికి వచ్చాము.

మేము ముగ్గురమూ మహర్షి ని సేవించుకోడానికి వచ్చాము. ఈసంగతి వారికి విన్న వించు ” అని కోరాడు.

అప్పటికి మహర్షి అగ్ని హోత్రగృహంలో వున్నాడు. శిష్యుడక్కడికి వెళ్లి మహర్షి యెదట కృతాంజలి అయి నుంచుని లక్ష్మణుడు చెప్పింది చెప్పినట్టు నివేదించాడు. అది విని మహర్షి “ అదృష్టంవల్ల రాముడు చిరకాలానికి నన్ను చూడ్డానికి వచ్చాడు. నేనుకూడా అతనెప్పుడు వస్తాడా అని యెదురుచూస్తూనే వున్నాను. వారిని యథోచితంగా ఆదరించి వెంటనే లోపలికి తీసుకురా. ముందే యెందుకు తీసుకురా లేక పోయావు ? ” అని బదులుచెప్పాడు.

శిష్యుడు గుర్వాజ్ఞచొప్పున వారిని ఆశ్రమంలో ప్రవేశపెట్టాడు. అంతట రాముడు సీతతోనూ లక్ష్మణునితోనూ ప్రశాంతంగా వున్న లేళ్ళను చూస్తూ లోపలికి వచ్చాడు. వస్తూ వస్తూ రాముడు అగస్త్యుడు తన ఆశ్రమంలో ప్రతిష్ఠించుకున్న బ్రహ్మస్థానమూ అగ్నిస్థానమూ, విష్ణుస్థానమూ ఇంద్రస్థానమూ వివస్వత్స్థానమూ సోమస్థానమూ, భగుని స్థానమూ కుబేరస్థానమూ ధాతృస్థానమూ విధాతృస్థానమూ, వాయుస్థానమూ నాగస్థానమూ, అనంతస్థానమూ, గాయత్రీస్థానమూ వసువుల స్థానమూ యమస్థానమూ వరుణస్థానమూ, కుమారస్థానమూ ధర్మస్థానమూ చూసుకుంటూ వచ్చాడు.

అంతలో శిష్యులు పరివేష్టించి వుండగా అగస్త్యమహర్షి అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూసి రాముడు “ తమ్ముడూ ! అదిగో భగవంతుడగు అగస్త్యమహర్షి యిటే వస్తున్నాడు. అతను తపస్సే అలా రూపం ధరించిన మహాత్ముడు ” అని లక్ష్మణునితో చెబుతూ పరమాదరంతో మహర్షి పాదాలు పట్టుకున్నాడు. తరవాత సీతా లక్ష్మణుడూ కూడా అలాగ మహర్షి పాదాభివందనం చేశాక ముగ్గురూ చేతులు కట్టుకుని నుంచున్నారు. అగస్త్యుడున్నూ అర్ఘ్యపాద్యాలిచ్చి ఆసనాలు

చూపించి కుశలం అడిగి వెళ్ళి అగ్నిహోత్రం చేసుకువచ్చి మళ్ళీవారిని పూజించి వానప్రస్థధర్మానుసారం భోజనమున్నూ పెట్టి పిదప అందరూ కూచున్న తరవాత చేతులు దోయిలించుకుని వున్న రామునితో " రామా! ముందు వైశ్వదేవం పూర్తిచేసుకుని అప్పుడు అతిథిని సత్కరించాలి. ఇది సనాతనధర్మం. ఇలాకాక ముని అయినవాడు మరోవిధంగా చేస్తే అసత్యసాక్ష్యం చెప్పినవాడు లాగ పరలోకాన తన మాంసం తానే తింటాడు. ఇలాంటి స్థితిలో ప్రభుడవూ, ధర్మాత్ముడవూ మహారథుడవూ, పూజ్యుడవూ, మాన్యుడవూ అయిన నువ్వు ప్రియాతిథివై వచ్చినప్పుడిక చెప్పవలసిన దేమివుంది?" అని చెప్పి ఫలాలతోనూ మూలాలతోనూ పుష్పాలతోనూ రాముణ్ణి బహుధా పూజించి " రామా! ఇలా చూడు. హేమరత్నవిభూషితమైన యీ గొప్పధనుస్సు విశ్వకర్మ నిర్మించినది. ఇది వైష్ణవ ధనుస్సు. ఇది సూర్యసన్నిభ మైనది. ఆ కాలో ఇది పరశురామునిది. ఇది వరుణన కివ్వబడ్డది. మహేంద్రుడు నాకిచ్చాడు. ఈ అమ్ములపొదులు అక్షయాలు. వీటి నిండా వుండిన యీబాణాలు అగ్నిజ్వాలల్లా మెరిసిపోతున్నాయి చూడు. బంగారుసగిషీ చెక్కిన వెండిసరలో వున్న యీఖడ్గం చూడు. ఈ బాణంతోనూ, యీఖడ్గంతోనూ పూర్వం శ్రీమహావిష్ణువు అనేక రాక్షసులను సంహరించాడు. ఇది నువ్వు స్వీకరించు. దీనివల్ల నువ్వు వజ్రాయుధం ధరించిన మహేంద్రుని అంతటివాడవు కాగలవు" అని చెప్పి అతిప్రీతితో రామున కిచ్చాడు.

## 13

## అగస్త్యుడు రాముణ్ణి పంచవటిలో నివసించమని చెప్పడం

రామునకు ఆయుధాలివ్వడమే కాకుండా అగస్త్యమహర్షి " రామా నేను సంతోషించాను. నీకు భద్రం కావాలి. లక్ష్మణా! నేను

మెచ్చాను. మీరు సీతతో కూడా నాకు వందనాలర్పించడానికి వచ్చారు. ఇది చాలా మంచిది. అయితే, మార్గాయాసంతో మీరు వాడి పోయివున్నారు. జనకమహారాజు కూతురు ఈసీత మరీ అలసిపో యివుంది. ఈమె మిక్కిలీ సుకుమారి. ఎన్నడూ దుఃఖా లెరగనిది. కేవలమూ నీ అన్న యెడల గల భక్తిస్నేహాలవల్ల అనేకకష్టాలకు తావలమైన ఈఅడవులకు మీతో కూడా వచ్చింది. మీ వెంట అడ వులకు రావడంలో ఈమె చాలా దుష్కరకార్యం చేసింది; కనక, ఇక్కడ తన యిష్టంవచ్చినట్టుండనియ్యి. రామా, స్త్రీలు భర్తనుంచి స్థితిలో వుంటే అతణ్ణి ఆశ్రయించివుండి ఆనందపెడతారు. దురవస్థ పాలయితే భర్తని నిర్దాక్షిణ్యంగా విడిచిపెట్టేస్తారు. సృష్ట్యాదినించీ యిది స్త్రీల స్వభావం. మరిన్నీ మెరుపువంటి చంచలస్వభావంతో స్త్రీలు ఒకచోట ఉండరు. చిరకాలబంధుత్వాన్నయినా తెంపివేసు కోడంలో ఖడ్గాలకుండే పదును చూపిస్తారు. ముందువెనకలు చూడ కుండా పనిచెయ్యడంలో గరుత్మంతునికంటేనూ, మనస్సు కంటేనూ ఎక్కువ వేగం చూపిస్తారు; కాని నీభార్య అయిన యీసీత దగ్గిర ఈదోషా లేమీ లేవు. ఈమె అరుంధతివంటి పరమపతివ్రత. మిక్కిలీ శ్లాఘించతగ్గది. ఇలాంటి సీతతోనూ ఈలక్ష్మణునితోనూ నువ్విక్కడ వుండడంవల్ల యీప్రదేశం అంతా అలంకృతం అయింది."

ఇది విని రాముడు దోసిలి వొగ్గి "మహాత్మా! నాయెడల నీకింతటి అనుగ్రహం కలగడం నా అదృష్టం. నేను ధన్యుణ్ణయినాను. అయితే? నేనాశ్రమం నిర్మించుకో వలసివుంది. దట్టమైన అడవీ, మంచిజలవసతీ వుండిన స్థలం యెక్కడ వుందో అది నిర్దేశించు" అనడి గాడు. దానికి మహర్షి ఒకక్షణం ధ్యానమగ్నుడై వుండి తరవాత "నాయనా! ఇక్కడికి రెండామడలదూరాన పంచవటి అని వొక ప్రదేశం వుంది. అక్కడ జలవసతి వుంది. కందమూలఫలాలు పుష్క-

లంగా దొరుకుతాయి. మృగాలున్నూ అక్కడ అసంఖ్యాకంగా వున్నాయి. అక్కడ వుంటే నీకు బాగుంటుంది. పితృవాక్యపరిపాలనం అక్కడ నీకు నిర్విఘ్నంగా సాగుతుంది. నీతండ్రి దశరథుడు నీకు విధించిన వనవాసకాలం దాదాపుగా ముగియవచ్చింది. ఇది గడిచాక నువ్వు నీరాజ్యంలో సుఖంగా వుంటావు. జ్యేష్ఠపుత్రుడవైన నీవల్ల నీతండ్రి యయాతిలాగ ధన్యుడైనాడు. దశరథుడు నాకు స్నేహితుడు. అందువల్లా, నాతపఃప్రభావం వల్లా ఈసంగతి అంతా నాకు తెలిసింది. నీదృఢనిశ్చయం కూడా నాకు బాగా తెలిసింది. అంచేత నిన్ను మొదట యిక్కడ నాతోటే వుండమని చెప్పివుండిన్నీ యిప్పుడు పంచవటిలో వుండమంటున్నాను. అది చాలా చక్కని ప్రదేశం. గోదావరికి చాలా దగ్గిర. సీతకు అక్కడ మిక్కిలీ ఆనందంగా వుంటుంది. కందమూలఫలాలు అక్కడ కొల్లలుగా వుంటాయి. రకరకాల పక్షులు కలకలారావం చేస్తూవుంటాయి. అది ప్రత్యేకంగా ఏకాకమూలకూడా వుంది. సీతతో అక్కడ వుంటే నీకు సుఖమూ కలుగుతుంది. మునులను రక్షించడానికి వీలూ వుంటుంది. అదిగో, ఇప్పచెట్ల వనం కనపడుతోంది చూడూ. దాని కుత్తరంగా వెడితే పెద్దమర్రిచెట్టు కనపడుతుంది. అక్కణ్ణుంచి ముందుకి వెడితే ఏక మిట్ట తగులుతుంది. అది కొండకి సమీపంగా వుంది. అదే పంచవటి. సర్వకాల సర్వావస్థల యందూ అక్కడిచెట్లు ముమ్మరంగా పూస్తూవుంటాయి" అని చెప్పాడు.

అంతట రాముడు సీతతోనూ, లక్ష్మణునితోనూ కలిసి అగస్త్యమహర్షికి పాదాభివందనం చేసి, సెలవు పొంది పంచవటికి బయలుదేరాడు. అమ్ములపొదులు కట్టుకుని ధనుస్సులు పట్టుకుని వారు అగస్త్యుడు నిర్దేశించిన దారినే వెళ్ళారు.

## సీతారామలక్ష్మణులు జటాయువును కలుసుకోడం

వెళ్ళగా వెళ్ళగా వారి కొక పెద్దగద్ద కనపడింది. అది చాలా బల పరాక్రమాలు కలది. అప్పటికది వొక మర్రిచెట్టుమీద వుంది. రామ లక్ష్మణులు అది రాక్షసు డని తలచి "నువ్వెవడవు?" అని అడిగారు.

అందు కది ప్రేమతో మధురంగా "నాయనా! నేను నీతండ్రికి ప్రాణ స్నేహితుడను" అని చెప్పింది. వెంటనే రాముడు దానికి పూజలు చేసి "నీకులమూ నీపేరూ చెప్పు" అని ప్రార్థించాడు. దానిమీద ఆగద్ద సర్వభూతసృష్టిపూర్వకంగా యిలా ప్రారంభించింది.

"మహాబాహూ! రామా! పూర్వం యెవరెవరు ప్రజాపతులై వుండినారో వారి సంగతి అంతా చెబుతా విను. ప్రజాపతులలో మొదటి వాడు కర్దముడు. అతని తరవాతి వారు విక్రీతుడూ, శేషుడూ, బహు పుత్రవంతుడైన శేషుడున్నూ. పిమ్మట స్థాణువూ, మరీచీ, అత్రీ, క్రతువూ, పులస్త్యుడూ, అంగిరసుడూ, ప్రచేతుడూ, పులహుడూ, దక్షుడూ, వివస్వంతుడూ, కాశ్యపుడూ ప్రజాపతులైనారు. వారిలో కాశ్యపుడు చివరివాడు. రామా! వారిలో దక్షునకు ప్రఖ్యాతిపొందిన అరవై మంది కూతుళ్ళుండడం నువ్వెరిగినదే కదా? వారిలో మిక్కిలీ సుందరులైన అదితినీ, దితినీ, దనువునూ, కాళికనూ, తామ్రనూ, క్రోధ వశనూ, మనువునూ, అనలనూ, కాశ్యపుడు పెళ్ళిచేసుకున్నాడు. అతను ఆసుందరాంగులవల్ల చాలా సుఖపడి ఆనందించి "మీారెనమండుగురూ నాతో సమానులైన కొడుకులను కనండి" అని చెప్పాడు.

ఆయెనమండుగురిలోనూ అదితీ, దితీ, దనువూ, కాళికా— ఈ నలుగురూ మాత్రం ఆమాట కంగీకరించి దానినే ధ్యానించుకుంటూ వుండి నారు. తక్కినవారికి ఆమాట నచ్చలేదు. అంతట, అదితి ద్వాదశా

దిత్యులనూ, అష్టవసువులనూ, ఏకాదశరుద్రులనూ, అశ్వినీదేవతల నిద్దరినీ— మొత్తం ముప్ఫయిముగ్గురుకోడుకులను కన్నది. దితి దైత్యులను కన్నది. పూర్వం, సకలసముద్రాలతోనూ సకలారణ్యాలతోనూ కూడిన యీభూమండలం అంతా దైత్యులదే. దనువు హయగ్రీవుణ్ణి కన్నది. కాళిక, నరకుడు, కాలకుడు అని యిద్దరు కొడుకులను కన్నది.

భర్తమాట కిష్టపడని నలుగురిలోనూ తామ్ర క్రౌంచిని భాసిని శ్యేని ధృతరాష్ట్రి శుకి అని అయిదుగురు కూతుళ్లను కన్నది. వారిలో క్రౌంచి గుడ్లగూబలను కన్నది. భాసి భాసాలను కన్నది. శ్యేని మహా బలపరాక్రమాలుగల డేగలనూ గద్దలనూ కన్నది. ధృతరాష్ట్రి హంస లనూ కలహంసలనూ కన్నది. ఆధృతరాష్ట్రే చక్రవాకపక్షులనున్నూ కన్నది. శుకి నతను కన్నది. నత వినతను కన్నది. క్రోధవశ, మృగినీ మృగమందనూ హరినీ భద్రమదనూ మాతంగినీ శార్దూలినీ శ్వేతనూ సురభినీ సురసనూ కద్రువనూ మొత్తం పదిమంది కూతుళ్లను కన్నది. వీరిలో సురస సర్వలక్షణసంపన్నురాలు.

లేళ్లన్నీ మృగసంతానం. ఎలుగుగొడ్లూ, సృమరాలూ చమర మృగాలూ మృగమంద సంతానం. సింహాలూ, అతివేగంగా పరుగెత్తే కోతులూ హరిసంతానం. ఐరావతి భద్రమద సంతానం. ఐరావతికే లోకంలోకల్లా గొప్పదైన ఐరావతం పుట్టింది. ఏనుగులన్నీ మాతంగి సంతానం. గోలాంగూలాలనే కోతులూ పులులూ శార్దూలి సంతానం. దిగ్గజాలు శ్వేతసంతానం. సురభి, రోహిణీ గంధర్వీ అని యిద్దరు కూతు ళ్లను కన్నది. ఆవు లన్నీ రోహిణి సంతానం. గుర్రాలన్నీ గంధర్వి సంతానం. సర్పాలు సురస సంతానం. పన్నగాలు కద్రువు సంతానం. బ్రాహ్మణులూ క్షత్రియులూ వైశ్యులూ శూద్రులూ — ఇత్యాది మనుష్యు లందరూ మనువు సంతానం. మంచిమంచి కల్పవృక్షా లన్నీ అనల సంతానం. శుకి మనుమరాలైన వినత గరుడుడు అరుణుడు అని

యిద్దరు కొడుకులను కన్నది. కద్రువు ఆదిశేషుని గన్నది. వినత కొడుకులలో అరుణుని కొడుకులం నేనూ మాఅన్నాను. మాఅన్న సంపాతి. నాపేరు జటాయువు. నాతల్లిపేరు శ్యేని. నీ కిష్టం అయితే ఈ వనవాసంలో నేను నీకు సాయంగా వుంటాను. ఈఅడవి చాలా గొప్పది. చొరశక్యం కానిది. ఇందులో క్రూరమృగాలు చాలావున్నాయి. ఎంతోమంది రాక్షసులున్నూ వున్నారు. నువ్వూ నీతమ్ముడూ ఎప్పుడయినా బయటికి వెళ్ళవలసి వచ్చినప్పుడు నేను సీతను కనిపెట్టుకుని వుంటాను. ''

జటాయువు ఇలా చెప్పగా, తన తండ్రి స్నేహితుడైన అతణ్ణి రాముడు అనేకవిధాల పూజించి గౌరవించాడు. మరిన్నీ అతను శత్రువులను శలభాలను లాగ నలిపెయ్య తలుస్తూ జటాయువుతో కూడా పంచవటికి వెళ్ళాడు.

## ౧౫

## పంచవటిలో పర్ణశాల

రకరకాల పాములతోనూ మృగాలతో నిండివుండిన పంచవటి చేరాక రాముడు "తమ్ముడూ మనం అగస్త్యమహర్షి నిర్దేశించిన పంచవటి చేరుకున్నాం. ఈపూలచెట్లతో ఇది చాలా రమణీయంగా వుంది. మరిన్నీ అడవుల విషయం నీకు చాలా బాగా తెలుసు. ఇదంతా బాగా పరిశోధించు. సీతకూ నీకూ నాకూ ఎక్కడ ఆశ్రమం ఏర్పరుచుకుంటే సుఖంగానూ ఆనందంగానూ వుంటుందో అలాంటి ప్రదేశం పరకాయించు. అక్కడికి జలాశయం దగ్గిరగా వుండాలి. అరణ్యాం చాలా చక్కగా వుండాలి. స్థలమున్నూ రమణీయంగా వుండాలి. సమిధలూ కుశలూ పుష్పాలూ చేరువలో వుండాలి. అలాంటి స్థలం చూడు '' అని లక్ష్మణునితో చెప్పాడు.

దానిమీద లక్ష్మణుడు "అన్నా! ఎన్నిసంవత్సరాలు గడవనీ, నీదగ్గిర వున్నంతకాలమూ నేను పరతంత్రుణ్ణే కాని, స్వతంత్రుణ్ణి కాను. కనక, మంచిప్రదేశం ఏదో నువ్వే నిర్ధారణ చేసి ఆశ్రమ నిర్మాణం మాత్రం నామీదపెట్టు" అని సవినయంగా బదులు చెప్పాడు. అందుకు చాలా ఆనందించి వెతికివెతికి మంచిప్రదేశం కనిపెట్టి లక్ష్మణుని చేతులు పట్టుకుని "తమ్ముడూ! ఇక్కడ నేల చదునుగా వుంది. ఆశ్రమానికి అర్హంగా వుంది. దీనిచుట్టూ పూలచెట్లు గుంపులుగుంపులుగా వున్నాయి. కనక, ఇక్కడ ఆశ్రమం నిర్మించు. సూర్యబింబాల్లాగ మెరుస్తూ చక్కని సౌరభం విరజిమ్ముతున్న పద్మాలతో ఇదే యిక్కడ పుష్కరిణికూడా వుంది. అగస్త్యమహర్షి చెప్పినట్టే పూలచెట్లతో యీగోదావరి నిక్కలీ మనోహరంగా వుంది. ఈగోదావరిలో హంసలూ, కారండవాలూ, చక్రవాకాలూ ముద్దుముద్దుగా విహరిస్తున్నాయి. దగ్గిరగానే లేళ్లున్నూ గుంపులుగుంపులుగా సంచరిస్తున్నాయి. అవిగో, యీపంచవటి చుట్టూ వున్న పర్వతాలు చూడూ, వాటిమీద పురులువిప్పి క్రేంకారాలు చేస్తూ నెమళ్ళెంత మనోజ్ఞంగా నృత్యం చేస్తున్నాయో చూడూ. ఆగుహా లెంత గంభీరంగా వున్నాయోచూడూ! బంగారంలాగా, వెండిలాగా, రాగిలాగా, మెరుస్తున్న గైరికకాంతులతో గడగొండలవంటి ఆనల్లని యేనుగులు గవాక్షాలవంటి చిత్తరువులు రాసినట్టు తేజరిల్లున్నాయి. ఆహా! ఆచెట్లు చూశావా? మద్దులు, పనసలు, మామిళ్ళు ఖర్జూరాలు, జలకదంబాలు, రసాలాలు, అశోకాలు, తమాలాలు, సంపెంగలు, మొగళ్లు, పూలతీగలు పాకిన చందనతరువులు, నిమ్మలు, దబ్బలు, నారింజలు, మోదుగులు, కలిగొట్లు — సకలజాతుల వృక్షాలూ యిక్కడ కనపడుతున్నాయి.

తమ్ముడూ యీ ప్రదేశం చాలా పవిత్రంగా వుంది. పుణ్యక్షేత్రం అన్నట్టున్నా వుంది. పిట్టలకూ లేళ్ళకూ యిక్కడ యెప్పుడూ కరువురాదు. కనక, యీజటాయువుతో కూడా మన యిక్కడ నివ సింతాము " అని రాముడు మిక్కిలీ ఉల్లాసంతో అన్నాడు. ఇదివిని శత్రుంజయుడైన లక్ష్మణుడు వెంటనే ఆశ్రమం నిర్మించేశాడు. ఆపర్ణ శాల మిక్కిలీ విశాలంగా వుంది. నేల అంతా మిట్టపల్లాలు లేకుండా చదును చేశాడు. దిట్టమైన స్తంభాలూ, వంకరటింకర్లు లేని వెదుళ్ళూ ఏరి తెచ్చి అది నిర్మించాడు. పెండేలమీద జమ్మిరెమ్మలు పరిచి రెల్లు గడ్డితో దట్టంగా నేశాడు.

తరవాత లక్ష్మణుడు గోదావరికి వెళ్ళి స్నానంచేసి పద్మాలూ, పళ్ళూ పట్టుకువచ్చి పుష్పబలి చేసి యథావిధిగా శాంతిన్నీ చేసి రాము నకు చూపించాడు. సీతా రాముడూ పర్ణశాల అంతా చూసి చాలా ఆనందించారు. రాముడు లక్ష్మణుణ్ణి కౌగిలించుకుని చాలా మెచ్చు కుని " నాయనా ! నువ్వుచేసిన పని చాలా బాగుంది. చాలా సంతో షించాను. నువ్వు భావజ్ఞుడవు. కృతజ్ఞుడవు. ధర్మజ్ఞుడవు. అయినా, నాయనగారు నీవల్ల పొందతగ్గ ఆనందం పొందలేకపోయారు " అని చెప్పిపర్ణశాలలో ప్రవేశించాడు. ఆఆశ్రమం స్వర్గంలాగా, వారందరూ దేవతల్లాగా వున్నారు.

## ౧౬

## రాముడు గోదావరిలో స్నానం చెయ్యడం

రాముడా ఆశ్రమంలో నివసించి వుండగా శరదృతువు గడచిపో యింది. అతని కిష్టమైన హేమంతఋతువు వచ్చింది. ఒకనాడతను తెలతెలవారుతూ వుండగా గోదావరిలో స్నానం చెయ్యడానికి బయ

లుదేరాడు. రాముని తరవాత సీతా, సీత తరవాత బిందెపుచ్చుకుని లక్ష్మణుడూ కూడా బయలుదేరారు.

అప్పుడు లక్ష్మణు డిలా ప్రారంభించాడు.

"అన్నా! హేమంతఋతువు వచ్చింది. సంవత్సరం అంతా బాగా గడవడాని కయినా, చెడ్డగా గడవడాని కయినా యిదే ఆధారం. ఇది నీకు చాలా యిష్టమైన కాలం. మంచువల్ల అందరిశరీరాలు గరుసెక్కిపోతున్నాయి. భూమి అంతా సస్యాలతో నిండివుంది. నీరు అనుభవించరానిదిగా వుంది. ప్రతీవాళ్ళకీ నిప్పుదగ్గిర కూచోడం అంటే చాలా యిష్టంగా వుంటోంది. సజ్జనులు పితృదేవతలను పూజించి ఆగ్రయణం చేసి పాపవిముక్తులవుతున్నారు. పంటలు ముమ్మరంగా వుండడంవల్లా, పాలుపెరుగులు చాలా యెక్కువగా లభిస్తూవుండడంవల్లా పల్లెటూరి జనం చాలా వుల్లాసం పొందుతున్నారు. రాజులు దండయాత్రలు బయలుదేరుతున్నారు. సూర్యుడు దక్షిణాన సంచరిస్తూ వుండడంవల్ల బొట్టులేని ఆడదానిలాగ ఉత్తరదిక్కు వెలవెలపోతోంది. సహజంగా మంచుతో నిండివుండిన హిమవత్పర్వతం, సూర్యుడు దూరాన దక్షిణంగా వుండిపోడంవల్ల సార్థకనామం అవుతోంది. మధ్యాహ్నసమయాన ఎండలో తిరగడం అంటే ఇప్పుడు చాలా ముచ్చటగా వుంటోంది. సూర్యకాంతితో పగళ్లు చాలా రమ్యంగా వున్నాయి. నీడా నీరూ మాత్రం ఎవరికీ పనికిరాకుండా వున్నాయి. మంచు పడుతూ వుండడంవల్ల సూర్యుడు మార్దవం కనపరుస్తున్నాడు. గాలి వడవడ వణికించేస్తోంది. ఆకురాలి అరణ్యాలన్నీ శూన్యంగా వున్నాయి. జను లెక్కడా ఆరుబయట పరుండడంలేదు. మంచుతో ప్రపంచం అంతా ఎర్రదాళుగా వుంది. రాత్రులు ఎంతకీ గడవడంలేదు. చంద్రుని చక్కదనం అంతా యిప్పుడు సూర్యునకు సంక్రమించింది.

మంచుకప్పడం వల్ల యెర్రబడి చంద్రుడు నిట్టూర్పుగాలి తగిలిన అద్దం లాగ కళాశూన్యంగా వున్నాడు. మంచు కమ్ముడంవల్ల వున్నమినాడు కూడా వెన్నెల ఎండతగిలి నల్లబడ్డ సీతమ్మవదనలాగ కళదక్కి-వుంది. పడమటిగాలి సహజంగానే చల్లగా వుంటుంది. మంచుతగిలి అది యిప్పుడు మరింత చల్లనయిపోయింది. యవలూ గోధుమలూ మిక్కిలి పండివున్న అరణ్యాలు మంచుగప్పి క్రౌంచపక్షుల కూతలతో చాలా చక్కగా కనపడుతున్నాయి. ఖర్జూరపు పూలగుత్తులవంటి పచ్చని వెన్నులతో వంగి వరిపైరు చాలా సొగసుగా వుంది. అదిగో చూడూ, మంచు కురుస్తూ వుండడంవల్ల దూరాన ఉదయిస్తున్న సూర్యుడు చంద్రుడులాగ చూడముచ్చటగా వున్నాడు. ఇంతమంచు కురుస్తూ వుండినా ఇప్పుడు ఎండకి లోటులేదు; కాని ప్రాతఃకాలం అది నిగుప యోగంగా వుంది. మధ్యాహ్నం మాత్రం చాలా సుఖంగా వుంది. అడవి అంతటా పచ్చికబయళ్లు మంచుపడి లేతయెండలో మిక్కిలి సొంపుగా వున్నాయి. ఎంత దప్పికగా వున్నా నీరు తగిలాటప్పటికి జివ్వుమనడంవల్ల తొండం ముడిచేసుకుంటోంది యేనుగు. అదిగో చూడూ. చేతగానివాళ్లు యుద్ధరంగాన ఏమీచెయ్యలేకుండా వుండినట్టు నీటి పక్షులు నీటిలో దిగలేకుండా వున్నాయి. మంచుతెర చీకటికాగా పువ్వులు లేని యీచెట్లు నిద్రపోతున్నట్టున్నాయి. మంచుతెరవల్ల నది కనపడ్డంలేదు. కాళ్ళకి చల్లని యిసక తగలడంవల్లా, సారసపక్షుల కూతలవల్లా మాత్రం నది సమీపించినట్టు తెలుస్తోంది. మంచు పడుతూ వుండడంవల్లా, సూర్యుడు ఝుమాయించి యెండకాయకుండా వుండడంవల్లా, సహజంగా రాతిమీద ప్రవహిస్తూవుండడంవల్లా ఎంత రుచికలదయినా యీనీరు తాగడానికి శక్యం కాకుండా వుంది. రేకలూ కింజల్కాలూ రాలిపోయి కర్ణిక ముదిరిపోయి కాడ మాత్రమే మిగిలివున్న పద్మాలతో సరస్సులు శోభాహీనంగా వున్నాయి.

అన్నా, ఇలాటికష్టకాలంలో కూడా ధర్మాత్ముడైన భరతుడు నీయెడల గల భక్తివల్ల నానాదుఃఖాలూ అనుభవిస్తూ పట్నంలో తపస్సు చేస్తున్నాడు పాపం! అతను రాజ్యమూ, అభిమానమూ, నానాభోగభాగ్యాలూ విడిచిపెట్టేసి, కొద్దిగామాత్రమే భుజిస్తూ చల్లని నేలమీద పడుకుంటున్నాడు. అతను ఈసమయాన మంత్రులతో కలిసి సరయూనదిలో స్నానానికి వెడుతూవుంటాడు. సకలసుఖాలతోనూ పెరిగి సుకుమారుడై సుఖాలకు మాత్రమే అర్హుడైన భరతుడు పాపం సరియూనదిలో యెలా స్నానం చేస్తాడో! భరతు డంటే సామాన్యుడా? అతను పద్మనేత్రుడు. వీరుడు. చామనచాయవాడు. సింహమధ్యముడు. ధర్మం తెలిసినవాడు. సత్యవాది, లజ్జావంతుడు. జితేంద్రియుడు. చను వుగా మాట్లాడతాడు. దీర్ఘబాహువు. శత్రుంజయుడు. పాపం అలాంటి వాడు సకలభోగాలూ విడిచి నిన్నాశ్రయించుకుని వున్నాడు. నువ్వడ విలో వుండినా, తాను పట్నంలో వుండిన్నీ మునివేషధారి అయి తపోనియతుడై వుండడంవల్ల భరతుడు స్వర్గం స్వాధీనం చేసుకున్నాడు. నరులు తల్లినే గాని తండ్రిని అనుసరించరన్న సంప్రదాయం భరతుడు మార్చేశాడు. అయితే, భర్త అయిన దశరథుడు సాధువయి వుండగా, కొడుకైన భరతుడున్నూ సాధువయి వుండగా ఆ కైకమ్మ అంత క్రూరురా లెలా అయిందో!"

లక్ష్మణు డిలా అనేటప్పటికి రాముడు అసంతుష్టుడై "తమ్ముడూ! కైకమ్మను నువ్వు నిందించడం తగదు. అది విడిచిపెట్టి ఇక్ష్వాకునాథు డైన ఆభరతుని సంగతులే యింకా యింకా చెప్పు. వనవాసమే చెయ్యాలని నేనెంత దృఢపరుచుకున్నా నాబుద్ధి భరతునియెడగల స్నేహంవల్ల చంచలం అయిపోతోంది. అతని ముద్దుమాట లింకా వింటున్నట్టే వుంది నాకు. అవి ముద్దుమాటలు మాత్రమే కాదు. చాలా మధురమైనవి హృదయంగమాలు. అమృతంలా వుంటాయి.

మనస్సు కుల్లాసం కలిగిస్తాయి. తమ్ముడూ ! భరతునితోనూ వీరుడైన శత్రుఘ్నునితోనూ, నీతోనూ ఎప్పుడు కలిసివుంటానూ ? ” అని విలపిస్తూ, ఇంతలో గోదావరి సమీపించగా స్నానం చేశాడు. సీతా లక్ష్మణుడూ కూడా స్నానం చేశారు. వారు ముగ్గురూ పితృతర్పణాలూ సూర్యనమస్కారాలూ కూడా చేశారు. అప్పుడు సీతాలక్ష్మణులతో స్నానం చేసివున్న రాముడు పార్వతితోనూ, నందితోనూ, స్నానం చేసివుండిన సాంబమూర్తిలా వున్నాడు.

## ౧౭

## రామునిదగ్గరికి శూర్పణఖ రావడం

స్నానం పూర్తి కానిచ్చుకుని సీతా, రాముడూ, లక్ష్మణుడూ ఆశ్రమానికి వెళ్లారు. వెళ్ళగానే వారు పొద్దుటిపూట నిర్వర్తించవలసిన కర్మకాండ అంతా ముగించుకుని పర్ణశాలలో ప్రవేశించారు. ఇంతలో మును లనేకు లక్కడికి వచ్చారు. వారందరూ గౌరవిస్తూ వుండగా రాముడు లక్ష్మణునితో కలిసి యేమిటేమిటో చెబుతూ ఆనందంగా వున్నాడు. పర్ణశాలలో సీతతో కూచుని వుండిన రాముడు చిత్రా నక్షత్రంతో కలిసివుండిన చంద్రబింబంలా వున్నాడు. రాము డప్పుడక్కడ అలా మాట్లాడుతూ ఉండగా యాదాలాభంగా అక్కడికి వొక రాక్షసి వచ్చింది.

అది రావణుని చెల్లెలు శూర్పణఖ. రాముడు దానికి దేవకుమారుడు లా కనపడ్డాడు. సింహోరస్కుడూ, మహాబాహుడూ, పద్మనేత్రుడూ, ఆజానుబాహుడూ, ప్రియదర్శనుడూ గజగమనుడూ, జటామండలధారీ, సుకుమారుడూ, మహాసత్వుడూ అయి మహారాజలక్షణాలతో మెరిసిపోతూ మహేంద్రుడు లాగా నవమన్మథుడు లాగా వుండిన రాముణ్ణి చూశాటప్పటికి దానికి కామోద్రేకం కలిగింది.

తాను దుర్ముఖి, మహోదరీ విరూపాక్షీ రాగితీగలవంటి కేశపాశం కలదీ, విరూపురాలూ, గార్దభకంఠీ, వృద్ధురాలూ పరుషభాషిణీ దుర్వృత్తురాలూ, అప్రియదర్శనా అయినప్పటికీన్నీ ఆశూర్పణఖ, సుముఖుడూ, సన్నపునడుము కలవాడూ, విశాలనేత్రుడూ సుకేశుడూ, సుందరరూపుడూ, కిన్నరకంఠుడూ, యువకుడూ, దమశాలీ న్యాయప్రవర్తనుడూ అయిన రాముడితో, మన్మథపరవశురాలై "ఇటు జడలూ అటు ధనుర్బాణాలూ ధరించావు. ఇటు మునిలా కనపడుతున్నావు, అటు పెళ్ళాన్ని దగ్గిరపెట్టుకున్నావు, నువ్వెవరివోయి? రాక్షసుల విహారభూమి అయిన ఈఅడవికి ఎందుకువచ్చావురా?" అడిగింది.

అబద్ధం అంటే రాముడికి చాలా ద్వేషం. విశేషించి ఇప్పుడు ఆశ్రమవాసి అయి వున్నాడు. పైపెచ్చు స్త్రీజనంతో వున్నాడు. అంచేత అతను అబద్ధం ఏమీ రాకుండా "దశరథుడనే మహేంద్ర పరాక్రమశాలి వొక రాజున్నాడు. నేనతని పెద్దకుమారుణ్ణి. నా పేరు రాముడంటారు. ఇతను నా తమ్ముడు లక్ష్మణుడు. నేనంటే ఇతనికి ప్రాణం. ఈమె జనకమహారాజు కూతురు. నాభార్య. పేరు సీత. నాతండ్రీ, నాసవతితల్లీ ఆజ్ఞాపించగా ధర్మంకోసం నేనీ అరణ్యానికి వచ్చి నివసిస్తున్నాను. అయితే నువ్వెవరివి? నీవాళ్ళెవరు? నువ్వు రాక్షసి వని తోస్తోంది. ఇక్కడికి ఎందుకు వచ్చావు? అంతా నిజంచెప్పు" అని అడిగాడు.

దానిమీద మదనపరవశ అయిన శూర్పణఖ "రామా! అంతా నిజం చెబుతా విను. నేను కామరూపురాలనైన రాక్షసిని. నాపేరు శూర్పణఖ. నన్ను చూసి ప్రాణికోటి అంతా గడగడ లాడి పోతూ వుంటుంది. ఈఅరణ్యంలో నేనొక్కతెనే స్వేచ్ఛగా సంచరిస్తూ వుంటాను. మహాబలపరాక్రమవంతుడూ, రాక్షసనాథుడూ, మహావీరుడూ, విశ్రవసుని కుమారుడూ అయిన రావణుడు నా సోద

రుడు. అతని సంగతి నువ్వు వినే వుంటావు. ఎప్పుడూ నిద్రపోతూనే వుంటాడు చూడూ, మహాబలుడైన కుంభకర్ణుడు, అతను కూడా నా సోదరుడే. విభీషణుడున్నూ నా సోదరుడే. అయితే అతను ధర్మాత్ముడు. రాక్షసచేష్ట లతని దగ్గిర ఏమీ లేవు. యుద్ధరంగంలో వురికారంటే ఎలాంటివాళ్ళనీ కూలగొట్టేస్తా రని పేరు ప్రఖ్యాతులు గల ఖరుడూ దూషణుడూ కూడా నాసోదరులే; కాని నిన్ను చూడగానే వారి నందరినీ విడిచిపెట్టేసి పురుషోత్తముడవైన నిన్ను భర్తగా సేవించుకోవా లని నాకు బుద్ధి పుట్టింది. నేను చాలా గొప్ప దాన్ని. నాశక్తి ఎవరికీ లేదు. నేనెక్కడికి పడితే అక్కడికి స్వేచ్ఛగా వెళ్ళగలను. కనక నేటికయినా నువ్వు నాపెనిమిటి వయి నన్ను సుఖ పెట్టు. సీతతో నీకేమి పని? సీతచాలా వికృతంగా వుంది. కురూపి. నీకుతగ్గది కాదు, నేనే నీకు తగ్గదాన్ని, కనక నన్ను భార్యగా స్వీకరించు. ఈసీత వుండే నడుమేలేని నీ మొదటిభార్య, దీనినీ నీతమ్ముణ్ణీ నేను తినేస్తాను. తరవాత నువ్వు నాతో తిరుగుతూ యీదండకారణ్యంలో చక్కని పర్వతశిఖరాలూ, ఎంతో చక్కని వనాలూ చూడవచ్చు" అని చెప్పింది.

## ౧౮

## లక్ష్మణుడు శూర్పణఖ ముక్కూచెవులూ కొయ్యడం

రాముడు కామపాశవశురా లయిన శూర్పణఖను చూసి చిరునవ్వు నవ్వుతూ "చూడూ, నాకిదివరకే పెళ్ళయింది. ఈసీత నాభార్య. నీవంటి ఆడది సవతులతో కాపరంచెయ్యడం చాలా కష్టం. ఇతను నాతమ్ముడు. చాలామంచివాడు. పేరు లక్ష్మణుడు. చాలా చక్కనివాడు. ఇతనికింకా పెళ్ళికాలేదు. అపూర్వసౌందర్యవతిని పెళ్ళాడా లని కోరుకుంటున్న యితను నీకు తగినవాడు. కనక, సూర్య

కాంతి మేరుపర్వతమున ప్రసరించినట్లు నువ్వీతనిని చెట్టబట్టి సవతులు లేని కాపరం చేసి సుఖపడు ” అని చెప్పాడు.

అది నిజం అనుకుని శూర్పణఖ రాముణ్ణి విడిచిపెట్టి లక్ష్మణుని దగ్గిరికి దూకింది “ నీచక్కదనానికి తగినభార్యను నేను. కనక నన్ను కట్టుకుని నాతో కూడా యీదండకారణ్యం అంతా విలాసంగా సంచరించి సుఖపడు ” అనిన్నీ కోరింది. అందుకు మందహాసంచేసి మాట నేర్పుగల లక్ష్మణుడు “ సుందరీ! నువ్వు చెప్పింది బాగాలేదు. ఏమంటే? నేను భృత్యుణ్ణి. భృత్యుణ్ణి పెళ్ళాడి నువ్వుకూడా భృత్యురాల వెందు కయిపోవాలీ? నేను నా అన్నకే దాసుణ్ణి. ఈ రాముడు సకల సంపదలూ కలవాడు. నువ్వుసిద్ధార్థురాలవు. కనక, నువ్వు రాముణ్ణే పెళ్ళాడడం మంచిది. ఈసీత ఏమి బాగున్నదీ? ఈమె కురూపి దుర్మార్గురాలు. ఈమెను చూస్తే భయం. చాకిబానంత కడుపుతో చాలా వికారంగా వుంది. పైగా ముసిలిది కనక, ఈమెని విడిచిపెట్టి రాముడు నిన్ను పెళ్ళాడితే సుఖపడుతాడు. నీవంటిసుందరాంగిని విడిచిపెట్టి మనుష్యస్త్రీలను కోరే నిర్భాగ్యు డెవడుంటాడూ? ” అన్నాడు.

శూర్పణఖ ఇది నిజం అనుకుని రాముడి దగ్గిరికి వెళ్ళి “ రామా, కురూపీ, దుర్మార్గురాలూ, ఘోరాకారురాలూ కుంభోదరీ, వృద్ధురాలూ అయిన యీమెను చేరదీసి నన్ను లెక్కచెయ్యకుండావున్నావు. కనక, ఇదే యీమెని నువ్వు చూస్తూవుండగానే తినేస్తాను. తరవాత, సవతిలేకండా నీతో సుఖంగా వుంటాను ” అనిచెబుతూ రోహిణిమీద ఉల్క పడ్డట్టు సీతమీద పడబోయింది.

మత్యువులాగ మీదికి వస్తున్న ఆమెని అదలించి నిలిపి రాముడు “తమ్ముడూ! క్రూరులైన అనార్యులతో వేళాకోళాలాడగూడదు. ఈ సీత సుఖంగా వుండేటట్టు చూడు. ఈరాక్షసిని వికృతాకారను చేసెయ్యి ”అని ఆజ్ఞాపించాడు. లక్ష్మణుడు వెంటనే రామునిపక్కని

వున్న ఖడ్గం పుచ్చుకుని శూర్పణఖ ముక్కూ చెవులూ కోసి విడిచి పెట్టాడు.

అంతట శూర్పణఖ వర్షాకాలంలో మేఘం వురిమేటట్టు రకరకాల బొబ్బలుపెడుతూ, ఏడుస్తూ, చేతులు విసురుకుంటూ, అడవిఅంతటా రక్తం వోడ్చుకుంటూ పారిపోయింది. అప్పటికి ఆమె సోదరు డైన ఖరుడు ఆవనంలోనే వొకచోట చాలామంది రాక్షసులతో కూచుని వున్నాడు. శూర్పణఖ అక్కడికి వెళ్ళి ఆకాశాన్నుంచి పిడుగు పడేటట్టు వాళ్ళ యెదట పడింది.

## ౧౯

## శూర్పణఖ ఖరునితో తనభంగపాటు చెప్పుకోవడం

దాన్ని చూడగానే ఖరుడు అగ్గయిపోయాడు. "త్వరగా లే, ఏడవకు, నిన్నెవ డిలా చేశాడో చెప్పు. ఏజోలికీ పోక తనంతట తాను పడి వున్న నల్లతాచుని వేలుపెట్టి పొడిచినవా డెవడు? తన కంఠాన కాల పాశం తగులుకుని వుండడం గుర్తించుకోలేక నీమీద చెయ్యిచేసుకుని చేతులారా విషంతాగినవా డెవడు? నువ్వు బలవిక్రమసంపన్నురాలవు. కామరూపమూ, కామగమనమూ కలదానవు. మృత్యువువంటి నీకు ఇలాగ వికృతి కలిగించినవాడెవడు? నీకిలాగ వికారరూపం కలిగించిన వాడు దేవకుమారుడా, గంధర్వుడా, యక్షుడా, కిన్నరుడా, కింపురుషుడా మునికుమారుడా? వృత్రాసురుని తమ్ముడైన మన పాకాసురుణ్ణి చంపిన మహేంద్రుడు తప్ప నాకిలాంటి ద్రోహం చేసేవాడు మరొకడు కనపడడు. హంస నీళ్ళలోవున్న పాలు తాగేసేటట్టు నాబాణాలతో వాడి ప్రాణాలు తోడేస్తాను చూసుకో. వాడి రక్తం భూమి తాగుతుంది చూడు. వాడి మాంసం కాకులూ గద్దలూ తింటాయి చూసుకో. నాచేతుల్లో పడ్డ ఆసిర్భాగ్యుణ్ణి దేవతలూ, గంధర్వులూ పిశాచులూ

రాక్షసులూ కూడా రక్షించలేరు. కనక, నిన్నెవడిలా చేశాడో — తే, ఏడుపు మాని చెప్పు" అంటూ వురిమి అడిగాడు.

సోదరుడిలా అడగ్గా శూర్పణఖ "వాళ్ళు దశరథుని కొడుకులుట. పేరు రాముడూ లక్ష్మణుడూనూ. మంచి వయసులో వున్నారు. చాలా చక్కనివాళ్ళు. సుకుమారులే; కాని మహాబలవంతులు. పద్మ నేత్రులు. అయినా మొంచేతో గాని నారచీరలూ, అజినాలూ ధరించి వున్నారు. కందమూలఫలాలు ఆరగిస్తున్నారు. దాంతులూ ధర్మ చారులూ అయి తపోనిరతులయి వున్నారు. గంధర్వరాజుల్లా వున్నారు. వారి మొగాలలో రాజశీవి వుట్టిపడుతోంది. వాళ్ళు దేవతలో మను ష్యులో నేనూహించలేకుండా వున్నాను. సర్వాభరణాలూ ధరించు కుని వొక చక్కనిపిల్ల వాళ్ళ యిద్దరికీ మధ్య వుంది. నేను చూశాను. ఆ స్త్రీమూలంగా వాళ్ళిద్దరూ అనాథకిందకట్టి నన్నిలాచేశారు. కనక, నురగలు తేరుతున్న ఆముగ్గురి రక్తమూ నేను తాగాలి. ఇది నా మొదటి కోరిక. ఇంతవరకూ నేను నన్నేమీ కోరలేదు. వాళ్ళరక్తం మాత్రం నాకు కావాలి. యుద్ధంచేసి వాళ్ళని చంపి ఆరక్తం నా కివ్వాలి" అంటూ యేడుస్తూ గోలపెడుతూ చెప్పింది.

దానిమీద మళ్ళీ మండిపడి ఖరుడు "విన్నారా ? మనుష్యులుట. ఇద్దరుట. నారచీరలు కట్టి శస్త్రాస్త్రాలు ధరించివున్నారుట. ఒక ఆడ దానితో కూడా ఘోరమైన యీదండకారణ్యంలోనే వున్నారుట. వాళ్ళని ముగ్గురినీ మీరు చంపెయ్యాలి. ఇదిగో నాసోదరి వాళ్ళ రక్తం తాగుతుంది. కనక, మీరు వెళ్ళి వెంటనే వాళ్ళని సంహరించి దీని కోరిక తీర్చండి" అని యముల్లాంటి పధ్నాలుగురు రాక్షసుల కాజ్ఞాపించాడు. ఇది వినీవినడంతోటే గాలియెగరగొట్టిన మేఘశకలా ల్లాగ ఆరాక్షసులు శూర్పణఖతో కూడా యెగిరిపోయారు ; కాని

ఉదగ్ర తేజుడైన రాముణ్ణి చూడగానే దావాగ్ని చూసిన యేనుగుల్లాగ నిర్విణ్ణు లయిపోయారు.

## ౧౦

## రాముడు ఖరుని అనుచరులను సంహరించడం

"అరిగో, వాళ్ళిద్దరే నన్నిలా చేశా" రంటూ శూర్పణఖ చూపించింది. వాళ్ళుకూడా సీతతోనూ లక్ష్మణునితోనూ పర్ణశాలలో కూచుని వుండిన రాముణ్ణి చూశారు.

రాముడు వాళ్ళు కనపడగానే సంగతి అంతా గ్రహించి "తమ్ముడూ నువ్వు సీతదగ్గిర వుండు. నేను శూర్పణఖమాటమీద వచ్చిన వీళ్ళ నిప్పుడే సంహరించివస్తాను" అని చెప్పాడు. లక్ష్మణుడు సరే అన్నాడు. వెంటనే రాముడు ధనుస్సు ఎక్కుపెట్టి బాణాలు తొడిగి ముందుకి వచ్చి "మేము దశరథమహారాజు కొడుకులం. నాపేరు రాముడు, నాతమ్ముని పేరు లక్ష్మణుడు. నాభార్య అయిన సీతతో కూడా మేము చోరశక్యం కాని యీ దండకారణ్యానికి వచ్చాము. మేము ఫలాలూ దుంపలూ మాత్రమే భక్షిస్తున్నాము. ధర్మం తప్పక తపస్సు చేసుకుంటూ దాంతులమై యిక్కడ నివసించి వున్నాము. మీరు మమ్మెందుకు హింసిస్తారూ? మీరు పాపాత్ములు. సాధుసజ్జనహింసకులు. మిమ్ము సంహరించవలసిందని నన్ను మహర్షులు నియోగించగా నేనిక్కడికి వచ్చాను. తుచ్ఛులారా, అక్కడే నిలవండి. అడుగు కదిపారంటే మాట తక్కడు. మీకు ప్రాణాలమీద ఆశవుంటే అక్కణ్ణుంచే పారిపొండి" అంటూ నిప్పులు కక్కుతూ వురిమాడు.

దానిమీద ఆరాక్షసులు పధ్నాలుగురూ మిక్కిలీ క్రుద్ధులై శూలాలు ఎత్తిపట్టుకుని "మాదొర అయిన ఖరాసురునకు అపకారం

చేసి నువ్వు కోపం తెప్పించావు. కనక, నువ్వే యిప్పుడు మాచేతుల్లో ప్రాణాలు విడిచిపెడతావు. ఇందరం వున్నాము, మాయెదట నువ్వు నిలవనే లేవు, నువ్వింక యుద్ధం చేసేదేమిటి? ఇదిగో చూసుకో మాశూలాలతో నువ్వు నీచేతవున్న ధనుస్సూ, నీపరాక్రమమూ, నీప్రాణాలూ కూడా విడిచిపెడతావు" అని యెగిరిపడుతూ రాముని మీద శూలాలు విసిరారు; కాని వెంటనే పధ్నాలుగు బాణాలతో రాముడు ఆపధ్నాలుగు శూలాలూ ముక్కలు చేసేశాడు.

అంతటితో ఘోరుకోక ఇంకా క్రుద్ధుడై సూర్యబింబంలాగ మండి పోతున్న మరో పధ్నాలుగు బాణాలు తొడిగి, పర్వతాలమీద ఇంద్రుడు వజ్రాయుధం వేసినట్టు వాళ్ళమీద వేశాడు. వెంటనే వాళ్లు "నేలమీద పడిపోయారు. వాళ్ళ రక్తంతో భూమి అంతా తడిసి పోయింది. అది చూసి శూర్పణఖ బొబ్బలుపెట్టుకుంటూ మళ్ళీ పరుగెత్తి పోయి, అప్పటికి ముక్కుచెవులలోనుంచి కారుతున్న రక్తం కొంచెం యెండిపోగా బంకతో నిండిన అందుగుచెట్టు లాగ గోల పెడుతూ ఖరుని ముందు కూలబడింది.

## ౨౧

## నువ్వు శూరుడవు కావని శూర్పణఖ ఖరుణ్ణి నిందించడం

అది చూశాటప్పటికి ఖరునకు క్రోధం మరీ యెక్కువయి పోయింది. "నేనా నరులను సంహరించిరమ్మని పచ్చినెత్తురు తాగే రాక్షసులను పంపానే, మళ్ళీ యెందు కేడుస్తావూ? నేను పంపినవాళ్లేమి సామాన్యులా? నాఅనుచరు లందరిలోనూ నేనంటే వాళ్ళకే భక్త్యాదరా లెక్కువ. వాళ్లు నాకు ప్రాణస్నేహితులు. ఒకళ్ళని చంపుతారేగాని వాళ్లు చావరు. వాళ్లు నాకెప్పుడూ వ్యతిరేకం చెయ్యడం యెరగనే

మొరగరు. మళ్ళీ నువ్వు "రక్షించు రక్షించు" అంటూ పాములాగ పడి పొర్లుతున్నావు, దీని కేమి కారణమూ? ఎందరి నైనా రక్షించగల నేనుండగా, అనాథలాగ యేడవడం మంచిది కాదు, లే, లే, ధైర్యం తెచ్చుకో, బెంబేలు పడిపోకు" అని ఖరుడు దాన్ని వూరడించాడు.

దానిమీద శూర్పణఖ కళ్లు తుడుచుకుని కూచుని "నాముక్కూ చెవులూ పోయాయి. రక్తంతో నిండిపోయివున్నాను. నువ్వు నన్నూ రడించి రామలక్ష్మణులను సంహరించవలసిం దని మహాబలశాలు లైన పధ్నాలుగురు రాక్షసులను పంపావు; గాని రాముని బాణాలతో వాళ్లు నేలగూలి చచ్చిపోయారు. అలాంటివాళ్ళని చంపిన రాముణ్ణి చూశాటప్పటికి నాకు వొణుకు పుట్టింది. అంచేత నేను మళ్ళీ నిన్ను శరణుచొచ్చాను. విచారం అనే మొసళ్ళతోనూ, భయమనే కెరటాల తోనూ నిండివుండిన విశాలశోకసాగరంలో పడి మునిగిపోయిన నన్ను ఇప్పటికైనా వుద్ధరించు. నామీదా ఆరాక్షసులమీదా నీకు దయ వుండిన ట్టయితే—రామునితో పోరాడ్డానికి నీకు శక్తీ ధైర్యమూ వున్న ట్టయితే దండకారణ్యంలో కాలుపెట్టిన ఆనరాధముణ్ణి సంహరించు. నాకు పరమశత్రు వైన రాముణ్ణి నువ్వు సంహరించకపోతే నీయెదటే నేను ప్రాణాలు విడిచిపెడతాను. నువ్వు గొప్పవీరుడవే, గొప్పసైన్యాని కిన్నీ నాథుడవే; కాని మహావీరు డైన రామునియెదట నువ్వు నిలవ లేవని నాకు తోస్తోంది. ఇద్దరు మనుష్యులను సంహరించలేనివాడవు, నువ్వు శూరుడవంటే యేమిటి, పరాక్రమశాలి వంటే యేమిటి? కొద్ది పాటి బలమూ, స్వల్పపరాక్రమమూ గల నువ్వు ఈజనస్థానంలో వుండతగ్గవాడవు కావు. నీపరివారంతో కూడా త్వరగా దయచెయ్యి. రామునియెదట నిస్తేజుడ వయిపోయిన నువ్వు భూమిమీద మన్నవు, శీఘ్రముంగానే నశించిపోతావు. నాముక్కూ చెవులూ కోసిన రాముడు

మహా తేజశ్శాలి. అతని తమ్ముడున్నూ మహావీరుడు" అంటూ నెత్తీ నోరూ బాదుకుంటూ యేడ్చేసింది.

## ౨౨

## పద్నాలుగు వేలరాక్షసులతో ఖరుడు రామునిమీదికి బయలుదేరడం

శూర్పణఖ మాటలకు ఖరుడు చాలా రోషం తెచ్చుకున్నాడు. దాంతో రాక్షసు లందరూ వింటుండగా వాడు "నీకు జరిగిపోయిన అవమానం చూడగా నాకు కలిగిన క్రోధం వుప్పెనలాగ భరించ రాకుండా వుంది. రాముణ్ణి నేను వీరుడని లెక్కపెట్టను. తానుచేసిన దుష్కార్యాలకు ఫలంగా వాడిప్పుడే ప్రాణాలు విడిచి పెడతాడు. ముందు కన్నీరు తుడుచుకో. భయంవిడిచిపెట్టు. తమ్మునితో రాముణ్ణి నేను యమమందిరానికి పంపేస్తాను, నమ్ము. నాగండ్రగొడ్డలితో నిమిషంలో వాణ్ణి తెగ్గొట్టేస్తాను, లే, వాడి వేడివేడి రక్తం తాగుదు వుగాని రా" అని పరవళ్ళు తొక్కాడు.

అది చూచి శూర్పణఖ మూర్ఖురాలు కనక, ఖరుణ్ణి "నువ్వుచాలా గొప్పవాడ" వని పొగడింది. అలాగ తనసోదరి తనని మొదట దూషించడమూ తరవాత భూషించడమూ అయాక ఖరుడు దూషణు డనే సేనాధిపతిని చూసి "మనపద్నాలుగువేల సైన్యమూ సిద్ధం చెయ్యి. మనసైనికులు రాక్షసు లందరిలోనూ చెప్పుకో తగ్గవీరులు. వాళ్ళు భీమవేగులు. యుద్ధాలలో వెనకంజ వెయ్యనివాళ్ళు. నీలమేఘ శ్యాములు. ఎలాంటి క్రూరకర్మ చెయ్యడాని కయినా జంకని ఘోర చిత్తులు. జనహింస అంటే వాళ్ళకి పండుగు. అంతబలమూ, అంత తేజస్సూ కలవాళ్ళు లోకంలో యెక్కడా లేరు. వ్యాఘ్రముఖు లైన వాళ్ళ నందరినీ తొందరపెట్టు. నారథం సిద్ధం చేయించు. నాధను

స్సులూ అమ్ములపొదులూ చిత్రవిచిత్రాలైన ఖడ్గాలూ, శక్తులూ రథం మీద వుంచు. పౌలస్త్యులందరిలోనూ నేనే ముందుగా దుర్వినీతుడైన రాముణ్ణి సంహరించడానికి వెడతాను" అని చెప్పాడు.

దూషణుడు వెంటనే ఆరథం తెప్పించాడు. అది సూర్యబింబంలాగ మెరిసిపోతోంది. గుర్రాలు చాలా చక్కగా వున్నాయి. రథానికి బంగారంతో నగిషీ చేశారు. చక్రాలకున్నూ బంగారపు పని చేశారు. నొగలకు వైడూర్యాలు చెక్కారు. శిల్పాలు దానిమీద చేపలూ పుష్పాలూ, చెట్లూ పర్వతాలూ, సూర్యచంద్ర బింబాలు రకరకాల పక్షులూ, నక్షత్రాలూ చెక్కారు. చిరుగంటలు మోగుతుండగా వచ్చిన రథంయెక్కి ఖరుడు తేరిచూశాడు.

అలాగ ఖరుడు రథం యెక్కగానే భీమవిక్రములైన రాక్షసులు వాణ్ణీ దూషణుణ్ణీ పరివేష్టించి నిలిచారు. ధృఢకంచుకాలూ గొప్ప గొప్ప ఖడ్గాలూ ధనుర్బాణాలూ ధరించివుండిన ఆసైనికులను ఖరుడు "బయలుదేరండి" అని ఆజ్ఞాపించాడు. వెంటనే వాళ్ళందరూ ఆమహారణ్యం అంతా దద్దరిల్లుపోయేటట్టు బొబ్బలుపెడుతూ బయలుదేరారు. వాళ్ళుముద్గరాలూ, పట్టసాలూ, శూలాలూ, గండ్రగొడ్డళ్లూ ఖడ్గాలూ, చక్రాలూ, తోమరాలూ, శక్తులూ పరిఘులూ, అసమానబాణాలూ, గదలూ, కత్తులూ, ముసలాలూ, వజ్రాలూ ధరించి యమభటుల్లాగ మహాభయంకరంగా వున్నారు. ఇలాంటి పధ్నాలుగువేలమంది రాక్షసులు జనస్థానం నుంచి బయలుదేరారు.

వాళ్ళలా కదలగానే ఖరుని యింగితం గుర్తించి సారథి గుర్రాలను అదలించాడు. రథం బయలుదేరింది. రథనేమిధ్వనితో ఆకాశం బద్దలయిపోయింది. దాంతో ఖరుడు వుద్రిక్తుడయిపోయాడు. "త్వరగా పోనియ్యి" అని వాడు సారథిని తొందరపెట్టాడు.

## శ్రీ

### రాక్షసులకు దారిలో దుర్నిమిత్తాలు తోచడం

ఖరుడు దండయాత్రకు బయలుదేరగానే గాడిదల్లాంటి మేఘాలు జనస్థానం అంతటా నెత్తురులాంటి వర్షం కురిశాయి. బాట సమంగానే వుండినా పువ్వులు చల్లడంవల్ల చక్కగా కూడా వుండినా ఖరుని రథాశ్వాలు వెళ్ళి వెళ్ళి అమాంతంగా కూలబడ్డాయి. కొరివి చుట్టచుట్టి తగిలించినట్టు సూర్యబింబానికి ఎర్రని అంచులతో నల్లని పరివేషం ఏర్పడింది. బంగారపుకామగల ఎత్తయిన ధ్వజంమీద పెద్దగద్ద వాలింది. మాంసభుక్కులైన పక్షులూ జంతువులూ జనస్థానం దగ్గిరికి వచ్చి గాడిదకూతలు కూశాయి. తూర్పుదిక్కున నక్కలు చేరి రాక్షసులకు అమంగళకరంగా వూళపెట్టాయి. బద్దలాసిపోయిన పర్వతాల్లాగ మేఘాలు ఆకాశం అంతా కమ్మేసి రక్తమే కురియసాగాయి. దిక్కూ తెన్నూ తోచకుండా వాళ్ళు గరిపొడిచేటట్టు దారుణమైన చీకట్లు అలముకున్నాయి. క్రూరమృగాలూ, రాబందులూ, గద్దలూ, నక్కలూ, ఖరున కెదురుగానే వస్తూ ఘోరంగా అరిచాయి. నక్కలు సేన ముందుకి వచ్చి యుద్ధంలో పరాజయం సూచిస్తూ నిప్పులు కక్కుతూ అరిచాయి. పరిఘాయుధం వంటి ధూమకేతువు సూర్యుని దగ్గిర కనపడింది. అమావాశ్య కాకపోయినా ఆ వేళ రాహువు సూర్యుణ్ణి పట్టుకున్నాడు. ఓరుగాలి వీవసాగింది. సూర్యుని కాంతి మందగించింది. రాత్రి కాకపోయినా ఆకాశాన నక్షత్రాలు మెరిశాయి. చెరువులలో చేపలూ తాబేళ్ళూ మునిగిపోయాయి. తామరపువ్వులు రాలిపోయాయి. పువ్వులూ, కాయలూ, పళ్ళూ— చివరికి ఆకులుగూడా రాలిపోయి చెట్లన్నీ మోడులయిపోయాయి. గాలి ఆగిపోయాక దుమ్ము రేగింది. గోరువంకలు వికటంగా కూశాయి. భయంకరా

లైన ఉల్కలుపడ్డాయి. పర్వతాలతోనూ, అడవులతోనూ భూమి అంతా గడగడ వణికిపోయింది. రథంమీద కూచుని వుసుముతున్న ఖరుని యెడమభుజం అదిరింది. కంఠం బొంగురుపోయింది. చూస్తూం డగానే అతని కళ్ళు నీళ్ళు కమ్మాయి. నుదురుమీద ముసలితనం కనపడింది. అయినా వాడు మూర్ఖత్వం వహించి వెనక్కి మళ్ళలేదు.

పై పెచ్చు, ఆమహోత్పాతాలు చూసి రాక్షసులతో "మహాబల పరాక్రమశాలి నైన నేను ఈవుత్పాతాలు లక్ష్యపెట్టను. నాబాణా లతో ఆకాశాన వున్న నక్షత్రాలనుకూడా రాలగొడతాను, మృత్యు వునకు కూడా మరణం కలిగిస్తాను; కాని నాతీక్ష్ణబాణాలతో రాముణ్ణీ వాని తమ్ముణ్ణీ చంపకండా నేను వెనక్కిమళ్ళను. ఎవ తెకోసం రామ లక్ష్మణుల కిలాంటి దుర్బుద్ధిపుట్టిందో ఆనాసోదరి శూర్పణఖ ఆరామ లక్ష్మణుల రక్తం తాగి సఫలమనోరథురాలు కావలసిందే. యుద్ధాలలో ఇంతవరకూ నే నపజయం యెరగను. అది మీకందరికీ తెలిసిందే. అందులో అబద్ధం యేమీ లేదు. ఐరావతం యెక్కి వజ్రాయుధం చేతపట్టివచ్చినా మహేంద్రుణ్ణయినా కూల్చేస్తాను, నాకా క్షుద్ర మానవు లొక లెక్కా?" అంటూ చెప్పాడు.

ఆరాక్షససేన మృత్యుసన్నిహితం కనక తమ ప్రభువు దర్పం చూసి జయజయధ్వానులు చేసింది. ఈయుద్ధం చూదామని మహాత్ము లైన మహర్షులూ, దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, చారణులూ ఆకాశాన కూడి "గోవులకూ, బ్రాహ్మణులకూ, లోకకల్యాణం కోరే వారి కందరికీన్నీ మంగళం అగుగాక, సుదర్శనచక్రధారి అయిన శ్రీమహావిష్ణువు అసురులను సంహరించేటట్టు శ్రీరామచంద్రుడు ఈరాక్షసుల నందరినీ సంహరించి విజయం పొందాలి" అంటూ గట్టిగా చెప్పుకుంటూ ఆయువు మూడి యుద్ధానికి వెళుతున్న రాక్షస సైన్యం చూశారు.

ఖరుడు యథాప్రకారం సదర్పంగానే వెడుతున్నాడు. రాక్షస సైనికులున్నూ అంతదర్పంగానే వెడుతున్నారు. శ్యేనగామీ, పృథుగ్రీవుడూ, యజ్ఞశత్రువూ, విహంగముడూ, దుర్జయుడూ, కరవీరాక్షుడూ, పరుషుడూ, కాలకార్ముకుడూ, మేఘమాలీ, మహామాలీ, సర్పాస్యుడూ, రుధిరాశనుడూ — ఈపన్నెండుగురు రాక్షసవీరులూ, ఖరుణ్ణి పరివేష్టించివున్నారు. మహాకపాలుడూ, స్థూలాక్షుడూ, ప్రమాథీ, త్రిశిరుడూ — ఈనలుగురు వీరులూ దూషణుణ్ణి పరివేష్టించి వున్నారు. ఇలాగ ఆరాక్షసు లందరూ గ్రహాలన్నీ చంద్రసూర్యులను చేరేటట్టు రామలక్ష్మణులను సమీపించారు.

## ౨౪
## రాముడు రాక్షసులను ఎదిరించి నిలవడం

ఘోరపరాక్రము డైన ఖరుడు బయిలుదేరాక ఆశ్రమంలో వున్న రాముడున్నూ ఉత్పాతాలుచూశాడు. శరీరం గగుపొడిపిస్తున్న వాటిని చూస్తూ రాముడు "తమ్ముడూ సర్వభూతాపహారు లైన యీ మహోత్పాతాలు చూశావా. ఇవి రాక్షసవినాశానికి వచ్చాయి. దారుణంగా గర్జిస్తూ గాడిదలరంగు గల యీమేఘాలు రక్తం కురుస్తున్నాయి. నాబాణా లన్నీ పొగలు కక్కుతూ యుద్ధంకోరుతున్నాయి. రుక్మపృష్ఠం అయిన నా ధనుస్సు యుద్ధోత్సాహం వెల్లడిస్తోంది. ఈపిట్టల కూతలు వినగా మనకి భయోత్పాతాలూ జీవితసంశయమూ కూడా కలిగే టట్టుంది. నాదక్షిణబాహువు మాటిమాటికీ అదురుతూ యుద్ధం తప్ప దని సూచిస్తోంది. మనకి జయమూ, శత్రువునకు పరాభవమూ కూడా తప్పదనిపిస్తోంది. నీమొగం చాలా కళగానూ ప్రసన్నంగానూ వుంది. యుద్ధోన్ముఖు లయినవారి మొగాలు వెలవెలబోతే యుద్ధంలో వారికి పరాజయం తప్పదు. అదిగో, రాక్షసులు మళ్ళీ వస్తున్నట్టున్నారు. వారి సింహనాదాలూ, భేరీభాంకా

రాలూ వినిపిస్తున్నాయి. ఆపద వస్తుందని అనుమానం కలిగినవాడు అది తటస్థపడకముందే జాగ్రత్తపడాలి కనక చెట్లగుబురులలో దుర్గం లా వుండిన పర్వతగుహ చూసి ధనుష్పాణివై సీతను అక్కడికి తీసుకువెళ్ళి జాగ్రత్తగా వుండు. నామాట కద్దుచెప్పవద్దు, నా పాదాల మీద వొట్టుపెట్టి చెబుతున్నాను. నువ్వాలస్యం చెయ్యవద్దు, త్వర పడు. నువ్వు శూరుడవే, వీళ్ళనందరినీ నువ్వు సంహరించగలవు, నాకు తెలుసు; కాని వీళ్ళనందరినీ నేనొక్కణ్ణే చంపదలుచుకున్నాను" అని చెప్పాడు. వెంటనే లక్ష్మణుడు మారుచెప్పకుండా, ధనుర్బాణాలు పుచ్చుకుని, సీతను వెంటబెట్టుకుని గుహాలోకి వెళ్ళిపోయాడు.

లక్ష్మణుడు అలా వెళ్ళగానే "భేష్! లక్ష్మణుడు మహాబాగా చేశా" డని పొంగిపోతూ రాముడు కవచం ధరించాడు. అగ్నిలాగ వెలిగిపోతున్న ఆకవచం తొడుక్కోగానే రాముడు పొగ తగ్గిపోయిన అగ్నిలాగ తేజరిల్లాడు. మరిన్నీ అతను ధనుస్సు ఎక్కుపెట్టి బాణాలు చేతబుచ్చుకుని దిక్కులు పిక్కటిల్లేటట్లు నారి మోగిస్తూ యివతలికి వచ్చాడు. అప్పుడు దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, చారణులూ మహర్షులూ యుద్ధంచూడడానికి విమానాలమీద వచ్చి ఒకరితో వొకరు "గోవులకూ, బ్రాహ్మణులకూ, లోకకల్యాణం కోరేవారికీ శుభం కలగాలి. చక్రహస్తుడైన శ్రీమహావిష్ణువు అసురులను సంహరించేటట్లు రాముడు ఈరాక్షసుల నందరినీ సంహరించాలి. అయితే, అతిదారుణాలైన పనులుచేసే రాక్షసులు పధ్నాలుగువేలా? ధర్మాత్ముడైన రాము డొక్కడా? వీరికి యుద్ధం యెలాజరుగుతుందో కదా?" అనుకుంటూ రెప్పవెయ్యకండా చూడసాగారు.

అప్పుడు మహావేశంతో యుద్ధానికి సిద్ధంగా వున్న రాముణ్ణి చూచి సమస్తభూతాలూ గడగడలాడిపోయాయి. అప్పుడు రాముడు క్రుద్ధుడైన రుద్రుడులా వున్నాడు.

ఇలాంటి సమయంలో ఘోరకవచాయుధధ్వజాలు ధరించి పెడ బొబ్బలుపెట్టుకుంటూ, పరవళ్లు తొక్కుతూ వస్తున్న రాక్షససేన కనపడింది. వాళ్లు సింహనాదాలు చేస్తున్నారు. ఒకళ్ళనొకళ్లు హెచ్చరించుకుంటున్నారు. ధనుస్సు లెక్కపెట్టి జాయఘోషచేస్తున్నారు. ఆవులిస్తున్నారు. అరుస్తున్నారు. భేరీదుందుభులు మోగిస్తున్నారు. ఈధ్వను లన్నీ కలిసి అడివి దద్దరిల్లచేస్తున్నాయి. ఆధ్వనికి క్రూరజంతువులూ, మృగాలూ, పిట్టలూ, కూడా వెనక్కితిరిగి చూడకుండా పారిపోయాయి. రకరకాల ఆయుధాలు ధరించి సాగరం పొంగివస్తున్నట్లువచ్చి ఆసేన రాముణ్ణి సమీపించింది.

రణపండితుడైన రాముడున్నూ అంతా కలయచూసి ఖరసైన్యం యుద్ధాభి ముఖమై వచ్చిందని తెలుసుకున్నాడు. అప్పు డతను సకల రాక్షసులనూ సంహరించడాని కుద్యుక్తుడై ఉగ్రు డయిపోయాడు. యుగాంతాగ్ని లాగ దుర్నిరీక్ష్యు డైన రాముణ్ణి చూసి వనదేవతలు పారిపోయాయి. అప్పుడు రాముని రూపం దక్షుని యజ్ఞం నాశనం చెయ్యబూనిన పినాకపాణి రౌద్రరూపం లా వుంది.

ఆధనుస్సులతోనూ, ఆ ఆభరణాలతోనూ, ఆజెండాలతోనూ, అగ్ని లాగ మెరుస్తున్న కవచాలతోనూ ఆరాక్షససైన్యం సూర్యోదయ కాలంలో ఆకాశం కమ్మివున్న నీలమేఘసమూహం లా వుంది.

## ౨౫

## రాముడు ఖరుని సైన్యం నాశనం చెయ్యడం

ఆశ్రమానికి రాగానే ఖరునకు ధనుస్సు సజ్యంచేసుకుని వున్న రాముడు కనపడ్డాడు. వెంటనే "రాముని మీదికి రథం నడిపించు" అని సారథి నాజ్ఞాపించాడు. తమ ప్రభు వైన ఖరుడు యుద్ధసన్నద్ధుడు కావడం

చూసి సింహనాదాలు చేస్తూ మంత్రులు వాణ్ణి పరివేష్టించారు. మహావీరు లైన ఆమంత్రుల మధ్యవుండిన ఖరుడు నక్షత్రాల మధ్య వున్న అంగారకుడు లా వున్నాడు.

అప్పుడు ఖరుడు సింహనాదంచేసి చాలా బాణాలు విడిచి రాముణ్ణి పీడించాడు. అది చూసి మహాధనుర్ధారి అయి వుండిన రామునిమీద మంత్రులూ సేనాధిపతులూ కూడా వేలబాణాలు వేశారు. సైనికులైన రాక్షసులున్నూ ముద్గరాలూ, పట్టసాలూ, శూలాలూ, ప్రాసలూ, ఖడ్గాలూ, గండ్రగొడ్డళ్లూ విసురుతూ రాముణ్ణి ముట్టడించారు. మొత్తం రాక్షససైన్యం అంతా గుర్రాలతోనూ, ఏనుగులతోనూ, రథాలతోనూ, వచ్చి రాముణ్ణి నొక్కేద్దామని మేఘాల్లాగ కమ్ముకు న్నారు. మరిన్నీ వాళ్ళందరూ పర్వతంమీద మేఘాలు వర్షించేటట్టు రామునిమీద శరవర్షం కూడా కురిశారు; కాని రాముడు ఎన్ని నదులు వచ్చిపడ్డా సముద్రుడు మింగేసేటట్టు తీవ్రబాణాలు విడిచి వాటిని వ్యర్థం చేసేశాడు. రాక్షసుల ఆయుధా లెంత తీక్షణంగా వుండినా, ఎన్ని పిడుగులు పడ్డా పర్వతం చలించనట్టు వాటిని రాముడు లెక్కచెయ్యలేదు; కాని, వాటివల్ల గాయాలు తగిలి కొంచెం రక్తం కారగా సంధ్యాకాలమేఘాలతో కప్పబడ్డ సూర్యుడు లాగ ప్రకాశిం చాడు. దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, మహర్షులూ, అనేకవేల రాక్షసుల మధ్య చిక్కి వున్న రాముణ్ణి చూసి చాలా దుఃఖించారు.

అప్పుడు రాముడు మిక్కిలీ క్రోధం తెచ్చుకుని చక్రం అయిపోయే టట్టు ధనుస్సువంచి రాక్షసులమీద వందలూ వేలూ బాణాలు విడి చాడు. రాముడు విడిచిన బాణాలన్నీ అనివార్యాలు. దుస్సహాలు. యమదండసమానాలు. ఆబాణాలు యమపాశాల్లాగ రాక్షససైన్యం మీదపడి వాళ్ళప్రాణాలు తీశాయి. మరిన్నీ, ఆబాణాలు రాక్షసుల ప్రాణాలు తీసి ఆకాశాన వ్యాపించి అగ్నిజ్వాలల్లాగ మెరిశాయి,

మరిన్ని మండిపడుతూ రాముడు విడిచిన బాణాలు వాళ్ళ ధనుస్సులనూ, జెండాలనూ, కవచాలనూ, శిరస్త్రాణాలనూ, శిరస్సులనూ, సకలాభరణ భూషితాలైన బాహువులనూ, ఏనుగుతొండాలవంటి తొడలనూ, భేదించేశాయి. రథాలనూ, రథాలకు కట్టిన గుఱ్ఱాలనూ, సారథులనూ, ఏనుగులనూ, మావటీళ్ళనూ, యోధులనూ, గుఱ్ఱాలనూ, రౌతులనూ, ఎగిసిపడే కాల్బంటులనూ, కూడా అనేకంగా నాశనం చేశాయి.

రామబాణాలు భరించలేక రాక్షసులు ఏడవసాగారు. రామ బాణాగ్నికి రాక్షససైన్యం ఎండిపోయిన అరణ్యం అయిపోయింది. అయినా, మహాధైర్యవంతులని పేరుపడ్డ రాక్షసవీరులు మరికొందరు ముందుకి వచ్చి మీదపడ్డారు ; గాని రాముడు వారి బాణాలనే కాక వాళ్ళని కూడా నాశనం చేసేశాడు. వాళ్ళందరూ గరుత్మంతుని రెక్కలవల్ల పుట్టినగాలికి చెట్లు పడిపోయేటట్టుచాపచుట్టుగా పడిపో యారు. మిగినవాళ్ళు ఖరునిదగ్గిరికి పారిపోయి శరణుచొచ్చారు.

అది చూసి దూషణుడు వాళ్ళనందరినీ ప్రోత్సహించి మళ్ళీ రాముని మీాది కురికించాడు. ఈమాటు రాక్షసులు మద్దిచెట్లూ, తాడిచెట్లూ రాళ్లూ పుచ్చుకుని కొందరూ, కత్తులూ, కటార్లూ, గండ్రగొడ్డళ్ళూ, శూలాలూ, ముద్గరాలూ ధనుస్సులూ పుచ్చుకుని కొందరూ యుద్ధం ప్రారంభించారు. దీంతో రామునకూ రాక్షసులకూ ఘోరయుద్ధం ప్రారంభమయింది. చూసేవాళ్ళకి శరీరాలు గరిపొడిచాయి. గావు కేకలు పెడుతూ రాక్షసులు తన్ను ముట్టడించగా రాముడు సింహ నాదం చేసి గాంధర్వాస్త్రం ప్రయోగించాడు. వెంటనే రాముని ధనుస్సునుంచి వేనవేలు బాణాలు బయలుదేరి దశదిక్కులూ నిండి పోయాయి. దాంతో, రాముడు బాణాలు పుచ్చుకోడం, తొడగడం, సాచిలాగడం, విడవడం గుర్తించలేకపోయారు ; కాని ఆబాణాలు తగిలి అవస్థలుమాత్రం పడసాగారు. మరెన్ని వాళ్ళకి రాముడు పోట్టిలో

నుంచి బాణాలు కక్కుతున్నట్టు కనపడ్డారు. ఆబాణాలతో ఆకాశం నిండిపోవడమే గాదు, సూర్యుడున్నూ మరుగుపడిపోయాడు.

మాటిమాటికీ రాముని బాణాలు పడ్డాయి. మాటిమాటికీ దెబ్బలు తిని రాక్షసులు పడిపోయారు. మరిన్నీ వాళ్ళు కొందరు చెట్లు కూలి నట్లు కూలీ, కొందరు తలకాయ లెగిరిపోయీ, కొందరు డొక్కలు చీలిపోయీ, కొందరు నిలువునా ముక్కలయిపోయీ పడిపోయారు. భూమి అంతా రాక్షసశవాలతో నిండిపోయింది.

## ౨౬

## సైన్యం అంతా నశించగా ఖరుడే రామునిమీద పడడం

ఇలాగ తన సైన్యం అంతా నశించడం చూసి దూషణుడు క్రోధో ద్రిక్తుడై మరో అయిదువేలమందిని రాముని మీదకి కవ్వించాడు. వాళ్ళు మహావేగులు. ఎలాంటివాళ్ళనీ లక్ష్యపెట్టనివాళ్ళు. ఎలాంటి యుద్ధాల్లోనూ వెనకంజవెయ్యడం యెరగనివాళ్ళు. వాళ్ళందరూ శూలాలూ, పట్టసాలూ, ఖడ్గాలూ, బాణాలూ రాళ్ళూ రప్పలూ విసిరి ముంచేత్తేశారు; కాని, ప్రాణాంతకమైన ఆవర్షం అంతా తన తీక్ష్ణబాణాలతో మళ్ళించేసి ధైర్యంగా నిలబడ్డాడు రాముడు. ఆబోతు ఎంతవర్షం పడుతున్నా లక్ష్యంచెయ్యకుండా కళ్ళుమూసుకుని నిలవబడి వుండేటట్టు రాముడు ఆ ఆయుధవర్షం లెక్కచెయ్యకపోడమే కాకుండా, మిక్కిలీ క్రుద్ధుడై దావాగ్నిలాగ మండిపోతూ తనబాణాలతో శత్రువులను కప్పేశాడు. అదిచూసి సహించలేక దూషణుడు కూడా పిడుగుల్లాంటి శరాలు రామునిమీద విడిచిపెట్టాడు.

రామునకు మరీకోపం వచ్చింది. వెంటనే మొదట అతను క్షురం ప్రయోగించి దూషణుని చేతవున్న మహాధనస్సు ముక్కలు చేశాడు.

నాలుగు బాణాలు వేసి నాలుగు గుర్రాలనూ కూల్చాడు. అర్ధచంద్ర బాణం ప్రయోగించి సారథి తల యెగరగొట్టాడు. మరో మూడు బాణాలు విడిచి దూషణుని గుండెలు పగలగొట్టాడు.

దీంతో చాలా శౌర్యం తెచ్చుకుని పర్వతశిఖరంవంటి పరిఘ పుచ్చుకుని బయలుదేరాడు దూషణుడు. దానికి బంగారుకట్లు వేశారు. ఎన్నో దేవతాసైన్యాలను అది ఎన్నోమార్లు మర్దించివుంది. శూలాల్లాగ దానినిండా యినపమేకులున్నాయి. శత్రువుల కొవ్వుతో అది జివజివలాడుతోంది. వజ్రాల్లాగా పిడుగుల్లాగా అది అతికఠినంగా వుంది. అది యెన్నో శత్రుగోపురద్వారాలు బద్దలుకొట్టింది. దాన్ని చూస్తేనే ఎలాంటివాళ్ళూ గడగడలాడిపోతారు. అలాంటి పరిఘ పుచ్చుకుని దూషణుడు సింహనాదం చేస్తూ ముందుకురికాడు; గాని రాముడు రెండు శరాలు విడిచి చూస్తుండగానే వాడి చేతులు తెగ్గొట్టాడు. దాంతో ఇంద్రధ్వజంలాగ ఆపరిఘ వొకవైపునా, మోడులాంటి వాడి మహాశరీరం మరోవైపునా పడిపోయాయి. అలా పడిపోయిన దూషణుడు కొమ్ములు తెగి పడిపోయిన పెద్దయేనుగులా వున్నాడు. దూషణుడలా పడిపోవడం చూసి "బాగు బాగు" అని సకలభూతాలూ రాముణ్ణి మెచ్చుకున్నాయి.

ఇంతలో మహాకపాలుడూ, స్థూలాక్షుడూ, ప్రమాథీ అనే ముగ్గురు సేనానులు రామునిమీాది కురికారు. మహాకపాలుడు పెద్ద శూలం పట్టుకువచ్చాడు. స్థూలాక్షుడు పట్టసం పట్టుకువచ్చాడు. పరశ్వధం పట్టుకుని ప్రమాథి వచ్చాడు. వాళ్ళరాక చూసి రాముడు అతిథులను సత్కరించేటట్టు మూడు తీక్ష్ణబాణాలతో వాళ్ళని కీచుమనిపించాడు. వెంటనే మహాకపాలుని తల యెగరగొట్టాడు. ఎన్నో బాణాలు వేసి ప్రమాథిని కూల్చాడు. తీక్ష్ణబాణాలతో స్థూలాక్షునికళ్ళు పీకే

శాడు. అయిదువేల బాణాలు విడిచి దూషణునితో వచ్చిన అయిదు వేలమందినీ కూడా యమలోకానికి పంపించాడు.

ఖరు డది చూశాడు. వెంటనే క్రుద్ధు డయిపోయి "ఇదే క్షుద్రు డైన మనుష్యునితో యుద్ధంచేసి దూషణుడు తన అనుచరు లందరి తోనూ కూలిపోయాడు. మీరంతా వెళ్ళి నానా ఆయుధాలతోనూ వాణ్ణి కుళ్ళబొడవండి" అని అరిచాడు. ఇలా అరిచి ఖరుడుకూడా రాముని మీద కురికాడు. అదిచూసి శ్యేనగామీ, పృథుగ్రీవుడూ, యజ్ఞశత్రువూ, విహంగముడూ, దుర్జయుడూ, కరవీరాక్షుడూ, పరుషుడూ, కాలకార్ముకుడూ, మేఘమాలీ, మహామాలీ, సర్పముఖుడూ, రుధిరాశనుడూ ఈపన్నెండుగురు సేనాధిపతులూ కూడా తమతమ వీరభటులతో రాముని మీద కురికారు. "ఆ, రండి" అని వురిమి రాముడు హేమవజ్రవిభూషితా లైన అగ్నివంటి బాణాలతో ఆమిగిలిన సైన్యాన్ని కూడా కొట్టేశాడు. రుక్మపుంఖాలు కావడంవల్ల పొగతో కూడిన అగ్నిహోత్రాల్లాంటి ఆబాణాలు వజ్రాయుధం పెద్దపెద్దచెట్లను కూలగొట్టేటట్టు వాళ్ళని కూల్చేశాయి. కవచాలు బద్దలయి ధనుస్సులూ, బాణాలూ ముక్కలయి ఆరాక్షసులందరూ రక్తంవోడు కుంటూ భూమిమీద పడిపోయారు. రక్తం వోడ్చుకుంటూ జుట్టువిడి పోయి వున్న ఆరాక్షసులతో, యుద్ధభూమి, దర్భలతో నిండిన అగ్ని హోత్రవేదిలా వుంది. ఇలాగ ఆవనం అంతా రాక్షసుల రక్తమాంసాలతో నిండిపోయింది. మనుష్యుడైన రాముని చేతిలో ఇలాగ పద్నాలుగువేలమంది రాక్షసవీరులూ కూలిపోయారు. మొత్తానికి వచ్చిన రాక్షసు లందరిలోనూ, ఖరుడొక్కడూ, త్రిశిరు డొక్కడూ, ఇటు రాము డొక్కడూ మాత్రమే యుద్ధభూమిలో మిగిలివున్నారు. అలాంటి తన మహావీరులందరూ రణభూమిలో పడిపోయి వుండడం

సహించలేక ఖరుడు వజ్రాయుధం యెత్తి యింద్రుడు బయలుదేరినట్లు రామునిమీాదికి బయలు దేరాడు.

## ౨౭

## రాముడు త్రిశిరుణ్ణి సంహరించడం

అలాగ ఖరుడు రామునిమీాద పడడానికి వెడుతూ వుండగా, త్రిశిరుడనే సేనాధిపతి సవినయంగా సన్నిధికి వచ్చి "వీరాధివీరా! నువ్వు వెనక్కిమళ్ళి యీాపనిలో దయతో నన్ను నియోగించు. రాముడు నాచేత కూలేటట్టునూ్నా చూడు. సమస్తరాక్షసులకూ పరమవిరోధి అయిన రామ్ముణ్ణి నేను సంహారిస్తా నని యిదే కత్తి ముట్టి నేను ప్రమాణం చేస్తాను. నేను రాముణ్ణయినా సంహారించాలి. రాముడు నన్నయినా సంహారించాలి గాని యిక్కడ మరో పద్ధతి లేదు. నువ్వు సాక్షివై అంతా చూస్తూ వుండు. నేను రాముణ్ణి సంహారిస్తానా, నువ్వు సంతోషంగా జనస్థానానికి వెళ్ళవచ్చు. లేదూ నేనే పడిపోతానా, అప్పుడు నువ్వు రామునిమీాదికి వెళ్ళడం వుండనే వుంది." అని ప్రార్థించాడు. దానికి ఖరుడు మృత్యులోభంవల్ల త్రిశిరుణ్ణి అనుగ్రహించి "సరే, నువ్వే యుద్ధం చెయ్యి" అని సెలవిచ్చాడు.

వెంటనే మూడుశిరస్సులు గల ఆ సేనాధిపతి మూడు శిఖరాలున్న పర్వతంలాగ రథం యెక్కి రామునిమీాదికి వెళ్ళాడు. వెళ్ళి మహామేఘము జలధార విడిచేటట్టు శరపరంపర విడుస్తూ తడిసిన భేరీ మోగేటట్టు సింహనాదం చేశాడు. అలా వస్తున్న త్రిశిరుణ్ణి తాను కూడా నిశితబాణాలు విడుస్తూ అతిథిగా స్వీకరించాడు రాముడు. అప్పుడు సింహానికీ యేనుక్కీ అయినట్టు రామునకూ త్రిశిరునకూ సంకులసమరం జరిగింది. అప్పుడు త్రిశిరుడు రాముని నొసట మూడు

బాణాలు వేశాడు. అది చూసి "ఓహో! నానోసట పుష్పాలు వేసినట్టు మూడు బాణాలు వేశాడు, ఈ రాక్షసు డెంతటి వీరుడూ?" అని పలికి "నువ్వు కూడా నాబాణాలు పరిగ్రహించు" అనిన్నీ చెప్పి, రాముడు తాచుపాములవంటి పధ్నాలుగు బాణాలతో త్రిశిరుని గుండెలమీద కొట్టాడు. నాలుగు బాణాలు వేసి మిక్కిలి నేర్పుగా వాడి గుర్రాలను కూల్చేశాడు. ఎనిమిది బాణాలు వేసి సూతుణ్ణి పడగొట్టాడు. ఒక బాణంతో వాడి జెండా యెగరగొట్టాడు.

అందుకు చేసేది లేక వెంటనే త్రిశిరుడు నేలకూలి రామునిమీదికి బయలుదేరాడు; కాని రాముడు వెంటనే బాణాలు వేసి మళ్ళీ వాడి గుండెలమీద కొట్టాడు. దాంతో వాడు నిశ్చేష్టు డయిపోగా మూడు బాణాలు వేసి వాడి శిరస్సులు మూడూ పడగొట్టేశాడు. అంతట వాడు ముందే శిరస్సులు డుల్లిపడడంవల్ల రక్తం వోడుకుంటూ తాను కూడా నడగొండలాగ పడిపోయాడు.

అది చూసి మిగిలి వున్న ఖరుని వీరభటులు పులిని చూసిన లేళ్ళ లాగ పారిపోసాగారు. దాంతో మరీ క్రుద్ధుడై "వెనక్కి తిరగండి" అని అరిచి వాళ్ళని మళ్ళించి చంద్రుణ్ణి పట్టడానికి రాహువు బయలు దేరే టట్టు రాముణ్ణి కొట్టడానికి తానే స్వయంగా బయలు దేరాడు ఖరుడు.

## ౨౮

## రాముడు ఖరుణ్ణి విరథుణ్ణి చెయ్యడం

త్రిశిరుడు కూడా అలా పడిపోగానే రాముని పరాక్రమం గుర్తించి ఖరుడు కూడా భయపడ్డాడు; గాని, అలాంటి శూరులూ, అంత సైన్యమూ ఒక్క రామునిచేతిలో నాశనం కావడం చూసి ముందు దుఃఖించి, అంతలో రోషం తెచ్చుకుని ఇంద్రునిమీద నముచి వురికినట్టు

రామునిమీద వురికాడు. మరిన్ని వాడు బలమైన ధనుస్సు ఎక్కు-పెట్టి నెత్తురుతాగే బాణాలు తొడిగి రామునిమీద విడిచాడు. మాటి మాటికీ నారి మోగిస్తూ, రకరకాల బాణాలు తొడిగి ఎన్నో విధాల వాటిని విడుస్తూ వాడు తన ధనుర్విద్యాకౌశలం చూపించాడు. ఆబాణాలన్నీ ఆకాశమూ దశదిశలూ నిండిపోయాయి. రాముడున్నూ అందుకు తీసిపోకుండా అగ్నిస్ఫులింగాలవంటి బాణా లనేకం విడిచి ఆకాశం కప్పేశాడు. మొత్తానికి ఆయిద్దరి బాణాలతోనూ ఆకాశం నిండిపోయి దిగ్భేదం తెలియకుండా అయిపోయింది. ఆశరజాలంలో సూర్యబింబంకూడా ప్రచ్ఛన్నం అయిపోయింది.

తరవాత ఖరుడు నడగొండవంటి పెద్దయేనుగును కొరడాతో కొట్టినట్టు రామునిమీద నాళీకనారాచాలు విడిచాడు. రథంమీద ధనుష్పాణి అయి వున్న ఖరుణ్ణి చూసి భూతజాలం అంతా పాశహస్తుడైన యముడనుకుని భయభ్రాంతం అయింది. వాడు తన సైన్యం అంతా సంహరించడంవల్ల రాముడప్పటికి అలసిపోయి వుంటాడనుకున్నాడు; కాని ఎంతపరాక్రమం చూపిస్తున్నా ఖరుణ్ణి రాముడు సింహం క్షుద్రమృగాన్ని చూసినట్టు చూశాడు.

సూర్యబింబంలాగ వెలిగిపోతున్న రథంమీద వున్న ఖరుడు అప్పుడు మిడత అగ్గిలో పడేటట్టు రామునిమీద పడ్డాడు. ముందు వాడు తన శరలాఘవం చూపించడానికి బాణాలు తొడిగివున్న రాముని ధనస్సును ముష్టిదగ్గర విరగకొట్టాడు. తరవాత పిడుగుల్లాంటి మరో యేడుబాణాలతో రాముని కవచం బద్దలుకొట్టాడు. దాంతో రాముని కవచం కింద పడిపోయింది. వెంటనే మరికొన్ని బాణాలతో రాముణ్ణి కొట్టి ఖరుడు సింహనాదం చేశాడు. ఆ బాణాలు తగలడం వల్ల రక్తం స్రవించగా రాముడు పొగ తగ్గి మండుతున్న అగ్నిలా ప్రకాశించాడు.

అప్పుడు రాముడు మరో గొప్ప ధనుస్సుచేతబట్టి శత్రువును నాశనం చెయ్యడానికి ఎక్కుపెట్టాడు. ఆధనుస్సు అగస్త్యమహర్షి దయ చేసిన వైష్ణవధనువు. ఆధనుస్సుతో రాముడు ముందు ఖరుని జెండా యెగరగొట్టాడు. అలా విరిగి ఆజెండా దేవతల ఆజ్ఞవల్ల కింద పడిపోయిన సూర్యబింబంలాగ నేలమీద పడిపోయింది, అందుకు సహించక ఏనుగును అంకుశంతో పొడిచేటట్టు ఖరుడు నాలుగుబాణాలు వేసి మర్మభేదం చేస్తూ రాముణ్ణి కొట్టాడు. దాంతో రామునకు చాలా రోషం వచ్చింది. వెంటనే అతను ఆరుబాణాలు వేసి ఒక దానితో శిరస్సూ, రెండింటితో బాహువులూ, మూడర్ధచంద్రబాణాలతో గుండెలూ చితకగొట్టాడు. తరవాత ఖరుణ్ణి సంహరించదలచి సూర్యుడులా వెలుగుతున్న పదమూడు బాణాలు తొడిగి, ఒకదానితో రథం కాడీ, నాలుగింటితో నాలుగుర్రాలనూ, వొకదానితో సారథి తలా, మూడింటితో పోలుగర్రా, రెండింటితో అక్షమూ, పన్నెండో దానితో బాణాలు తొడిగివున్న ఖరుని ధనుస్సూ యెగరగొట్టి పదమూడోదానితో ఖరుణ్ణి నుగ్గు నుగ్గు చేశాడు. చేసేదిలేక ఖరుడప్పుడు దారుణమైన గద అందుకుని కింది కురికాడు.

విమానాలమీద ఆకాశాన వుండిన దేవతలూ మహర్షులూ మొదలైనవా రందరూ రాముడు చేసిన ఆగొప్పపని చూసి ఆనందభరితులై చేతులు మోడ్చుకుని అతన్ని అనేకవిధాల ప్రశంస చేశారు.

## ౩౯

## రాముడు ఖరుని గద నాశనం చెయ్యడం

రథం కూలగానే గదాపాణి అయి వచ్చిన ఖరుణ్ణి చూసి రాముడు మెత్తనిమాటలే ప్రయోగిస్తూ పరుషభావం కనపడేటట్టు "అపారమైన చతురంగబలం వున్నందుకు సత్కర్మ చెయ్యక నువ్వు త్రిలోకాలూ ఏవగించుకునే దారుణకర్మ చేశావు. ప్రాణికోటికి విపత్తులు

కలిగిస్తూ క్రూరకర్మలు చేసేవాడు త్రిలోకాధిపతి అయినా బతికి బట్ట కట్టలేడు. లోకవిరుద్ధ మైన పని చేసేవాణ్ణి జనులు దుష్టసర్పాన్ని చితకబొడిచేటట్టు సంహరించేస్తారుగాని విడిచిపెట్టరు. లోభంవల్లనో కామంవల్లనో పాపాలుచేసినవాడు వడగళ్ళు తిన్న నలికెళ్ళపాములాగ నశించిపోతాడు. దండకారణ్యంలో వసించి తపస్సు చేసుకుంటూ వుండే మునులను చాలా మందిని సంహరించావే, దానివల్ల నీకేమి లాభం వచ్చింది? వేరు చీకిపోయిన చెట్టెంతకాలం నిలిచివుంటుంది? అలాగే లోకం యేవగించుకుంటున్నా మహాపాపాలు చేసి గొప్ప ఐశ్వర్యం సంపాదించిన దుర్మార్గు లెంతకాలం వుంటారూ? అనుకూల మైన ఋతుకాలం వచ్చినప్పుడు ఆయావృక్షాలు పూస్తాయి. అలాగే ప్రతీవాడూ తాను చేసిన పాపాలకు సమయం వచ్చినప్పుడు ఫలం అనుభ వించితీరతాడు. విషాన్నం తిన్నవాళ్ళకి వెంటనే నాశనం సంభవించేటట్టు అత్యుత్కటా లైన పాపాలు చేసేవాళ్ళు అప్పటికప్పుడే తత్ఫలం అనుభ వించితీరతారు. ఘోరపాపాలు చేసేవాళ్ళనీ, లోకాన్ని బాధించే వాళ్ళనీ దశరథమహారాజు ఆజ్ఞాపించగా నేను దండించడానికి వచ్చాను. పాములు పుట్టలు పడగొట్టేటట్టు నాబాణాలు నిన్నిప్పుడే చీల్చేస్తాయి. ఈ దండకారణ్యంలో నువ్వు చంపివున్నావే, వారిని నీ చతురంగబలం అంతటితోనూ నువ్విప్పుడే కలుసుకుంటావు. కులాధమా నీ శక్తికొద్దీ ప్రయత్నించు. నీ యిష్టంవచ్చినట్టు నన్ను కొట్టు. నేనుమాత్రం తాటి పండు వూడగొట్టినట్టు నీతల యెగరగొట్టేస్తాను” అని చెప్పాడు.

రాము డిలా చెప్పగా మిక్కిలీ క్రుద్ధుడై కళ్ళెర్రజేసి ఖరుడు వెట కారం చేస్తూ “ఓదశరథుని కొడకా! నువ్వు రాక్షసులలో అతి సామా న్యులను కొందరినిసంహరించావు. దాంతో మహాశూరుడ వై పోయినట్టు ప్రగల్భాలు కొడుతున్నావు. బలవంతులూ సాహసవిక్రములూ అయిన నరోత్తములు స్వశక్తిని చూసుకుని గర్వించి నీలాగ ఆత్మస్తుతి చేసు

కోరు. క్షుద్రులూ, పిరికిపందలూ అయిన క్షత్రియాధములు మాత్రమే నీలాగ గప్పాలుకొడతారు. యుద్ధరంగంలో మృత్యువు మీదికి వచ్చినప్పుడు బుద్ధిమంతుడైన వీరు డెవడయినా తనవంశ ప్రతిష్ఠ పొగుడుకుంటాడా! బంగారం లాగ మెరిసే రాయి తాను మండు తున్న అగ్నికణం అనుకుంటుంది. అలాగే నువ్వు ప్రగల్భాలు మాత్రమే పలికి నీ అల్పత్వం ప్రకటించుకున్నావు. గదాపాణినై నీయెదట నిలిచివున్న నన్ను నువ్వు ఎవరూ కదలించలేని మహాపర్వతం అని యెరగవు. యముడు మూడులోకాలనూ సంహారించగలిగేటట్టు నేను నీప్రాణాలు హరించగల నని నువ్వెరగవు. నీవిషయమై చెప్ప వలసింది చాలానే వుంది; కాని యిక మాట్టాడను. ఏమంటే? సూర్యాస్తమయం కాబోతుంది. ఆలస్యం చేస్తే యుద్ధానికి విఘ్నం తటస్థిస్తుంది. నువ్వు నాఅనుచరులను పధ్నాలుగువేలమందిని చంపావు. ఇప్పుడు నిన్ను చంపి నేను వాళ్ళకి అశ్రుతర్పణం చేస్తాను" అని చెబుతూ పిడుగులా మెరిసిపోతున్న తన గద రామునిమీదికి విసిరే శాడు. ఆగద మండిపోతూ దారిలోవున్న తుప్పలనూ, మహావృక్షా లనూ కూడా భస్మం చేసేస్తూ రాముణ్ణి సమీపించింది; కాని మృత్యుపాశంలాగ మెరుస్తూ వస్తున్న ఆగదను రాముడు ఆకాశంలోనే తీక్ష్ణబాణాలతో ధ్వంసం చేశాడు. దాంతో మంత్రాలవల్లా ఓషధుల వల్లా మహాసర్పం చచ్చిపడిపోయేటట్టు అది ముక్కా చెక్కా అయి మండిపోతూ నేలమీద పడిపోయింది.

## ౩౦

## రాముడు ఖరుణ్ణి సంహరించడం

రాముడు అలాగ గదను నాశనంచేసి ధర్మవత్సలుడు కనక చిరునవ్వు నవ్వుతూ ఖరుణ్ణి చూసి "రాక్షసాధమా! ఈవిధంగా నీ శక్తి

యొావత్తూ చూపించావు. కాని నాచేతిలో నువ్వు శక్తిహీనుడ వయిపో యావు. ఇంకెందుకు వ్యర్థంగా వేలడం? నీశత్రువులను సంహారిస్తుందని నువ్వనుకున్న నీగద యిదిగో నాబాణాలతో పిప్పిపిప్పి అయి నేలమీాద పడివుంది. నీవాళ్ళకి నువ్వు అశ్రుతర్పణం చేస్తానన్నావే, అదీ అబద్ధం అయిపోయింది. నువ్వు నీచుడవు. నీస్వభావం క్షుద్రం. నీనడత చాలా చెడ్డది కనక, గరుత్మంతుడు అమృతభాండం హరించినట్టు నేను నీప్రాణాలు హరిస్తాను. ఇప్పుడే నాబాణాలతో నీతల ఢుల్లగొడతాను, నీకంఠనాళంనుంచి నురగలు కక్కుకుంటూ స్రవించే నీవేడిరక్తం తాగి భూదేవి శమిస్తుంది. శరీరం అంతా దుమ్మూ బురదా నిండగా చేతులు చాచి బోర్లపడి నువ్వు అతికష్టంమీాద లభించిన ప్రియురాలిని లాగ భూమినిప్పుడే కౌగిలించుకుంటావు. రాక్షసకులపాంసనుడ వైన నువ్వు పెద్దనిద్ర చెందగానే యీాదండకారణ్యాం అంతా అశరణు లయిపోయిన మునులకు మళ్ళీ శరణ్యాం అవుతుంది. నీజనస్థానం అంతా యిలాగ నావల్ల రాక్షస శూన్యం కాగానే మును లిక్కడ నిర్భయంగా మసు లుకుంటారు. ఇప్పటిదాకా యిక్కడి మునుల నందరినీ పీడించిన రాక్షసస్త్రీలు, తమవాళ్ళందరూ నాశనం కాగా భయభ్రాంతలై యిప్పుడు నెత్తీ నోరూ బాదుకుంటూ పారిపోతారు. ఘాతుకుడా, నీచుడా, క్షుద్రుడా, బ్రాహ్మణకంటకుడా! ఏసమయాన వచ్చి ఏమి అపాయం కలిగిస్తారో అని ఎవళ్ళని తలుచుకుని భయపడుతూనే మును లగ్నిహోత్రాలు చేసుకుంటూ వుండేవారో నీవంటి అధముణ్ణి భర్తగా పడసిన ఆరాక్షసస్త్రీలు ఇప్పుడు సకలసుఖాలకూ దూరం అయిపోయి, శోకరసం అంటే యేమిటో యిప్పుడు తెలుసుకుంటారు" అంటూ వుటంకరించాడు.

దానిమీాద అతిరోషావిష్టుడై ఖరుడు "నువ్వు మిక్కిలీ గర్వించి వున్నావు. అంచేతనే భయపడవలసిన సమయాన కూడా నిర్భీకుడవై

మృత్యుముఖాన పడివుండడంవల్ల అనతగ్గదీ అనరానిదీ కూడా యెరగ లేకుండావున్నావు. మృత్యుపాశబద్ధులైనవాళ్ళు ఇంద్రియపాటవం చెడి యుక్తాయుక్తాలు తెలుసుకోలేరులే" అని ధిక్కరించి పలికి, బొమలు ముడివేసుకుని సమీపానే వున్న మద్దిచెట్టుచూసి, ఔదుకరుచుకుంటూ అది పెరికి తెచ్చి, సింహనాదం చేసి "చచ్చావు" అంటూ రాముని మీదికి విసిరేశాడు.

మహాప్రతాపవంతుడైన రాముడు మీదికివస్తున్న ఆచెట్టు తునకలుచేసేసి కిందపడగొట్టేశాడు. అతను చాలా రోషం తెచ్చుకున్నాడు. దాంతో వొళ్ళంతా చెమట పట్టింది. కళ్ళెర్రబడ్డాయి. వెంటనే వెయ్యి బాణాలు విడిచి అతను ఖరుని శరీరం అంతా తూట్లు తూట్లుగా కొట్టాడు. దాంతో ప్రస్రవణపర్వతంనుంచి జలధారలు స్రవించేటట్టు ఖరుని దేహం అంతటా రక్తం కాల్వలు కట్టింది. రామబాణాల దెబ్బ బాగా తెలిశాటప్పటికి వాడికి మనస్సు చలించింది. అంతటితో ఆగకుండా తన నెత్తురువాసనకే మత్తు కలిగి వాడితల తిరిగిపోయింది. వెంటనే యేమి చేస్తున్నదీ తెలవక రామునిమీంది కురికాడు.

రాము డిలా జరుగుతుం దనుకో లేదు. రక్తం వోడుకుంటూ ఖరుడు బాణం తొడగడానికి వీలులేనంత మీదికి వచ్చాటప్పటికి అతి వేగంగా అతనొక్క అడుగు వెనక్కివేశాడు. వెంటనే అగ్నిలా మెరుస్తున్న బాణం తొడిగాడు. అది రెండో బ్రహ్మదండం వంటిది. అది దేవరాజయిన మహేంద్రు డిచ్చినది. రాము డా బాణం విడిచాడు. అది మీద పడేటప్పటికి ఖరుడు, శ్వేతారణ్యంలో ఈశ్వర నేత్రాగ్నిదగ్ధుడైన, యముడు లాగా, వజ్రాయుధం దెబ్బతిన్న వృత్రాసురుడు లాగా, నురుగుతాగిన నముచి లాగా, వజ్రాఘాతంతో బలాసురుడు లాగా నేలమీద పడిపోయాడు. అప్పుడు రాజర్షులూ, మహర్షులూ ఆకాశాన వొకచోట చేరి "రామా, మహేంద్రు డిందు

కోసమే శరభంగాశ్రమానికి వచ్చాడు. ఈరాక్షసులను సంహరించ డానికే వుపాయంచేసి మహర్షులు నిన్నిక్కడికి తీసుకువచ్చారు. నువ్వు మాపని చక్కబెట్టావు. ఇక మహర్షులు సుఖంగా ధర్మం చేసు కుంటూ ఈదండకారణ్యంలో నివసిస్తారు" అని పొగిడారు. ఈలోపున చారణులున్నూ చేరి దేవదుందుభులు మోగిస్తూ పూలవాన కురిశారు. "ఓహో, రాముడొక్క క్షణంలో పధ్నాలుగు వేలమంది రాక్షసు లను సంహరించాడు. ఖరుడూ, దూషణుడూ, మొదలైన రాక్షస ప్రముఖులు చచ్చిపోయారు. ఆహా! శ్రీమహావిష్ణువు శక్తిసామర్థ్యాలు శ్రీరామునిలో కనపడుతున్నాయి" అని దేవతలు ప్రశంశచేస్తూ యథేచ్ఛగా వెళ్ళిపోయారు.

ఈలోపున లక్ష్మణుడు సీతను వెంటబెట్టుకుని గుహలోనుంచి ఆశ్ర మానికి వచ్చాడు. అప్పుడే అనేకవిధాల కొనియాడుతూ మునులు వెంటరాగా రాముడున్నూ ఆశ్రమంలో ప్రవేశించాడు. వెంటనే లక్ష్మణుడు సీతన్ని పూజించాడు. రాముడు రాక్షసుల నందరినీ సంహ రించడమూ, అపాయ మేమీ లేకుండా క్షేమంగా వుండడమూ చూసి సీత చాలా సంతోషించి అతన్ని మళ్ళీమళ్ళీ కౌగిలించుకుని మిక్కిలీ ప్రస్తుతించింది.

౩౧

## అకంపనుడు లంకకు వెళ్లి జరిగిందంతా రావణునకు చెప్పడం

ఇది యిలా జరగ్గానే అకంపనుడు వాయువేగమనోవేగాలతో లంకకు వెళ్ళి, రాక్షసరా జయిన రావణుణ్ణి సందర్శించి "రాజా, జనస్థానంలో రాక్షసులు చాలామంది చచ్చిపోయారు. యుద్ధంలో ఖరుడు కూడా కూలిపోయాడు. నేను మాత్రం యెలాగో ప్రాణాలు తక్కించుకు వచ్చాను" అని విన్నవించాడు. అది విని రావణుడు మండిపడ్డాడు.

చివరికి అతను నిప్పులు కక్కుతూ చూస్తూ "ఎవడురా రమ్యమైన జనస్థానం నాశనంచేసినవాడు? త్రిలోకాలలోనూ వాడెక్కడ నిలవ గలడురా? నాకపకారం చేసి దేవేంద్రుడూ, కుబేరుడూ, యముడూ, విష్ణువూ కూడా బతికివుండలేరు. నేను యమునకు యముణ్ణి. అగ్నినే దహించేస్తాను. మృత్యువును చంపేస్తాను. సూర్యుణ్ణి మండించేస్తాను. వేగం లేకుండాచేసి గాలిని కూలగొట్టేస్తాను" అంటూ వురిమాడు.

ఆ రౌద్రరూపం చూసి వొణికిపోయి అకంపనుడు ముందు అభయం వేడుకుని, పొంది "మహాప్రభూ! దశరథమహారాజు కొడుకు రాముడని వొక కుర్రాడున్నాడు. అతను వృషస్కంధుడు. వృత్తాయతమహాభుజుడు. అపారబలపరాక్రమాలు గలవాడు. సింహాలను కూడా అతను విలాసగా సంహారించకలడు. జనస్థానం అంతా అతను నాశనం చేశాడు. ఖరుణ్ణీ దూషణుణ్ణీ అతనే సంహారించాడు" అని మళ్ళీ విన్నవించాడు. అది విని రావణుడు నాగేంద్రుడులాగ బుసకొట్టి "అకంపనా! రాముడు జనస్థానానికి దేవతల నందరినీ వెంటబెట్టుకు వచ్చాడా?" అనడిగాడు. అందుకు అకంపనుడు "రాజా! రాముడు మహాతేజశ్శాలి. ధానుష్కులందరిలోనూ చాలా గొప్పవాడు. అతని దగ్గిర దివ్యాస్త్రాలెన్నో వున్నాయి. యుద్ధరంగానికి వచ్చాడంటే అతను మహేంద్రుణ్ణి మించి వుంటాడు. అతనికి తగినవాడే లక్ష్మణుడని తమ్ముడున్నాడు. లక్ష్మణుడున్నూ చాలా బలవంతుడు. అతని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వుంటాయి. అతను మాట్లాడితే దుందుభి మోగినట్టు చాలా గంభీరంగా వుంటుంది. చాలా చక్కనివాడతను. అగ్ని గాలిని తోడుచేసుకున్నట్టు రాముడతన్ని వెంటబెట్టుకువచ్చి జనస్థానం పట్టేశాడు. దేవతలు గాని మహాత్ములుగాని అతని కూడా రాలేదు. నీకాసందేహం యెంతమాత్రమూ వద్దు. రాముడు విడిచిన బాణాలు సర్పాలూ, సింహాలూ అయి రాక్షసులను తినేశాయి.

రాక్షసులు భయకంపితులై ఎక్కడికి పారిపోతే రాముడు వాళ్ళ కక్కడే కనపడసాగాడు. సీజనస్థానం అంతా రాముడీ విధంగా నాశనం చేశాడు" అని బదులుచెప్పాడు.

అకంపనుడు చెప్పింది విని రావణుడు "నేనిదే రాముణ్ణి సంహరించడానికి బయలుదేరుతున్నా" నన్నాడు. అందు కడ్డువచ్చి అకంపనుడు "మహాప్రభూ! తొందరపడవద్దు. ముందు రాముని బలపరాక్రమాలు ఉన్నదున్నట్టు చెపుతా విను. ఎలాంటి వాళ్ళూ రాముణ్ణి సాధించలేరు. కుపితుడై అతను బాణం వేసి కూలంకషంగా ప్రవహించే నదిని ఆపివెయ్యగలడు. నక్షత్రాలతోనూ గ్రహాలతోనూ నిండివున్న ఆకాశం పడగొట్టగలడు. మునిగిపోతున్న భూమిని లేవనెత్తగలడు. చెలియలికట్ట నాశనంచేసి సముద్రం వుప్పొంగ జేసి మూడులోకాలూ ముంచెయ్యగలడు. వాయువేగం బంధించగలడు. లోకాలన్నీ నాశనం చేసి క్షణంలో మళ్ళీ సృష్టించగలడు. యుద్ధంచేసి నువ్వూ రాముణ్ణి జయించలేవు. పాపాత్ములకు స్వర్గం సాధ్యం కానట్టు రాక్షసు లందరూ కలిసివెళ్ళినా అతను సాధ్యుడు కాడు. ఇంతే కాదు, దేవతలూ రాక్షసులూ కలిసివెళ్ళినా అతన్ని జయించలే రనే నానమ్మకం. ఇక మంచి వుపాయం చెబుతాను విను. అంతకంటే మంచిదారి లేదు శ్రద్ధగా విను. సీత అని అతని భార్య. ఆమె తనుమధ్య. ఎక్కడ యెంత పుష్టి వుండాలో అంత పుష్టితో ఆమె శరీరం సమవిభక్తం అయివుంది. మాంచి ముమ్మరంలో వుంది. సమస్తరత్నాభరణాలూ ధరించివున్న ఆమె వొక్కతే స్త్రీలలో రత్నం అని చెప్పవచ్చు. దేవతలలోనూ గంధర్వులలోనూ అప్సరసలలోనూ దానవులలోనూ కూడా అంత చక్కని సీమంతిని వుండడంటే యిక మనుష్యులలో వుండదని చెప్పడం యెందుకూ? కనక రాము ణ్ణెలాగయినా యేమర్చి నువ్వు ఆమెను బలాత్కారంగా తీసుకురా. రాముడు మిక్కిలి కాముకుడు. ఆమెని విడిచి

క్షణం అయినా వుండలేడు ; కనక దాంతో నిస్పృహతో అతను ప్రాణాలు విడిచిపెట్టేస్తాడు" అని చెప్పాడు.

అకంపనుని మాట రావణునునకు నచ్చింది. బాగా ఆలోచించాడు. వెంటనే అతను "చాలా బాగుంది. తప్పకుండా అలాగే చేస్తాను. ఒక్క సారథిని వెంటబెట్టుకుని చీకటితోనే నేనొక్కణ్ణే వెడతాను. సీతను తీసుకువచ్చి యీపట్నంలో వుంచేస్తాను" అన్నాడు. అని అన్నట్టే అతను కంచరగాడిదలు పూన్చిన రథం యెక్కి బయలు దేరాడు. ఆరథం సూర్యుడిలాగ వెలిగిపోతోంది. దాని తేజస్సుతో దిక్కు లన్నీ నిండిపోయాయి. అది నక్షత్రమార్గంలో బయలుదేరింది. మబ్బు తెర అడ్డువచ్చినప్పు డది చంద్రబింబం లా వుంది. అలాగ వెళ్ళి వెళ్ళి అతను మారీచాశ్రమం ప్రవేశించాడు.

## మారీచుడు బుద్ధిచెప్పి రావణుణ్ణి వెనక్కి పంపెయ్యడం

మారీచు డంటే తాటకకొడుకు. వాడు రావణుణ్ణి ఎలాంటివారికిన్నీ సాధ్యంకాని భక్ష్యభోజ్యాలతోనూ అనేక సత్కారాలతోనూ పూజించి "రాజా, రాక్షసలోకం అంతా క్షేమమేకదా ? నువ్విప్పుడు తొందరగా రావడంవల్ల అవిషయమై నా కనుమానంగా వుంది" అన్నాడు. అందుకు రావణుడు "మారీచుడా ! ఏమిచెప్పను ? మండలాధిపతి అయిన ఖరుడు రామునిచేతిలో చచ్చిపోయాడు. ఎలాంటి వాళ్ళకిన్నీ అసాధ్యం అయిన జనస్థానం కూడా రామునివల్ల నాశనం అయిపోయింది. ఇందుకు బదులుగా నేనా రాముని భార్యను హరించి తీసుకురావా లని బయలుదేరాను. ఇందులో నువ్వు నాకు మంత్రాంగం నిర్వహించాలి" అని బదులు చెప్పాడు.

ఇది విని వులిక్కిపడి మారీచుడు "రాక్షసేశ్వరా ! మిత్రరూపాన వున్న శత్రువు నీకెవడు సీతవిషయం చెప్పాడూ ? నీవల్ల శిక్షించబడి

వాడు నీమీద పగబట్టి వున్నట్టుంది. సీతను తీసుకురమ్మని నీకెవడు చెప్పాడో నాకది ముందు చెప్పు. రాక్షసకులాని కంతకూ శిరో మణివైన నిన్ను నాశనం చెయ్యడాని కెవడు చూస్తున్నాడు? నిన్నీ పనికి ప్రోత్సాహపరుస్తున్నవాడు నిశ్చయంగా నీకుశత్రువుగాని మిత్రుడు కాడు. వాడు నీచేత పాముతలలో వున్న మాణిక్యం తీయించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఏదేవుపాయంతో నీకీదుర్బుద్ధి పుట్టించాడూ? సుఖంగా నిద్రిస్తున్న నిన్ను యెవడు జుట్టుపట్టుకు లాగాడూ? రావణా! రాముడంటే నువ్వే మనుకున్నావూ? అత నొక మానవమాత్రు డను కోకు మదగజం అని తెలుసుకో. దానికి విశుద్ధవంశజన్మే తొండం. తేజస్సే మదం. దృఢబాహువులే కొమ్ములు. మరిన్నీ రాము డంటే సింహం అని తెలుసుకో. యుద్ధరంగంనుంచి వెనుదియ్యకపోడమే దానికి వాలం. బాణాలే దానికి నఖాలు మొదలైన దృఢాంగాలు. ఖడ్గాలే దానికి కోరలు. నిద్రించివుండిన ఆసింహాన్ని మేలుకొలపడం నీకు చాలా అపాయకరం సుమా! మరిన్నీ రాముడంటే మహా సముద్రం అని గ్రహించుకో. ధనుస్సే అందులో మొసళ్ళు. శర సంధాన మోక్షణరూపమైన భుజవేగమే అందులో బురద. బాణాలే తట్టుకోరాని కెరటాలు. రణోత్సాహమే అందులో సుడిగుండం. ఆసముద్రంలో దిగడం నీకెంతమాత్రమూ శ్రేయస్కరం కాదు. కనక, రాక్షసేశ్వరా! శాంతించు. కులనాశనం తెచ్చిపెట్టకు. సాధువృత్తి అవలంబించి యింటికి వెళ్ళు. నీభార్యలతో నువ్వు సుఖంగా వుండు. రాముణ్ణి తనభార్యతో అడవుల్లో సుఖపడనీ" అని అనేకవిధాల బోధించాడు.

అది విని రావణుడు మారుమాట్లాడకుండా లంకకు వెళ్ళి తన రాజ భవనంలో సుఖంగా వున్నాడు.

## శూర్పణఖ రావణుని దగ్గిరికి వెళ్ళడం

బహుక్రూరులైన పధ్నాలుగువేల రాక్షసయోధులనూ ఒక్క రాముడు సంహరించడం శూర్పణఖ చూసింది. దూషణుడూ, ఖరుడూ, త్రిశిరసుడూ కూడా రామునిచేతిలో చచ్చిపోవడం అది చూసింది. ఇతరు లెలాంటివాళ్ళూ, ఎంతమందీ కూడా చెయ్యలేని ఈపని రాము డొక్కడూ చెయ్యడం చూసి మహోద్వేగం పొంది అది వర్షాకాల నీలమేఘం లాగ పెడబొబ్బలు పెడుతూ లంకకు బయలు దేరింది.

అది వెళ్ళేటప్పటికి రావణుడు సౌధవిమానంలో మంత్రులతో కూడా దేవేంద్రుడు లాగ కూచుని వున్నాడు. బంగారపు వేదికమీద, సూర్యబింబంలా ప్రకాశిస్తున్న సింహాసనంమీద కూచుని వున్నా డతను. రావణుడు దేవతలకూ, గంధర్వులకూ, భూతపిశాచాలకూ, మహర్షులకూ కూడా అజేయుడు. మహాశూరుడు. నోరు తెరుచుకుని వున్న యముడులా మహాభయంకరంగా వున్నాడు. దేవాసురయుద్ధాలలో వజ్రాయుధకిణాంకితు డైనవాడు. ఇంద్రుని ఐరావతం రావణుని గుండెలమీద తన కొమ్ములతో అనేకసార్లు కుమ్మింది. అప్పటికీ ఆ ఆనవాళ్ళు స్పష్టంగా కనపడుతున్నాయి, అతనికి ఇరవై చేతులు న్నాయి పదితలలున్నాయి. పరిచారికలు అతనికి చాలా గొప్పఛత్రచామరాలు పట్టివున్నారు. అతని వక్షస్థలం చాలావిశాలమైనది. అతనిలో మహారాజు లక్షణాలన్నీ మూర్తీభవించి వున్నాయి. అతని శరీరం నిగనిగమెరిసే వైడూర్యంలాగ మెరుస్తోంది. రత్నాలు పొదిగిన కుండలాలు ధరించివున్నాడు. బాహువులు సర్వలక్షణసంపన్నంగా

వున్నాయి. దంతాలు తెల్లగా ముత్యాల్లా మెరుస్తున్నాయి. పెద్ద మొగాలతో అతను పర్వతంలాగ కనపడుతున్నాడు.

అతను వందలూ వేలూ యుద్ధాలు చేశాడు. అనేకమాట్లు సుదర్శన చక్రం దెబ్బలు తిన్నాడు. ఇతరాయుధాలతో కూడా చాలామాట్లు దెబ్బలు తిన్నాడు. అక్షోభ్యా లయిన మహాసముద్రాలను కూడా అతను కలిచెయ్యగలడు. ఏపనిచేసినా నిమిషాలమీాద చేసేస్తాడు. మహాపర్వతా లెన్నోమా ల్లెగరవేశాడు. అనేక యుద్ధాలలో దేవత లను చావగొట్టాడు. ధర్మం అంటే అతనికి సరిపడదు. పరస్త్రీలను నిశ్శంకగా చెరపడతాడు. సకలశస్త్రాల సంధానోపసంహారాలూ అత నికి బాగా తెలుసు. యజ్ఞాలు పాడుచెయ్యడం అంటే అతనికి మహా సరదా. ఒకసారు భోగవతీనగరంమీాదికి దండెత్తి వెళ్ళి వాసుకుని జయించి తక్షకుని ప్రియభార్యని అపహరించి తెచ్చాడు. కైలాస పర్వతంమీాదికి వెళ్ళి కుబేరుణ్ణి జయించి కామగమనంగల అతని పుష్పక విమానం హరించి తెచ్చుకున్నాడు. కుబేరుని ఉద్యానవనం చైత్ర రథమూ, పుష్కరిణి నళినీ, మహేంద్రుని ఉద్యానవనం నందనమూ ఇలాగా గొప్ప దేవతల అనేక పూలతోటలూ నాశనంచేసి వచ్చాడు. చంద్రుడూ, సూర్యుడూ ఉదయిస్తూ వుంటే పర్వతోపమానుడై చేతులడ్డంపెట్టి వారి నాపుచెయ్యగలడు. మహావనంలో పదివేల సంవత్సరాలు మహోగ్రతపస్సుచేసి అతను తన శిరస్సులు తెగ్గొట్టుకుని బ్రహ్మదేవుణ్ణి వాటితో పూజించాడు. దేవతలూ, దానవులూ, గంధ ర్వులూ, పిశాచులూ, నాగులూ, పక్షులూ, — మొదలైన ఏప్రాణి చేతిలోనూ తాను చావకుండా వుండేటట్టు వరం సంపాదించుకున్నాడు. మనుష్యులను అతినీచులని నిశ్చయించుకుని తనకి అమర్యాద అని వారి చేత మరణం కలగకూడదని మాత్రం అతను వరం కోరుకోలేదు. అంతే యజ్ఞాలలో మంత్రాలతో అభిష్టుతమై పరమపవిత్రమైన సోమ

మమును అతను నిస్సందేహంగా ధ్వంసంచేస్తాడు. దాక్షిణాయనవహో మసమయాలలో యజ్ఞాలు చెరచడం అన్నా, బ్రాహ్మణులను బాధించడం అన్నా, చెడ్డపనులన్నా క్రూరకృత్యాలన్నా, కాఠిన్యం కనపరచడం అన్నా, ప్రజలకు అపకారాలు చెయ్యడం అన్నా, దయాదాక్షిణ్యాలు మరిచిపోవడం అన్నా అతనికి చాలా యిష్టం.

ఇలాగ యెప్పుడూ సర్వభూతభయంకరుడై వుంటూ అప్పుడు రావణుడు దివ్యవస్త్రాభరణాలూ, చక్కని పూలదండలూ, ధరించి, యమునకే యము డన్నట్టుగా సింహాసనం అలంకరించివున్నాడు.

## 33

## శూర్పణఖ రావణుణ్ణి నిందించుట

లోకవిద్రావణుడై యిలా కొలువుదీరి వుండిన రావణుని యెదటికి వెళ్ళి శూర్పణఖ క్రుద్ధురాలై చాలా పరుషంగా అందుకుని “అడ్డమూ ఆకా లేకుండా కామోపభోగాలలో మునిగిపోయి దారుణమైన అపాయం సంభవించి వుండడం గుర్తించలేకుండా వున్నావు. ఎప్పుడూ స్త్రీలంపటుడై వుండే రాజునూ, లుబ్ధుడైన రాజునూ, మంచీచెడ్డా గమనించకుండా తోచినట్టల్లా సంచరించే రాజునూ జనులు వల్లకాటిఅగ్గి చూసినట్టు చూస్తారు. ఎప్పు డేపనులు చెయ్యాలో తెలుసుకుని స్వయంగా నెరవేర్చని రాజు ఆపనులతో కూడా నశించిపోతాడు. దేశదేశాంతరాలలో జరిగే సంగతులు తెలుసుకోడాని కెవడు సమర్థులైన చారులను ఏర్పాటు చెయ్యడో, యుక్తసమయాలలో తమ కెవడు దర్శనం యివ్వడో, ఎవడెప్పుడూ స్త్రీపరతంత్రుడై వుంటాడో ఆరాజుని, జనులు ఏనుగులు ఏటిబురదని విడిచిపెట్టేటట్లు విడిచిపెట్టేస్తారు. స్త్రీలోలురై తమ రాజ్యాలు రక్షించుకోని రాజులు సముద్రగర్భంలో మునిగివుండిన

పర్వతాల్లాగ వృద్ధిపొందలేరు. సకలవిధాలా బలవంతులై వున్న దేవదానవగంధర్వాదులతో విరోధం పెట్టుకునివున్న నువ్వు, చారులనూ నియమించుకోకుండా, స్త్రీలనూ విడిచివుండలేకుండా రాజ్యం యెలా తక్కించుకోగలవు? నువ్వు బాలుని కంటే నికృష్టంగా ప్రవర్తిస్తున్నావు. బొత్తిగా బుద్ధిలేకుండా వున్నావు. ఏది తెలుసుకుంటూ వుండాలో అది మరిచిపోయి వున్నావు. ఇక నువ్వు రాజ్యం యెలా తక్కించుకోగలవు? నువ్వు జయశీలుడవే; కాని ఎవరికి చారులుండరో, యెవరికి బొక్కసం నిండివుండదో, యెవరు రాజనీతి విడిచి ప్రవర్తిస్తారో ఆ రాజులు జనసామాన్యం కంటే అధములు. ఎంత దూరాన జరిగే సంగతులయినా రాజులు చారులవల్లనే తెలుసుకుంటారు. అంచేతనే వారికి దూరదర్శులని పేరు. నీబంధువులందరూ తెగటారిపోయారు. నీజనస్థానం నాశనం అయిపోయింది. కాని నువ్వీసంగతి తెలుసుకోకుండా వున్నావు. అంచేత నీకు చారులు లేరని తెలుస్తోంది. నీమంత్రులందరూ బుద్ధిహీనులని వెల్లడి అవుతోంది. రాముడనే వొక్క నరుడు వచ్చి జనస్థానంలో వున్న పధ్నాలుగువేలమంది రాక్షసయోధులనూ సంహరించాడు. ఖరుణ్ణీ దూషణుణ్ణీ త్రిశిరుణ్ణీ సంహారించేశాడు. మహర్షులందరికీ అభయం యిచ్చాడు. దండకారణ్యం అంతా యిప్పుడు నిర్భీకంగా వుంది. జనస్థానం నాశం అయిపోయింది. ఇక, నువ్వో లుబ్ధుడవు. మత్తెక్కివున్నావు. స్త్రీపరతంత్రుడవై వున్నావు. అంచేతనే నీరాజ్యంలో జరిగిన యివేవీ నీకు తెలవలేదు. క్రూరుడై వుండినా, ఎక్కువ పనిచేయించుకుని తక్కువ ప్రతిఫలం యిచ్చేవాడయినా, మత్తెక్కివుండినా, గర్విష్ఠి అయివుండినా, పైకి తియ్యని మాటలు చెబుతూ లోపల్లోపల అపకారాలు చేసేవాడయినా, ఆపదలు వచ్చినప్పుడు జనులు నిశ్శంకగా విడిచి పెట్టేస్తారు.

రాజు మిక్కిలీ అహంకారం కలవాడైనా, సులభదర్శనుడు కానివా డైనా, ఆత్మస్తుతిపరాయణుడైనా, దీర్ఘక్రోధం గలవాడైనా చిక్కులు వచ్చినప్పుడు అతణ్ణి స్వజనులే చంపేస్తారు. ఏరాజు ఎప్పుడు చెయ్య వలసిన పనులు అప్పుడే చెయ్యడో, ఆపదలు వస్తాయంటే జాగ్రత్తగా వుండడో అతను త్వరగానే రాజ్యభ్రష్టుడై చివరికి గడ్డిపరకతో సమానం అయిపోతాడు. ఎండిపోయిన కర్రలతో కొన్ని పనులు నెరవేరతాయి. కుండపెంకులవల్ల కూడా కొన్ని పనులు జరుగుతాయి. చివరికి దుమ్ము వల్లా ధూళివల్లా కూడా కొన్ని ప్రయోజనాలు సిద్ధిస్తాయి; కాని రాజ్య భ్రష్టుడైన రాజువల్ల మాత్రం యేపనీ కాదు. కట్టివిడిచిన వస్త్రాలూ, నలిగిపోయిన పూలదండలూ యెలాగ నిరుపయోగా లయిపోతాయో, సమర్థుడే అయినా రాజుకూడా అలాగే నిరర్థకు డయిపోతాడు. అప్రమత్తుడై సర్వమూ తెలుసుకుంటూ, ఎవ డెలాంటివాడో గుర్తించు కుంటూ, చేసిన వుపకారం మరిచిపోకుండా, ధర్మం తప్పకుండా వుండే రాజే చిరకాలం రాజై కీర్తి పొందుతాడు. ఎవడు ఈచర్మ నేత్రాలతో నిద్రించివుండినా రాజనీతి అనే నేత్రంతో సకలమూ చూస్తూవుంటాడో, ఎవడు నిగ్రహానుగ్రహసమర్థుడో ఆరాజు చిరకాలం మన్నుతాడు. రావణా! నీదగ్గిర యీసుగుణాలు లేవు. పైగా దుర్బుద్ధి వయిపోయి వున్నావు. అంచేత మొనగాళ్లాంటి నీరాక్షసయోధు లనేకులు నాశనం అయిపోవడం నీకు తెలియలేదు. నువ్వు యెదటివాళ్ళని అవ మానిస్తావు. స్త్రీలంపటుడవై వున్నావు. దేశకాలాలు తెలియ కుండా వున్నావు. గుణదోషాలు గుర్తించే శక్తి నీకు లేదు. కనక నువ్వు రాజ్యభ్రష్టుడవై త్వరగానే నశించిపోతావు" అంటూ తీవ్రంగా నిందించింది. ఇది విని "మనకి ధనమూ, దర్పమూ బలమూ లోటు లేదే, యిదేమిటి?" అని రావణుడు తీక్ష్ణంగా ఆలోచించసాగాడు.

## ౩౮

## సీతను తెచ్చుకోమని శూర్పణఖ రావణునకు బోధించడం

శూర్పణఖ పరుషభాషలు వినేటప్పటికి మంత్రులతో కొలువుతీరి వుండిన రావణునకు చాలా కోపంవచ్చింది. దాంతో అతను మిక్కిలీ క్రుద్ధుడై "రాము డంటే యెవడు? ఏపాటి పరాక్రమశాలి? ఎలా వుంటాడు? చొరరాని దండకారణ్యాని కెందుకు వచ్చినట్టు? రాముని ప్రధానాయుధం యేమిటి? ఖరుడూ, దూషణుడూ, త్రిశిరుడూ ఏఆయుధంతో చనిపోయారు?" అని అడిగాడు.

దానిమీద క్రోధపరవశురాలై శూర్పణఖ యిలా ప్రారంభించింది. "రాము డంటే దశరథమహారాజు పెద్దకొడుకు. అతను దీర్ఘబాహుడు. విశాలవక్షుడు. నారబట్టలూ, కృష్ణాజినమూ ధరించివున్నాడు; కాని మన్మథునికంటేనూ చాలా చక్కనివాడు. మహేంద్రుని ధనుస్సు వంటి ధనుస్సుపుచ్చుకుని మహావిషంగల నల్లతాచువంటి తీక్ష్ణబాణాలు విడుస్తాడు. యుద్ధం ప్రారంభించాడంటే, అతను అమ్ములపొదిలో నుంచి బాణాలు తియ్యడమూ, తొడగడమూ, నారిలాగడమూ, ధనుస్సు వంగడమూ, బాణాలు విడవడమూ యెంతమాత్రమూ యేర్పరించలేము. మహేంద్రుడు విసరిన రాళ్ళతో సస్యాలన్నీ నాశనమయిపోయేటట్టు ఆబాణాలతో శత్రుసైన్యం నాశనం అయిపోవడం వొక్కటే తెలుస్తుంది. పదాతి అయిన ఆరాముడొక్కడే భయంకరులైన పధ్నాలుగువేల రాక్షసమహావీరులను ఆబాణాలతో చంపేశాడు. ఖరుడూ, దూషణుడూ, త్రిశిరుడూ అరనిమిషంలో కూలిపోయారు. దండకారణ్యం రాక్షసవిహీనం అయిపోయింది. మునులు స్వేచ్ఛ పొందారు. రాముడు మహాత్ముడు కనక, ధర్మాధర్మ పరిజ్ఞానం వున్నవాడు కనక, స్త్రీలను చంపరా దని తెలిసి నన్ను

విడిచిపెట్టాడు కనక, యెలాగో బతికివచ్చాను. శ్రీరామునకు తమ్ముడున్నాడు. పేరు లక్ష్మణుడు. గుణాలకూ, బలపరాక్రమాలకూ, అన్నతో సాటి. అన్న అంటే అతని కెంతో అనురక్తీ భక్తీని. అతనికి కోపం లేదు. ఎవరూ అతన్ని జయించలేరు. ఎటువంటివాళ్ళనీ అతనే జయించేస్తాడు. చాలా బుద్ధిమంతుడు. శౌర్యసాహసాలు కలవాడు. రాముని కతడు కుడిభుజమూ, బహిఃప్రాణమూనూ. రామునికు భార్య కూడా వుంది. ఆమె విదేహరాజు కూతురు. పేరు సీత. ఆమెమొగం చంద్రబింబంలా వుంటుంది. నేత్రాలు ఆకర్ణాంతవిశాలాలు. రాముని కోసం ఆమె ప్రాణా లయినా విడిచిపెట్టేస్తుంది. ఆమె వనదేవతలాగా, రెండో లక్ష్మీదేవిలాగా వుంది. దేవతలలోనూ, గంధర్వులలోనూ, యక్షులలోనూ, కిన్నరులలోనూ, ఈభూమిమీద నాకింతవరకూ అంతటి అందకత్తె కనపడలేదు. ఎవణ్ణి సీత భార్యయై పొంగిపోతూ గట్టిగా కౌగిలించుకుంటుందో వాడు దేవేంద్రుణ్ణి మించినవా డవుతాడు. సుశీలా, సుగుణా, అసమానసుందరీ అయిన ఆసీత నీకు భార్య కాతగ్గది. నువ్వే ఆమెకి భర్త కాదగ్గవాడవు. విస్తీర్ణజఘనా, సైకతశ్రోణీ, పీనపయోధరా అయిన ఆసుందరిని నీకు భార్యగా తీసుకువద్దామని ప్రయత్నించి, లక్ష్మణునివల్ల నేనిలాగ నాముక్కూ చెవులూ పోగొట్టుకున్నాను. పూర్ణచంద్రముఖి అయిన ఆసీతను చూశావంటే నువ్వు ఆక్షణంలోనే మదనపరవశుడ వయిపోతావు. ఆమెని నువ్వు భార్యగా అనుభవించా లనుకున్నట్టయితే, లే, మరినూంచోకు, కుడి కాలు సాచివెయ్యి. సీతను హరించడమే కాకుండా నృశంసుడైన రాముణ్ణి కూడా సంహరించి అపధ్వాంసులగు నేరాక్షసులకూ నువ్వు రుణం తీర్చుకో. నిశితబాణాలతో, తరవాత, లక్ష్మణుణ్ణి కూడా కడ తేర్చేస్తివా, నువ్వు సీతను చాలా సులభంగా తెచ్చుకోవచ్చు. నామాట నీకు నచ్చినట్టయితే యిక మీనమేషాలు లెక్కపెడుతూ

కూచోక వెంటనే నేను చెప్పినట్టు చెయ్యి. నీశక్తి తెలుసుకో. సర్వాంగసుందరి అయిన సీతను హరించి తెచ్చి భార్యగా అనుభవించు. రాముని చేతిలో ఖరుడు చచ్చిపోవడం విని, దూషణుడు చనిపోవడమున్నా విని, పధ్నాలుగువేల రాక్షససమూహములూ కూడా మన్నయి పోవడం విని నువ్వు ఊరికే చెయ్యకపోతే యెందుకూ పనికిరావు ”

## ౩౫

## రావణుడు మళ్ళీ మారీచుని దగ్గిరికి వెళ్ళడం

శూర్పణఖ యిలా చెప్పగా, మంత్రులు వచ్చిన పని తెలుసుకుని ఆలోచనలు చెప్పి వారిని పంపేసి రావణుడు అంతఃపురానికి వెళ్ళిపోయి “ సీతను తీసుకురావడం మంచిదా చెడ్డదా? తీసుకువస్తే బలపరాక్రమాలతో రామున్ని డీకొని చంపి తీసుకురావడమా రాముణ్ణి మోసగించి ఏమార్చి దొంగిలించి తేవడమా? ” అని చాలా ఆలోచించాడు. ఎలా చేస్తే చెడ్డ ఎక్కువగా, మంచి యెక్కువా వుంటుందో కూడా పరిశీలించాడు. చివరికి ఖరదూషణాదులను సంహరించడంలో రాముడు కనపరిచిన అసమానబలపరాక్రమాలు గుర్తించి శౌర్యసాహసాలు చూపించి రామున్ని ఒక్కణ్ణి నెట్టేసి ఆమెను తీసుకురావడం కష్టం కనక, దొంగతనంగా తీసుకురావడమే మంచిదని నిశ్చయించుకున్నాడు.

చాలాసేపు యోచించి, యోచించి, చివరికిలాంటి నిశ్చయం కలగ్గా వెంటనే ప్రచ్ఛన్నంగా గుర్రపుశాలకు వెళ్ళి “ నుంచున్నపాటున రథం పూన్చు ” అని సారథి కాజ్ఞాపించాడు. ఆసారథి కూడా వెంటనే రథం పూన్చి తెచ్చాడు. అది బంగారుపూత రథం. దానికి నవరత్నాలూ పొదిగారు. దానికి కామగమనం వున్నది. దానికి కంచరగాడిదలు కట్టి తెచ్చాడు సారథి. వాటి మొగాలు పిశాచాల మొగాల్లా వున్నాయి.

వాటికిన్నీ బంగారపు నగలు అలంకరించారు. అది నడక సాగించిందంటే మేఘాలురుముతున్నట్టుంటుంది. రావణుడది యెక్కి తిన్నగా సముద్రందగ్గిరికి వెళ్ళాడు.

పరిచారికలు తెల్లని ఛత్రచామరాలు పట్టివుండగా వైడూర్యం లాగ మెరిసిపోతున్న రావణుడు చక్కని వస్త్రాభరణాలు ధరించి పది తలలతోనూ యిరవై చేతులతోనూ పదిశిఖరాలు గల పర్వతం లాగ ఆరథం అధిష్ఠించి బెగ్గురుపక్షులతోనూ మెరుపుతీగలతోనూ నీల మేఘంలాగ వున్నాడు.

రథం సముద్రం పక్కనే బయలుదేరింది. ఆప్రాంతం అంతా రకరకాల పుష్పవృక్షాలతోనూ ఫలవృక్షాలతోనూ నిండివుంది. అక్కడక్కడ ఆశ్రమాలు కనపడ్డాయి. ఆఆశ్రమాలలో యెన్నో యజ్ఞవేదికలు కనపడ్డాయి. మరిన్నీ ఆశ్రమాలలో చక్కనితటాకాలుకూడా వున్నాయి. ఆ తటాకాలన్నీ జలపుష్పాలతో నిండి చాలా రమణీయంగా వున్నాయి. అక్కడక్కడ అరటితోటలున్నాయి. కందిచేలున్నాయి. కొబ్బరితోటలు చాలా విస్తారంగా వున్నాయి. మద్దిచెట్లూ, తాడిచెట్లూ, చీకటిచెట్లూ అక్కడక్కడ పూలచెట్లతో కలిసి చాలా ముమ్మరంగా వున్నాయి. అక్కడక్కడ నాగులున్నారు. సుపర్ణులున్నారు. గంధర్వులున్నారు. కిన్నరులున్నారు. మునుల్లో అరిషోనిజులయిన వారున్నారు. వైఖానసులున్నారు. వాలఖిల్యులున్నారు. మరీచిపులున్నారు. సిద్ధులున్నారు. చారణులున్నారు. దివ్యాభరణాలు ధరించి, మదనక్రీడలలో ఆరితేరిన త్రిలోకసుందరులైన అప్సరసలున్నూ అక్కడక్కడ వున్నారు. కొన్నిచోట్ల దేవతాస్త్రీలున్నారు. ఒక్కొక్కచోట దేవదానవసంఘాలున్నాయి. హంసలూ, క్రౌంచపక్షులూ, నీరుకోళ్ళూ, సారసపక్షులూ గుంపులుగుంపులుగా

వుండి ఉల్లాసంగా కూస్తున్నాయి. సముద్రకాంతి పడి యెటుచూసినా మరకతమణులు పరిచినట్టుంది. గొప్పతపస్సుచేసి సమస్తలోకాలూ జయించిన మహర్షులూ, గంధర్వులూ, అప్సరసలున్నూ విమానాలెక్కి విహరిస్తున్నారు. ఆవిమానాలు తెల్లగానూ విశాలంగానూ వున్నాయి. వాటికి చక్కని పూలమాలికలు అలంకరించారు. ప్రతీవిమానం లోనూ గీతవాద్యాలు మోగుతున్నాయి. మంచిగంధపుచెట్లు వందలూ వేలూ వుండిన తోటలెన్నో వున్నాయి. ఆచెట్లన్నీ బాగా ముదిరి వున్నాయి. ప్రతీచెట్టుకీ మొదట జిగురుస్రవిస్తూ దిక్కులన్నీ సువాసింపచేస్తోంది. అగరుచెట్లగుంపులూ, తక్కోలపుచెట్ల గుంపులూ, జాజిచెట్ల గుంపులూ, కూడా వందలూ వేలూ వున్నాయి. అవిన్నీ చక్కని పరిమళం వెదచల్లుతున్నాయి. తమాలచెట్లు గుత్తులు గుత్తులుగా విరగపూశాయి. మిరియపు పొదలున్నూ అంతులేకుండా వున్నాయి. అక్కడక్కడ ముత్యపుచిప్పలు వొడ్డుకి కొట్టుకువచ్చి యెండుతున్నాయి. ఒక్కొక్కచోట శంఖాలూ, ఒక్కొక్కచోట పగడపుతీగలూ గుట్టలు గుట్టలుగా పడివున్నాయి. అక్కడక్కడ బంగారపుగనులూ వెండిగనులూ వున్న పర్వతాలున్నాయి. చక్కని సెలయేళ్ళున్నాయి. ప్రసన్నజలగంభీరాలైన మడుగులుకూడా యెన్నో వున్నాయి. ఎన్నో నగరాలు కనపడ్డాయి. వాటిలో ధనధాన్యాలు గుట్టలూ మెట్టలూ అయివున్నాయి. ఒక్కొక్క నగరం లోనూ ఎంతెంతో చక్కదనంగల స్త్రీలు వేలూ లక్షలూ వున్నారు. ఎప్పుడు చూసినా విశాలాలైన వాటివీధుల్లో గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ చాలా గజిబిజిగా వుంటాయి. మొత్తానికి సముద్రతీరం అంతా ఎగుడుదిగుడులేక నున్నగా విశాలంగావుంది. చల్లనిగాలి మెల్లిగా వీస్తోంది. స్వర్గంలా వుంది. ఒకచోట వొక పెద్దమర్రిచెట్టుంది. దూరాని కది పెద్దమేఘమాలికలా వుంది. అది యెంత పెద్ద

దంటే దానికొమ్మలు ఒక్కొక్కటి నూరేసి ఆమడల పొడుగుంది. ఆచెట్టు ఆశ్రయించి ఎందరో మహర్షు లున్నారు. పూర్వం మహా కాయూ లైన గజకచ్ఛపాలను భక్షించడానికి గరుత్మంతుడు వాటిని చేతపట్టుకుని ఆచెట్టుకొమ్మలలో వొకదానిమీద వాలాడు. ఆబరువుకి ఆగలేక ఆకొమ్మ పెళుక్కున విరిగిపోయింది. ఆకొమ్మమీద వైఖానసులూ, వాలఖిల్యులూ, మరీచిపులూ, ధూమ్రములూ మొదలైన మహర్షు లెందరో వున్నారు. కొమ్మ కిందపడిపోయిందంటే వారందరూ మరణిస్తారు. అంచేత గరుడుడు ఆకొమ్మపట్టుకుని మొంతో దూరంవెళ్ళి వొంటికాలిమీద నిలిచి గజకచ్ఛపాలను భక్షించి ఆకొమ్మతోనే నిషాదులను సంహరించి మహర్షులను రక్షించాడు. మరిన్ని ఆబలంతోనే అతను వెళ్ళి మహేంద్రుని యింట్లో ప్రవేశించాడు. ప్రవేశించాడంటే వూరికేకాదు, ఆభవనం గోడలు రాళ్ళతో కాక రత్నాలతో కట్టారు. వాటికి యినపవూచల కిటికీలున్నాయి. అకిటికీలు వూడబెరికి ఆగోడలు బద్దలుకొట్టి అత నాయింట్లో ప్రవేశించి, ఎక్కడో మారుమూల దాచిన అమృతభాండం తీసుకుపోయాడు. రావణుడు ఆచెట్టుచూశాడు. అప్పటికీ ఆచెట్టుమీద మహర్షులున్నారు. అప్పటికీ గరుడుడు విరగ్గొట్టినకొమ్మ మొదట మోడు అలాగే వుంది. ఆచెట్టుపేరు సుభద్రం. అదిదాటి వెళ్ళాటప్పటికి రమ్యమైన ఒక అరణ్యంలో ఒక మున్యాశ్రమం కనపడింది. అది మారీచుని ఆశ్రమం. కృష్ణాజినమూ జటావల్కలాలూ ధరించి నియతాహారుడై మారీచు డక్కడ తపస్సు చేస్తున్నాడు.

మారీచుడు రావణుణ్ణి అనేకవిధాల పూజించాడు. "మహా ప్రభూ! లంకలో అందరూ క్షేమమేకదా? అని కుశలప్రశ్న చేశాడు. చివరికి "ఏం, మళ్ళీ యింతతొందరగా వచ్చావే, పనేమిటి?" అని అడిగాడు. అందుకు రావణు డిలా బదులు చెప్పాడు

## ౩౮

## రావణుడు మారీచుణ్ణి మాయలేడి కమ్మనడం

" నాయనా, మారీచా, శ్రద్ధగా విను. నేనిప్పుడొక ఆపదలో పడి పోయి వున్నాను నాకిప్పుడు నువ్వే గతి. నాచెల్లెలు శూర్పణఖా, నాతమ్ముడు ఖరుడూ, దూషణుడూ, త్రిశిరుడూ చిరకాలంగా జనస్థానంలో స్వేచ్ఛగా నివసిస్తూ వుండడం నీకు తెలుసు. నాఆజ్ఞవల్లనే వాళ్ళక్కడ వుంటున్నారు. దండకారణ్యంలో వాళ్ళకెప్పుడూ యెదురు లేదు. మహాత్ములను బాధపెట్టినా వాళ్ళని " ఇదేమిటి ? " అనగలవాడు లేడు. జనస్థానంలో మనవాళ్ళు మొత్తం పద్నాలుగువేలున్నారు. వాళ్ళందరూ మహావీరులూ, మహాయోధులూ గాని సామాన్యులు కారు. వాళ్ళకీ రామునకూ యుద్ధం ప్రారంభించింది. రాముణ్ణి వాళ్ళు పల్లెత్తుమాట అనలేదు సుమా ! కాని మనిషీ, పదాతీ, ఏకాకీ అయిన రాముడు వాళ్ళనందరినీ సంహరించాడు. ఖరుడు పడిపోయాడు. దూషణుడూ పడిపోయాడు. త్రిశిరుడు పడిపోయాడు. దండకారణ్యంలో యిప్పుడు రాక్షసపురుగయినా లేకుండాపోయింది. వాళ్ళనందరినీ చంపిన రాముడు క్షత్రియకులపాంసనుడు. తండ్రి లేవగొట్టెయ్యగా పెళ్ళాంతో కూడా అడవులుపట్టివచ్చాడు. దుశ్శీలుడు. కఠినుడు. మూర్ఖుడు. ఇంద్రియపరవశుడు. ధర్మదూరుడు. లోకకంటకుడు. వాడు కారణం లేకుండా సాత్వికంగా కాలం గడుపుకుంటున్న నాచెల్లెలు శూర్పణఖని ముక్కూ చెవులూ కోసి అగౌరవించాడు. ఇందుకు ప్రతిగా దేవకన్యవంటి వాడి భార్య సీతను నేను హరిస్తాను. నువ్వందులో నాకు సాయం కావాలి. నువ్వు నాతో వున్నావంటే — నాతమ్ములున్నూ నాకు దగ్గిర వున్నారంటే దేవతలందరూ కలిసిదండెత్తివచ్చినా నేను లక్ష్యపెట్టను. కనక, నువ్వు నాకు సాయంకావాలి, తప్పదు. పరాక్రమంలోనూ

యుద్ధంచెయ్యడంలోనూ దర్పంలోనూ నీకు సాటి అయినవాడింకోడు లేడు. నీకు చాలా వుపాయాలు తెలుసు. మహాయోగుడవే కాకుండా నువ్వు సకలమాయోపాయాలు తెలిసినాడవు. అంచేత నేను నీసాయం కోరి వెతుక్కుంటూ నీదగ్గిరికి వచ్చాను. అయితే, నువ్విప్పుడు నీబల పరాక్రమా లేమీ చూపించనక్కరలేదు. ఇక నువ్వు చెయ్యవలసిం దేమిటంటే? తెల్లని చుక్కలతో బంగారపు లేడివై నువ్వు సీతకు కన పడేటట్టు రాముని ఆశ్రమప్రాంతాల తిరుగుతూ వుండు. నిన్ను చూసిం దంటే ఆసీత తనభర్తనీ మరిదినీ నిన్ను పట్టితీసుకురమ్మని తప్ప కుండా బలవంతం చేస్తుంది. అప్పుడు వాళ్ళు లేకుండాపోవడంవల్ల యే బాధాలేకుండా నేను రాహువు చంద్రప్రభను పట్టేటట్టు సీతను పట్టే స్తాను. ఇలాగభార్య చేజారిపోయిందంటే ఏడ్చియేడ్చి బెంగపెట్టుకుని రాముడు చిక్కి శల్యం అయిపోతాడు. అప్పుడు నేను వాణ్ణి అనా యాసంగా కొట్టేస్తాను ''

రావణుడిలా చెప్పాటప్పటికి మారీచుడు అదలిబేజా రయిపోయాడు. వాడి మొగం వాడిపోయింది. పెదవు లెండిపోయాయి. నిలువుకళ్ళు పడిపోయాయి కొయ్యయిపోయి రావణునికేసి చూసి ముందు చేతులు దోయిలించుకుని నమ్రుడయాడు.

## 32

మారీచుడు రాముని శక్తిసామర్థ్యాలు చెప్పిరావణుణ్ణి మందలించడం కానయితే రాక్షసుడే కాని మారీచుడు నిరంతరతపస్సువల్ల ప్రాజ్ఞు డయినాడు. అతను మెల్లిగా ప్రారంభించాడు.

" రాజా, తియ్యనికబుర్లు చెప్పేవాళ్ళు లోకంలో చాలామందే వున్నారు; కాని అయిష్టమే అయినా నిజం చెప్పేవాళ్ళు లేరు. వినే వాళ్ళు కూడా అంతేలే. రాముడు మహావీరుడు. సుగుణాలరాశి,

మహేంద్రునితోటీ వరుణునితోటీ అతను సాటిఅయినవాడు. ఇక నువ్వో, చపలుడవు. దేశదేశాంతరాలలో నడిచే సంగతులు తెలుసుకోడానికి నువ్వు చారులను నియమించుకున్న వాడవు కావు. అంచేతా, యించేతా కూడా నిజంగా నువ్వు రాముణ్ణి తెలుసుకోలేవు. నాయనా! రాక్షసు లందరూ యిక క్షేమంగా వుంటారా? క్రుద్ధుడై రాముడు ప్రపంచంలో యెక్కడా కూడా రాక్షసపురుగు లేకుండా వుండే టట్టు చెయ్యకుండా వుంటాడా? సీత నీవినాశంకోసమే పుట్టిందా? సీతకారణంగా నాకు దుఃఖం కలక్కుండావుండదూ? నువ్వు అధిపతివి కావడంవల్ల సకలరాక్షసులతోనూ లంక నాశనం కాకుండా వుండదూ? ఎవడు నీలాగే మంచిచెడ్డలు విడిచి ఎప్పటి కేది యెలా తోస్తే అలా చేస్తాడో, ఎప్పుడూ దురాలోచనలే చేస్తూ వుంటాడో, తుచ్ఛులైన మంత్రుల దుస్సలహాలే వింటూ వుంటాడో ఆరాజు తన రాజ్యమూ తన ప్రజలూ నాశనం కావడానికి హేతువయి చివరికి తానున్నూ నశించిపోతాడు. రాముణ్ణి తండ్రి పొమ్మని అడవులకు పడగెంటలేదు. రాముడు మర్యాద లేనివాడుకాదు. లుబ్ధుడూ, దుశ్శీలుడూ, క్షత్రియకులపాంసనుడూ కాడు. అతను సుగుణాలు లేని వాడుకాడు. క్రూరుడూ లోకకంటకుడూ కూడా కాడు. అతని సవతి తల్లి అతని తండ్రిని మోసంచేసింది. దాంతో ఆతండ్రి అసత్యవాది అని నిందపడే పరిస్థితులు వచ్చాయి. తండ్రి కలాంటి విపత్తు కలక్కుండా తప్పించడానికే రాముడు స్వయంగా అడవులకు వచ్చాడు. తండ్రికీ సవతితల్లికీ కూడా హితం చెయ్యడానికి రాజ్యమూ సకలభోగ భాగ్యాలూ విడిచి స్వయంగానే అతను అడవులకు వచ్చాడు. నిజంగా రాముడు పెటుకుమనిషికాడు. మూఢుడూ మూర్ఖుడూ కాడు. ఇంద్రియవశుడున్నూ కాడు. అతన్ని గురించి తుచ్ఛులు చెప్పింది విన్నావు. అబద్ధాలు విన్నావు. మళ్ళీ అదే చెబుతున్నావు. ఇది నీకు

తగదు. రాముడు ఆత్మనిగ్రహం గలవాడు. ధర్మజ్ఞుడే కాదు, ధర్మాత్ముడున్నూ. సాధువు. నిజమైన పరాక్రమం అతనిది. దేవతల కందరికీ ఇంద్రుడు లాగ మనుష్యుల కందరికీ అతను రాజు. అతను సీతను తన తేజస్సుతో రక్షించుకుంటున్నాడు. సూర్యుని తేజస్సు లాగే సీత కూడా అసాధ్యురాలని నువ్వు గుర్తించలేకుండా వున్నావు. రాము డంటే అగ్నిహోత్రం అనుకో. ధనుస్సులూ, ఖడ్గాలూ దానికి ఇంధనాలు. బాణాలే దానికి జ్వాలలు. దాని దగ్గిరికి వెళ్ళడాని కెవరికీ శక్యం కాదు. నీకు అసలే అర్హతలేదు. రాము డంటే దుష్టులపాలిటి యము డనుకో. రాజ్యమూ, సుఖమూ, వాంఛలూ విడిచి, క్రుద్ధుడై శత్రుసంహారం చెయ్యడానికి ధనుష్పాశహస్తుడై నోరు తెరుచుకుని వున్నా డతను. సీత యెవనిదో ఆరాముని తేజస్సు ఇంత అని యెవరూ చెప్పలేరు. రాముని ధనుర్బాణాలతో రక్షిత అవుతున్న సీతను నువ్వు అపహరించలేవు. సింహోరస్కుడూ, పురుషసింహుడూ అయిన రామునకు ఆసీత ప్రాణాలకంటే యెక్కువ. సీత లాగ భర్తని అనుస రించే స్త్రీ సృష్టిలో మరిలేదు. అగ్నిజ్వాలను నువ్వు పట్టగలవా? అలాగే మహాజశ్శాలి అయిన రాముని భార్య సీతను తాకలేవు? నాయనా! నువ్వీపని కెందుకు సిద్ధపడతావూ? నువ్వెప్పుడు రాముని కళ్ళబడతావో అప్పుడే నువ్వు నశించిపోతావు. కనక, రాజ్యాధికారం చెలాయించుకోవాలన్నా, సుఖపడా లన్నా, చివరికి బతికివుండా లన్నా రామునకు అపకారం తలపెట్టకు. తొందరపడకు. విభీషణాదులతో ఆలోచించు. గుణదోషాలు పరిశీలించు. బలాబలాలు తెలుసుకో. రాముని శక్తీ, నీశక్తీ గుర్తించుకో. అపకారమూ ఉపకారమూ కూడా చర్చించుకో. అప్పుడు నీకెలా తోస్తే అలా చెయ్యి. నేను నీక్షేమం కోరుతున్నాను. నీశ్రేయస్సు కోరుతున్నాను. నీఅభ్యుదయం

కోరుతున్నాను. కనక, నామాట విను. యుద్ధం పొసగిం దంటే నువ్వు ఆకోసలదేశాధిపతికి చాలవు ''

## 3౮

## మారీచుడు తాను బతికిబయటపడ్డ సంగతి చెప్పడం

" రాజా! ఒకప్పుడు నేను భూలోకం అంతా తిరుగుతున్నాను. అప్పుడు నాకు వెయ్యేనుగుల బలంవుండేది. పర్వతంలాగా వుండే వాణ్ణి. నీలమేఘంలాగ మెరుస్తూ బంగారపుకుండలాలు ధరించి కిరీటం పెట్టుకుని, పరిఘాయుధం చేతబట్టి జనులనందరినీ గగ్గోలు పరిచేస్తూ తిరుగుతున్నాను. దండకారణ్యాం అంతా స్వేచ్ఛగా తిరుగుతూ కన పడ్డ మహర్షుల నందరినీ విరుచుకు తినేస్తూవుండేవాణ్ణి. విశ్వామిత్రుని సంగతి నెరుగుదువుగదా? అతనుగూడా నన్ను చూసి భయభ్రాంతు డయిపోయాడు. వెంటనే అతను దశరథమహారాజు దగ్గిరికి వెళ్ళి " రాజా, పర్వకాలం వచ్చింది. యజ్ఞంతలపెట్టుకున్నాను. మారీచు డనే క్రూరరాక్షసుడు నన్ను ఘోరంగా భయపెడుతున్నాడు. కనక నన్ను రక్షించడానికి రాముణ్ణి పంపు '' అని అడిగాడు. అందుకు రాజు మునీంద్రా! రాముడు పన్నెండేళ్ళ బాలుడు. శస్త్రాస్త్రవిద్య నెరగని వాడు. కనక, నాసైన్యం అంతా వెంటబెట్టుకుని నేను వస్తాను పద. ఎలాంటి రాక్షసుల నైనా నేను సంహరించేస్తాను సందేహం లేదు అని బదులు చెప్పాడు. కాని ముని అందుకంగీకరించలేదు. " రాజా! రాముడు తప్ప ఆరాక్షసుణ్ణి మరొకడు జయించలేడు. అనేకపర్యా యాలునువ్వు దేవతలను కూడా రక్షించావు. అది త్రిలోకాలలోనూ అందరూ నెరుగుదురు. నీచేతిలో లెక్కలేనంత చతురంగబలమూ వుంది. ఈరాముడు బాలుడే కాని మహా తేజశ్శాలి. ఆరాక్షసుణ్ణి సం

తొందరపడకు. నేనింత చెబుతున్నా నువ్వు రాముని మీదికి వెళ్ళావా ఆపత్తులపాలయిపోతావు, తప్పదు. నువ్వు చెడ్డమే కాదు సభలూ సమావేశాలూ చేసుకుంటూ మదనోత్సవాలలో తేలడంలో అతినిపుణులైన రాక్షసుల కందరికీ దుఃఖమూ నాశమూ తెచ్చిపెట్టినవాడవయిపోతావు. లంకాపట్నం మిద్దెలతోటీ మేడలతోటీ అతిసుందరంగా వుంది. రత్నరాసులతో నున్నూ నిండిపోయివుంది. అలాంటి మహాపట్నం సీతకోసం ప్రయత్నించి నాశనం చేసినవాడ వయిపోతావు. పాముల మడుగులో వున్న చేపలనుగూడా గరుత్మంతుడు తినేస్తాడు. అలాగే తమతో సహవాసం చేసిన పరిశుద్ధులను కూడా పాపులు నాశనం చేస్తారు. దివ్యాభరణాలు ధరించి, దివ్యచందనచర్చలు చేసుకుని సుఖభోగాల్లో వూగే రాక్షసు లందరూ నీమూలాన నేలపాలుకావడం నువ్వు చూస్తావు. పెళ్ళాలుపోయి కొందరూ, పెళ్ళాలను వెంటబెట్టుకుని కొందరూ రక్షించేవారు లేక, చావుమాత్రం తప్పించుకుని నీమూలాన దిక్కూ తోవా తెలియకుండా పారిపోయే రాక్షసులను నువ్వు చూస్తావు. నీమూలాన లంకాపట్నం శస్త్రాగ్నితో మండిపోతుంది. బుగ్గిఅయిపోతుంది. అదిన్నీ నువ్వు చూస్తావు. పరస్త్రీసంగమంకంటే గొప్ప పాపం మరొకటిలేదు. రాజా, వేలకొద్దీ స్త్రీలతో సుఖిస్తున్నావు. నీ కేంలోటూ ? కనక, స్వభార్యానిరతి వహించు. స్వజాతిని రక్షించు. జీవితమూ గౌరవమూ, వృద్ధీ, రాజ్యమూ, ఐశ్వర్యమూ, వైభవమూ కాపాడుకో. ఇక వొక్కటే మాట. స్వభార్యలతో నువ్వు చిరకాలం సకలసుఖాలూ అనుభవించా లనుకొంటావా ? నీమిత్రులందరూ బతికి బాగుండా లనుకుంటావా ? అయితే రామునితో విరోధం తెచ్చుకోకు. ఎంత చెప్పినా నువ్వాపని మాననంటావూ ? నీకు సర్వనాశనం తప్పదు. రామబాణాలు నిన్ను యమలోకానికి పంపకుండావుండవు ”

## ౩౯

## మారీచుడు తానుపొందిన పరాభవం మరొకటి చెప్పడం

" మహాప్రభూ ! రాముడప్పుడు దయతలచి విడిచిపెట్టినందున ఎలాగో బతికిబయటపడ్డానా ? ఇటీవల జరిగిన యింకో సంగతి చెబుతా విను. రాముని చేతిలో అప్పుడలా దెబ్బతిన్నా వూరుకోక ఇద్దరు రాక్షసులను వెంటపెట్టుకుని మళ్ళీ నేను దండకారణ్యం ప్రవేశించాను. వెళ్ళగానే మేము జంతువుల రూపం స్వీకరించాము. పెద్దశరీరమూ, యముని ఖడ్గంవంటి నాలుకా, శూలాలవంటి కోరలూ, కల్పించుకుని నేను మహాక్రూరజంతువు నైనాను. ముగ్గురమూ వెళ్ళి అగ్నిహోత్రశాలల్లోనూ, నదీతీర్థాలలోనూ, చైత్యవృక్షాల దగ్గిరా వుండే మునుల నందరినీ పీడించసాగాము. ధర్మచారు లైన మునులను మేమెంతో మందిని చంపేశాము. వారి మాంసం తిన్నాం. వారినెత్తురు తాగాం. ఆరక్తంతో మత్తెక్కి మేము దండకారణ్యం అంతా గగ్గోలుపరిచేశాం. వెళ్ళగా వెళ్ళగా మాకు మళ్ళీ రాముడు కనపడ్డాడు. దగ్గిర మహానుభావురా లైన సీతా, మహారథు డైన లక్ష్మణుడూ కూడా వున్నారు ; కాని రాముడూ లక్ష్మణుడూ కూడా మునివేషంలో వున్నారు. నియతాహారులున్నూ అయివున్నారు.

అది గుర్తించుకోలేక, నేను వారు మునులే అని భావించి, పూర్వవైరంతో తీక్ష్ణ మైన కొమ్ములతో మహాక్రూరమృగాన్నై వారిమీద పడ్డాను. ఎవరెంత బాధించినా మునులు అహింసాపరాయణులై వుంటారుకదా అన్న ధైర్యంతో మీద పడ్డాను ; కాని ఆకర్ణాంతంగా ధనుస్సు లాగి రాముడు మామీద మూడు నిశితబాణాలు విడిచాడు. అవి అంతేవరకూ ఎంతో రక్తం తాగివున్నాయి. మూడూ మామీదికి వచ్చాయి. రామబాణాల శక్తి నేనెరిగివున్నాను ; కనక

వెంటనే నేను పారిపోయాను. రామబాణాలు పారిపోయినవాళ్ళ నేమీ చెయ్యవు. అందుచేత నేను బతికిపోయాను. నా అనుచరులు మాత్రం అప్పటికే ఆ బాణాలపాలబడి చచ్చిపోయారు.

ఆవిధంగా బతికిబట్టకట్టినప్పణ్ణుంచీ నేనిక్కడ చేరి ప్రవ్రాజితుణ్ణయి మునిజీవితం గడుపుకుంటున్నాను. అయితే, నా ఆశ్రమంలో వున్న ఆ చెట్లు చూడూ. అప్పుడప్పుడు నా చూపు అప్రయత్నంగా వాటిమీద ప్రసరిస్తూ వుంటుంది; కాని నాకు చెట్లు కాక చెట్టు చెట్టునా రాముడు ధనుష్పాణి అయి పాశహస్తుడయిన యముడులాగ కనపడుతూ వుంటాడు. అంతేకాదు, ఒక్కొక్కప్పుడు వేలకొద్దీ రాములొకచోటే కనపడతారు. ఎటు చూసినా ఈ అడవి కూడా అంతా రామమయంగానే కనపడుతుంది. రాముడుండడానికి వీలులేనిచోట కూడా స్వప్నంలో రాముణ్ణే చూసి గడగడలాడిపోతూ వుంటాను. రథమూ, రత్నాలూ మొదలైన రకారాదిశబ్దాలు కూడా రాముణ్ణి బట్టి నాకు భయం కలిగిస్తూ వుంటాయి. నేను రాముని ప్రభావం బాగా తెలుసుకుని వున్నాను. అతనితో నువ్వు యుద్ధానికి డీకోడం ఎంతమాత్రమూ మంచిదికాదు. రాముడు బలిని, నముచిని కూడా సంహరించగలవాడు. ఇంతకీ నువ్వు రామునితో యుద్ధం చేసినా సరే, ఊరుకున్నా సరే, కాని నాదగ్గిర మాత్రం ఆ రాముని మాట ఎత్తకు. ధర్మమే అనుష్ఠిస్తూ వుండిన సాధువు లనేకులు దుష్టుల సహవాసంవల్ల సపుత్రమిత్రకళత్రంగా నశించారు. నేను నీతో కలిస్తే తప్పకుండా నశించిపోతాను; కనక, నన్ను క్షమించి విడిచిపెట్టు. నేను మాత్రం నీతో రాను. మహాతేజశ్శాలీ, మహాసత్త్వుడూ, మహాబలవంతుడూ అయిన రాముడు నీకేకాదు రాక్షసకులానికంతకీ కూడా యముడవుతాడు, సందేహంలేదు. శూర్పణఖకోసం, అది చెప్పిన మాటలు విని ఖరుడు నిరపరాధి అయిన రామునిమీద

పడ్డాడు. సర్వసమర్థుడు కనక రాముడు ఖరుణ్ణి సంహరించాడు. ఇందులో రాముని తప్పేమున్నది? కనక, ఆలోచించు. నేను బంధు ప్రీతితో చెబుతున్నాను. నామాట వినవూ? సహస్తబంధువుల తోనూ నువ్వు నశిస్తావు. రామబాణాలు నిన్ను విడిచిపెట్టవు"

## ౪౦

## చెప్పినట్టు చెయ్యమని రావణుడు మారీచుణ్ణి నిర్బంధించడం

చావా లనుకున్నవాడు మందు పుచ్చుకోడు. అలాగే మారీచు డెంత చక్కగా చెప్పినా రావణు డామాట వినలేదు. మారీచుడు తన క్షేమం కోశే చెబుతూ వుండినా, మృత్యుచోదితుడై రావణుడు చాలా కఠినంగా ప్రారంభించాడు.

"మారీచా, నువ్వుచాలా అసందర్భంగా మాట్లాడావు. కాని చవుటిపర్రలో చల్లిన విత్తనంలాగ నీమాట లన్నీ వ్యర్థం. పాపా త్ముడూ, మూర్ఖుడూ విశేషించి మనుష్యుడూ అయిన రామునితో యుద్ధం చెయ్యవద్దని యెన్నిమాటలు చెప్పీ కూడా నువ్వు నన్ను మళ్ళిం చలేవు. మూర్ఖురా లయిన ఆడదానిమాట విని నుంచున్నపాళంగా స్నేహితులనూ, రాజ్యాన్నీ తల్లినీ, తండ్రినీ, విడిచి అడవులకు వచ్చిన మూర్ఖుడు రాముడు. నాతమ్ముడు ఖరుణ్ణి సంహరించిన రాముని ప్రాణాలూ, వాడి భార్యా సీతనూకూడా నీకళ్ళయెదట నేను హరించి తీరాలి. నేనిలా నిశ్చయించుకున్నాను. దేవతలు వచ్చి ప్రార్థించినా చివరికి మహేంద్రుడే వచ్చి ప్రాధేయపడినా నేను నానిశ్చయం విడిచి పెట్టను. "ఇదిగో, నేనీపని చెయ్యదలచుకున్నాను. ఇది మంచిదా చెడ్డదా? ఇది శ్రేయస్కరమా అపాయకరమా?" అని నేనడిగితేనే నువ్వీమాటలు చెప్పివుండవలసింది. బతికిబాగుపడవలసిన మంత్రి రాజు

అడిగితేనే సలహా చెప్పాలి. అప్పుడయినా చేతులు జోడించుకుని వినయంగా చెప్పాలి. రాజు హితమూ శ్రేయస్సూ కోరినమంత్రి ఒక ప్పుడు వ్యతిరేకంగానే చెప్పవలసివుంటుంది. అయినా, అప్పుడయినా మాటిమాటికీ ఉపచారాలు చెప్పుకుంటూ మృదువుగానూ, మెల్లి గానూ, భయభక్తులతోనూ, యుక్తిగానూ చెప్పాలి. రాజుగౌరవించ వలసినవాడు. అంచేత, మంత్రి ఏమి చెప్పాటప్పుడయినా ఆగౌరవా నికి భంగం కలగకూడదు. కనక హితమే చెప్పినా ఆచెప్పడంలో పెంకితనం కనపడితే రాజు ఆమాట వినడు. సహించనే సహించడు. మారీచా! రాజులశక్తి తెలుసుకు మాట్లాడు. తేజశ్శాలు లైన రాజులు అయిదురూపాలతో వుంటారు. ఎంచేత నంటే, వారు అగ్నిదేవుని వేడిమీ, ఇంద్రునిపరాక్రమమూ, చంద్రుని సౌమ్య భావమూ, వరుణుని దండశక్తీ యముని ప్రసన్నతా ధరించివుంటారు. అంచేత సర్వకాల సర్వావస్థల్లోనూ రాజులను అందరూ గౌరవిస్తూనే వుండాలి. ఈధర్మాలేమీ తెలియక నీయింటికి వచ్చినందుకు నన్ను లెక్క చెయ్యకుండా పరుషంగా మాట్లాడావు. నేను నిన్ను మంచిచెడ్డ లడగలేదు. నాశక్తిసామర్థ్యాలను గురించిన్నీ నిన్నడగలేదు. నేను నీకు చెప్పింది పని. అది నువ్వు చెయ్యడమే కాని బదులు చెప్పడానికి వల్లకాదు. ఈపనిలో నువ్వునాకు తోడ్పాటు చూపించాలి. అదె లాంటిదంటే? వెండిచుక్కలతో నువ్వు చక్కని బంగారపులేడివై సీతకు కనపడేట్టు రాముని ఆశ్రమం దగ్గిర తిరగాలి. నిన్ను చూసిం దంటే సీత యెంతో ఆశ్చర్యపడుతుంది. తరవాత ఆశపడుతుంది. చివ రికి "ఆలేడిని తీసుకురా" మ్మని పట్టుపడుతుంది. రాముడునిన్ను పట్టుకోడానికి వస్తాడు. సీతా లక్ష్మణుడూ పర్ణశాలలోనే వుండి పోతారు. మాయచేసి నువ్వు రాముణ్ణి దూరంగా తీసుకుపో. అక్క డికి వెళ్ళాక రాముని గొంతుకతో "హాసీతా! హా లక్ష్మణా! అను.

అది విని కంగారుపడి, సీతకూడా తొందరపెట్టగా లక్ష్మణుడు ఆశ్రమాన్ని విడిచి అన్నకోసం నీకేసివస్తాడు. లక్ష్మణుడు కూడా అలా వెళ్ళీవెళ్ళ డంతోనే ఇంద్రుడు శచీదేవిని లాగ సీతను అతిసులభంగా పట్టి తీసుకు వచ్చేస్తాను. నువ్వీపని చేసి యథేచ్ఛగా వెళ్ళిపో. నీకు అర్థరాజ్యం యిచ్చేస్తాను' సుఖంగా అనుభవించు. ఇది మంచివుపాయం. అపాయం లేని దారి. నువ్వు ముందువెళ్ళిపో, తరవాత నేను రథంమీద వచ్చే స్తాను. ఆతరవాత రాముణ్ణి మోసంచేసి యుద్ధంతో అగత్యం లేకుం డానే సీతను తీసుకుని నేను లంకకి వెళ్ళిపోతాను. కనక, మారీచా! నువ్వీ పనిచెయ్యాలి. చేసితీరాలి. చెయ్యకపోతే నిన్ను చంపేస్తాను. రాజుకి వ్యతిరేకంగా నడిచేవాడికి ఎప్పుడూ సుఖం వుండదు. రాముణ్ణి మోసం చెయ్యడానికి వెడితే నీకు ప్రాణాపాయం వస్తుందన్న నిశ్చయం లేదు. అలా చెయ్యకపోతేమాత్రం నా చేతిలో నీకు చావుతప్పదు. ఇదంతా ఆలోచించుకో. నీకేది బాగుంటే అలా చెయ్యి"

## ౪౧

## మారీచుడు రావణునకు గట్టిగా హితం చెప్పడం

రావణుడు తన అధికారదర్పం చూపిస్తూ ఇలా ఆజ్ఞాపించగా మారీచుడు గట్టిగా మందలించడానికి పూనుకున్నాడు.

"రాజా! నీబిడ్డలకూ, నీరాజ్యానికీ, నీమంత్రులకూ సర్వనాశం కలిగించే యీవుపదేశం నీకే పాపాత్ముడు చేశాడూ? నువ్వు సుఖంగా వుండడం చూడలేకపోతున్న పాపి యెవరూ? నిజంగా యిది మృత్యు ద్వారం. నిన్నిందులో పడగెంటుతున్న తుచ్ఛు డెవడూ? స్వయంగా నిన్నేమీ చెయ్యలేని నీతుచ్ఛశత్రువులు రామునిచేతిలో నువ్వు నాశం కానా లని కోరుతున్నట్టు దీనివల్ల స్పష్టం అవుతోంది. ఎవడో దుర్మార్గుడు నిన్ను పాడుచెయ్యా లని నిశ్చయించుకున్నాడు. అయితే,

స్వయంకృతాపరాధంవల్లనే నువ్వు నశించినట్టుండడానికి ఈమొత్తు మొత్తాడు. నువ్వు చెడుమార్గంలో ప్రవేశించడం చూసిన్నీ నీమంత్రులు నిన్ను వారించకుండా వున్నారు. నిజంగా వాళ్ళు వధ్యులు. రాజు తప్పుపని ప్రారంభిస్తే మంత్రులు మంచివాళ్ళయితే అతన్ని మందలించో, బోధించో, బతిమాలో వారించితీరాలి. నీమంత్రులు నిన్నిప్పుడిలా విడిచిపెట్టేశారేం? ధర్మం కావాలన్నా, ధనం కావాలన్నా, కోరికలు తీరాలన్నా కీర్తి కావాలన్నా, అవి మంత్రులు రాజు అనుగ్రహం వుంటేనే పొందగలుగుతారు. అలా కాకపోతే వాళ్ళు తమకు ఉన్నవికూడా పోగొట్టుకుంటారు. ప్రభువునకు దయలేకపోతే జనులందరూ నానాబాధలూ పడతారు. రాజుంటేనే ధర్మం. రాజుంటేనే జయం. కనక, సర్వావస్థలయందూ అందరూ రాజును రక్షించుకుంటూ వుండాలి. క్రూరుడూ, ప్రజ లంటే యిష్టం లేనివాడూ, నీతినియమాలు లేనివాడూ రాజ్యం ఏలలేడు. చేతగాని సారథి రథం నడిపిస్తే మిట్టపల్లాలు వచ్చినప్పుడు వడిగా వెళ్ళే గుర్రాలూ నశిస్తాయి, వాటితోపాటు సారథీ నశిస్తాడు. అలాగే రాజు అసమర్థుడైనప్పుడు మంత్రులు దురాలోచనలు చెబితే రాజూ నశిస్తాడు, అతనితోపాటు మంత్రులూ నశించిపోతారు. ధర్మప్రవర్తకులైన సత్పురుషు లనేకులు ఇతరుల తప్పులవల్ల సమూలమూ నాశనం అయిపోయారు. నక్కల పెత్తనంలో మేకలు క్షీణించేటట్టు క్రూరుడూ, వ్యతిరేకీ అయిన రాజు ఏల్బడిలో జనులున్నూ నశిస్తారు. రావణా! నువ్వు కఠినుడవు. దుర్బుద్ధివి. విషయలంపటుడవు. కనక, నీయేల్బడిలో వున్న రాక్షసులందరూ నశిస్తారు, తప్పదు. నువ్వు చెప్పింది చెయ్యకపోతే నన్ను చంపుతా నంటున్నావు. ఈవిపత్తు నేనుకోరి తెచ్చుకున్నది కాదు. మరి నువ్వో? నీకు నువ్వే నీగొయ్యి తవ్వుకుంటున్నావు. ఇదే విచారించవలసిన సంగతి. రాముడు నన్ను మాత్రమే

చంపి పూరుకోడు. వెంటనే — తత్క్షణమే నిన్ను చంపేస్తాడు. నీచేతిలో చావడంకన్న శత్రువైన రామునిచేతిలో చావడమే నాకు మంచిది. దానివల్ల కృతకృత్యుణ్ణవుతాను. రాముడు నన్ను చూశాడంటే నేను చచ్చానన్నమాటే. అలాగే సీతను హరించావంటే నువ్వూ చచ్చావన్నమాటే. నాసాయంతో నువ్వు ఆశ్రమంలోనుంచి సీత నవతలికి తెచ్చావంటే ఇక నువ్వూ లేవు, నేనూ లేను, లంకా లేదు, రాక్షసులూ లేరన్నమాట. నేను మనసారా నీహితం కోరుతున్నాను. అయినా నువ్వది చెవినపెట్టడం లేదు. నిజమే. మరణం దగ్గిరపడ్డప్పుడు మిత్రులు చెప్పినమాటలు వినపడవులే"

## ౪౨

## సీత మాయలేడిని చూడడం

"ఇన్నిమాట లెందుకూ? వెడదాం పద. శరచాపాలు ధరించి వుండిన రాముడు నన్ను చూశాడంటే నేను చచ్చానన్నమాటే. రాముణ్ణి ఎదిరించి నువ్వు బతకడం అబద్ధం. నేను నీ నీడను. ఇక నామాట చెప్పే దేమిటీ? దుర్బుద్ధి వయి నువ్విలా చెబుతూ వుంటే నేనేమి చెయ్యగలనూ? నాయనా, మనం వెడదాం పద. నీకు శుభం కలగాలి" అంటూ మారీచుడు దీనంగా అన్నాడు. అందుకు రావణుడు చాలా సంతోషించాడు. వెంటనే అతను మారీచుణ్ణి కౌగిలించుకుని "నేను నిర్బంధించడంవల్ల నువ్విలా అంటున్నట్టు కనిపిస్తున్నావు; కాని నిజంగా యిది నువ్వు స్వయంగానే — ఇష్టాపూర్తిగానే అంటున్న శూరవచనం. ఇప్పుడు నువ్వు మారీచుడవు. ఇప్పటిదాకా మాత్రం ఎవడో క్షుద్ర రాక్షసుడవు. పిశాచముఖాలైన కంచరగాడిదలు కట్టిన యీ కాంచన రథం ఎక్కు. నువ్వు ఎలాగో వాకలాగి సీతను లోభపెట్టి వెళ్ళిపో,

అంతే. రామలక్ష్మణులు అవతలికి వెళ్ళిపోయిన వెంటనే నేను తెచ్చేస్తా నాకొని" అని వీపుతట్టాడు.

తరవాత రావణుడూ మారీచుడూ విమానం యెక్కినట్టారథం యెక్కి అక్కణ్ణుంచి బయలుదేరారు. వారు అనేక పట్నాలు చూశారు. అనేకారణ్యాలు దాటారు. అనేకపర్వతాలు, చూశారు. అనేక నదులు, ఎన్నో రాష్ట్రాలు, ఎన్నో నగరాలునూ చూశారు. చివరికిదండ కారణ్యం ప్రవేశించి రాముని ఆశ్రమం చూశారు. వెంటనే యిద్దరూ రథం దిగారు. రావణుడు మారీచుని రెండుచేతులూ పట్టుకుని "ఇదే రాముని ఆశ్రమం. అదిగో అరటిచెట్ల గుబురులో పర్ణశాల కనప డుతోంది. కనక, మిత్రుడా, మనం యెందుకు వచ్చామో తొరగా ఆపని చేసెయ్యి" అని ఉల్లాసంగా చెప్పాడు.

వెంటనే మారీచుడు లేడి అయిపోయాడు. దాని కొమ్ములు ఇంద్రనీలమణులదండల్లా వున్నాయి. దాని మొగం కొంత తెల్లగానూ, కొంతనల్లగానూ మొత్తానికి ఎర్రతామరపువ్వులా వుంది. చెవులు నల్ల కలవపూరేకల్లా వున్నాయి. కంఠం కొంచెం యెత్తుకుని వుంది. దాని కిందిపెదవి ఇంద్రనీలమణిఫలకలా వుంది. దానికడుపు మల్లెపువ్వుల్లాగా రత్నంలాగా చంద్రబింబం లాగా తెల్లగా మెరుస్తోంది. దాని పార్శ్వభాగాలు ఇప్పపూల రంగులో వున్నాయి. డెక్కలు వైడూర్యాల్లా వున్నాయి. పిక్కలు సన్నంగా వున్నాయి. కీళ్ళన్నీ చాలా దృఢంగా వున్నాయి. తోక నవరత్నాలూ పొదిగిన ఇంద్రధనుస్సులా వుంది. ఆ లేడి కాంతులు అరణ్యం అంతా నిండి జిగిజిగ్గా మెరుస్తున్నాయి.

ఇలాగ ముద్దుగా చక్కని రూపంతో ఆ లేడి రామాశ్రమంలో రత్నాలు పొదిగినట్టున్న పచ్చికబయట ప్రవేశించింది. చెట్ల చిగుళ్ళు

తింటూ, అరటిచెట్లూ కొండగోగుచెట్లూ దాటి పర్ణశాల దగ్గిరగా సంచరించసాగింది. ఒకమాటిలా వెడుతుంది. అలా వెడుతుంది. ఒక్కక్షణం నుంచుంటుంది. మళ్ళీ బయలుదేరుతుంది. కొంతసేపు ఆడుకుంటుంది. కొంతసేపు పడుకుంటుంది. ఆశ్రమద్వారానికి వెళ్ళి అడవిలో సంచరించే లేళ్ళగుంపులు చూస్తుంది. ఆగుంపులతో కొంత దూరం వెడుతుంది. మళ్ళీ వెనక్కి మళ్ళి ఆశ్రమంలోకి వస్తుంది. అది చమత్కారంగా ఆడుతూవుంటే చూసి లేళ్ళు వచ్చి చూసి మూ చూసి అది లేడి కాదనీ రాక్షసుడనీ గుర్తించి పదివేపులకూ పారిపోతాయి. వాటిని చంపి తినాలని మారీచునకు ఎంతయినా వుంది; కాని దానివల్ల వచ్చినపని చెడుతుందని మానేస్తున్నాడు.

సరిగా ఆసమయాన సీత కొండ గోగుపువ్వులూ, అశోకపువ్వులూ, మామిడిపువ్వులూ కోసుకుంటూ కులాసాగా అలా వచ్చింది. ఇంకెంతో కాలం అరణ్యవాసం చెయ్యనక్కరలేదు. సీత అలాంటి సమయాన బంగారులేడిని చూసింది. చూసి వింతగా, పలువరస కనపడేటట్టు మందహాసం చేసిందామె. సీత తన్ను చూడగానే ఆలేడి వింత వింతగా సంచరిస్తూ ఆవనానికింకా ప్రకాశం కలిగించింది. అదృష్టపూర్వమైన ఆలేడిని చూసి సీత ఆశ్చర్య చకిత అయిపోయింది.

## ४३

## రాముడు లేడికోసం బయలుదేరడం

సుశ్రోణీ, సుందరాంగీ అయిన సీత పూలుకోసుంటూ ఆబంగారులేడిని చూసి చాలా వింతపడి రాముణ్ణీ సాయుధుడవై రమ్మని లక్ష్మణుణ్ణీ గట్టిగా పిలిచింది. ఆపిలుపుమీద రామలక్ష్మణులు వచ్చి ఆప్రదేశం అంతా చూడ్డంలో ఆలేడిని చూశారు. అది చూసీ చూడ్డంతోటే

అనుమానం తగిలి లక్ష్మణుడు "అన్నా, ఇది నిజమైన లేడి కాదనీ మారీచు డీరూపంతో వచ్చాడనీ నాకనుమానంగా వుంది. ఈలేడి రూపంతోనే కామరూపి అయిన మారీచుడు ఈదండకారణ్యంలో వేటాడవచ్చిన రాజులను చాలా మందిని చంపివున్నాడు. మారీచుడే వింతగొలిపే యీమృగమై వచ్చాడు. లోకంలో ఇలాంటి లేడి యెక్కడా లేదు. ఉండాబోదు. ఇది మాయే, సందేహంలేదు" అని చెప్పాడు. ఇది విని సీత చక్కని లేడిచర్మం సొగసుకి చొక్కి లక్ష్మణుణ్ణి నివారించి మందహాసంతో "ఆర్యపుత్రా! చాలా చక్కని యీలేడి నన్నాకర్షించింది. దాంతో నేనాడుకుంటాను, పట్టి తీసుకురా. ఈ ఆశ్రమంలో మనకి లేళ్ళూ చమరమృగాలూ సృమరమృగాలూ రకరకాలు కనపడుతున్నాయి. ఎలుగుగొడ్లూ, చుక్కచుక్కల లేళ్ళూ, కోతులూ, కిన్నరాలూ యిక్కడ తిరుగుతూనే వున్నాయి. ఇంత తేజస్సూ, ఇంత నెమ్మదీ, ఇంతచురుకూగల లేడి నాకింతవరకూ కనపడలేదు. రంగురంగుల దేహంతోనూ, రత్నాల్లాంటి తెల్లనిచుక్కలతోనూ అరణ్యానికంతకీ శోభ కూరుస్తూ యిది చంద్రబింబంలా మెరిసిపోతోంది. ఏమి రూపమూ అది! ఏమి కాంతీ అది! ఏమి కంఠస్వరమూ అది! విచిత్రమూ, అద్భుతమూ అయిన యీలేడి నామనస్సు హరించేస్తోంది. ఇది ప్రాణాలతోనే నీకు దొరికితే మనకీ యితరులకూ కూడా ఆహ్లాదం కలిగిస్తూ మన దగ్గిర వుంటుంది. మన వనవాసకాలం పూర్తికావస్తోంది. మనం రాజ్యం ఏలేటప్పుడు మన అంతఃపురానికిది మంచి అలంకారం అయివుంటుంది. భరతునకూ అత్తలకూ నాకూ యీ లేడి వింతగొలుపుతూవుంటుంది. అది ప్రాణాలతో దొరకదూ? దాని చర్మమే మన అంతఃపురానికలంకారం అవుతుంది లోటేం? దాన్ని నువ్వు చంపి అయినా తెస్తివా దాని బంగారుచర్మం ధర్భాసనం మీద పరుచుకుని మన మిద్దరమూ ఆనందంగా కూచోవచ్చు. భర్తల

నిలా నిర్బంధించడం స్త్రీలక్షః ధర్మంకాదు. అయినా, దాని చర్మం చూస్తే నాకు కుతూహలంగా వుంది" అని చెప్పింది.

ఇది యిలా వుండగా, ఆబంగారపు దేహచ్ఛాయా, ఇంద్రనీలమణుల్లాంటి అకొమ్ములూ, ఆతరుణాదిత్యవర్ణమూ, పాలపుంతవంటి వర్చస్సూ చూశాటప్పటికి రామునకున్నూ ఆశ్చర్యం కలిగింది. అంచేత, రామునకే దానిమీద వాంఛ కలిగింది. సీత ప్రేరణవల్ల అది మరింత యెక్కువయింది. దాంతో రాముడు లక్ష్మణునితో "తమ్ముడూ! సీతకి ఈలేడిమీద కోరిక కలిగింది చూశావా? కాని యీరూపం పరిశీలిస్తే యిది లేడి అని తోచదు. కుబేరుని చైత్రరథవనంలోనూ, మహేంద్రుని నందనవనంలోనూ కూడా యిలాంటి లేడి వుండదుకదా, భూమ్మీద యెలా వుంటుంది? ఆలేడి రోమాలలో అనులోమంగానూ, ప్రతిలోమంగానూ వున్న బంగారుచుక్కలు చాలా చక్కగా మెరుస్తున్నాయి. ఇంత చక్కని లేడి యెవని మనస్సు హరించకుండా వుంటుంది? స్వర్ణమయం అయిన యీరూపం చూస్తే యెవని కాశ్చర్యం కలక్కుండా వుంటుంది? రాజులు వేటకి బయలుదేరా రంటే మాంసంకోసమూ, వినోదార్థమూ కూడా లేళ్ళని వధించడం వున్నదే కాదూ? అరణ్యాలలో అద్వితీయాలైన ధాతువులనేకా లుంటాయి. వాటిలో బంగారమూ, రత్నాలూ మొదలైన ధనరాశు లుంటాయి. వేటకువెళ్ళే రాజులు కరణ్యాలలో అవి దొరుకుతూనే వుంటాయి. మనుల కోరిక లన్నీ శుక్రుసకు బొక్కసం నింపుతాయి. అలాగే అడవులలో వుండే ధాతువు లన్నీ రాజులకు బొక్కసాలు పూరిస్తాయి. ధనకాము డైనవాడు ముందూ వెనకా ఆలోచించకుండా దేనికోసం తీవ్రప్రయత్నంచేస్తాడో అదే అర్థం అని అర్థశాస్త్రజ్ఞులూ ధనికులూ చెబుతారు. ఈ లేడి చర్మం స్వర్ణమయం కాని లోకసామాన్యం కాదు. నాతో కూడా ఆచర్మంమీద

కాచుని సీత మనస్సుకి ఆనందిస్తుంది. రల్లీమృగమూ, ప్రియకీమృగమూ, ప్రవేణీమృగమూ, గొర్రే కూడా ముట్టుకుంటే యింత మృదువుగా వుండ వని నానమ్మకం. నిజంగా, ఆకాశాన నక్షత్రపథంలో వున్న మృగశీర్షా, ఈబంగారులేడీ — సృష్టిలో కల్లా యీ రెండే దివ్యమృగాలు. ఇంతకీ: నువ్వు గట్టిగా చెబుతున్నట్టిది రాక్షస మాయే అనుకుందాం. ఇదే నిజమైతే తప్పకుండా మనమీ రాక్షసుణ్ణి సంహరించితీరాలి. క్రూరుడూ, దురాత్ముడూ అయిన యీమారీచుడు ఈవనంలో అనేకమంది మునిపుంగవులను చంపేసివున్నాడు. గొప్ప ధానుష్కులయిన మహారాజులు కూడా వేటకి వచ్చి అనేకులు దీనివల్ల నాశనం అయిపోయారు. ఈకారణంవల్ల కూడా దీన్ని చంపేతీరాలి. పూర్వం ఈదండకారణ్యంలోనే వాతాపి అనే రాక్షసుడు మోసగించి భక్ష్యపదార్థాల రూపాన కడుపుల్లో ప్రవేశించి, చివరికి యథారూపం తాలిచి కడుపులు బద్దలుచేసుకుంటూ బయటికి వచ్చి యీవిధంగా అనేకమంది మహర్షులనూ బ్రాహ్మణులనూ చంపివున్నాడు. ఉండీవుండీ, వాడు, చివరికి, భక్ష్యం రూపంతో అగస్త్యమహర్షి కడుపులో ప్రవేశించాడు. మళ్ళీ నిజరూపంతో బయటికి రావాలనినీ అనుకున్నాడు; కాని అది సాగనివ్వక అగస్త్యుడు "వాతాపీ! పాపం అని సందేహించకుండా ఇంతవరకూ నువ్వనేకమంది బ్రాహ్మణులను నాశనం చేశావు. అందుచేత, నువ్విప్పుడు నాకడుపులో జీర్ణం అయిపోయావు, తెలుసా?" అన్నాడు. ఇప్పుడీ మారీచుడు కూడా నాదగ్గిర వేషాలు వేశాడంటే వాతాపిలాగే అయిపోతాడు మంచిదే కాదుటోయీ? కనక, నువ్విక్కడ వుండి సాయుధుడవై సీతను జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండు. మనభవిష్యత్తంతా సీతతోనే వుండనుమా. నేను ఈలేడిని ప్రాణాలతోనే తీసుకువస్తాను. తప్పితే, చంపిఅయినా తెస్తాను, సందేహం లేదు. కనక, నేనిదే

తో ఒందరగా వెళ్ళిపోవాలి. సీత ముఖ్యంగా దీని చర్మమే కావాలం టోంది. కనక దీన్ని చంపి తేవడమే ముఖ్యం అనుకో. ఒక్క బా ణంతోనే నేను దీన్ని చంపి తీసుకువస్తాను. అంతవరకూ మాత్రం సీతను కనిపెట్టుకుని నువ్వు ఆశ్రమంలో మెళుకువగా వుండు. దీన్ని చంపేస్తాను, తప్పదు. దీనిచర్మం తీసుకువస్తాను. సర్వసమర్థు డైన జటాయువు ఇక్కడే వున్నాడు. చాలా బుద్ధిమంతుడు. మహాబల శాలి. సీకతని సాయంవుంది. కనక, సీతను కనిపెట్టుకుని యేదో అపాయం వస్తుంది అన్నంత సందేహంతోనే జాగ్రత్తగా వుండు ” అని మరీమరీ మళ్ళీమళ్ళీ చెప్పాడు.

## ౭౭

## రాముడు మాయలేడిని చంపి వెనక్కి బయలుదేరడం

లక్ష్మణున కిలా చెప్పి బంగారపుపిడి గల మహాఖడ్గం మొలలో కట్టు కుని రాముడు బయలుదేరాడు. రెండమ్ముల పొదులు కట్టుకుని అతను ధనుస్సుకూడా పట్టుకుని బయలుదేరాడు. రాముని రాక గుర్తించి ఆమాయలేడి భయపడి యెగిరిపోయినట్టు మాయమై మళ్ళీ కనపడింది. రాముడు లేడివెళ్ళిన ట్లల్లా వెళ్ళాడు. మాయలేడి వొక మాటు నుంచుని మిలమిల మెరిసిపోతుంది. బాణం తగులుతుం దన్నట్టు భయపడుతూ శరీరం కుంచించుకుని వొకమాటు పారిపో తుంది. ఒక్కొక్క దూకుదూకి అది ఆకాశాని కెగురుతుంది. ఒక్కొక్కమాటు చెట్లచాటుకివెళ్ళి మేఘఖండాల్లో చంద్రబింబంలాగ కనపడీకనపడకుండా వుంటుంది. క్షణంలో మాయం అవుతుంది. క్షణంలో చాలాదూరాన కనపడుతుంది. ఇలాగ కనపడుతూనూ మాయం అవుతూనూ అది రాముణ్ణి చాలాదూరం తీసుకుపోయింది.

రాముడికు చాలా కోపంవచ్చింది; కాని వెంటనే దాని చక్కదనానికి ముగ్ధుడయిపోయాడు. అప్పటి కాయాసం వచ్చింది. దాంతో ఒక్కక్షణం చెట్టునీడని పచ్చికమీద నుంచున్నాడు. ఇంతలో లేళ్ళ గుంపుతో కలిసి అది దూరాన కనపడింది. దాంతో రాముడు మళ్ళీ పిచ్చివాడులాగ అయిపోయాడు. వెంటనే అతనొక్కదూకు దూకాడు: కాని లేడి మాయమయిపోయింది. కళ్ళు మిరిమిట్లయి అతను మళ్ళీ చూశాటప్పటికి దూరాన కనపడింది. అంతలో అది చెట్ల గుంపులో కనపడింది. అప్పుడు రాముడు ఇక లాభం లేదనుకుని దాన్ని చంపడానికే నిశ్చయించుకున్నాడు. వెంటనే ధనుస్సు ఎక్కుపెట్టాడు. బాణం తీశాడు. అది సూర్యకాంతి లాగ మెరిసిపోతోంది. అది తొడిగాడు. నారి ఆకర్ణాంతమూ లాగాడు. వెంటనే పాములాగ ఆయాసంతో బుసకొడుతున్న లేడిమీదికి విడిచాడు. విడిచీవిడవగానే బ్రహ్మనిర్మిత మైన ఆ అస్త్రం అగ్నిలాగ మండిపోతూ వెళ్ళి మృగరూపి అయివున్న మారీచుని శరీరం ప్రవేశించి గుండెలు చీల్చేసింది. దాంతో ఆమాయలేడి ఉరిమిన ట్టరుస్తూ తాడిచెట్టుఎత్తున యెగిరిపడింది.

ప్రాణాలు పోయాటప్పటికి మారీచునకు లేడి రూపం పోయి నిజరూపం వచ్చింది. ఇంతేకాక వాడు "రావణుడు లక్ష్మణుణ్ణి యిక్కడికెలా పంపిస్తాడూ ? సీత నెలా ఎత్తుకుపోతాడూ ?" అని ఆలోచించాడు. రావణుడు చెప్పింది జ్ఞాపకంవచ్చింది. వెంటనే వాడు రాముని గొంతుతో "అయ్యో సీతా" "అయ్యో లక్ష్మణా" అంటూ గట్టిగా మూలిగి ప్రాణాలు విడిచాడు. చూడగా హారకేయూరాది విచిత్రాభరణాలతో, బంగారపు దండలతో, పెద్ద పెద్దకోరలతో మారీచుడు దొర్లిపోతూ కనపడ్డాడు. వాడి శరీరం నెత్తుటదోగి వుంది. అది చూసి రాముడు లక్ష్మణునిమాట జ్ఞాపకం రాగా సీతను తలుచుకున్నాడు. "ఇది మారీచుని మాయ అని తమ్ముడు చెప్పాడు. అది నిజమే

అయింది. నాగొంతుతో యీమారీచుడు "అయ్యో సీతా అయ్యో లక్ష్మణా" అంటూ మూలిగాడు. అది వింటే సీత యేమవుతుందీ? మహాబాహు డైన లక్ష్మణుడు కూడా ఏమయిపోతాడూ?" అను కుని భయంతో శరీరం అంతా గడగడలాడగా, కంగారుపడి, వెంటనే మరో లేడిని చంపి ఆహారాంసం పుచ్చుకుని అతివడిగా ఆశ్రమానికి బయలుదేరాడు.

## 22

## లక్ష్మణుడు రామునికోసం బయలుదేరడం

సీత సరిగా రాముడే యేడ్చా డన్నట్లున్న యేడుపు విని "లక్ష్మణా! వెళ్ళి రాముణ్ణి చూసిరా. పరమార్తుడైన నాభర్త యేడవడం నాకు వినపడింది. నామనస్సు నిలపడం లేదు. నాప్రాణాలు కూడా నిలవడం లేదు. అడవిలో యేడుస్తున్న సోదరుణ్ణి రక్షించు, వెళ్ళు. ఆబోతు సింహం పాలబడ్డట్టు నీసోదరుడు రాక్షసుల పాలబడ్డాడు. ఆపన్నుడై వున్నాడు కనక, త్వరగా వెళ్ళి రక్షించు" అని లక్ష్మణుణ్ణి చాలా తొందరపెట్టింది; కాని లక్ష్మణుడు అన్న ఆజ్ఞ ననుసరించి అక్కణ్ణించి కదల లేదు. అందుకు సీతకి చాలా కోపంవచ్చింది. దాంతో ఆమె "లక్ష్మణా! ఇలాంటి అవస్థలో కూడా నువ్వు నీఅన్నను రక్షించకుండా వున్నావు. నిజంగా నువ్వు నీఅన్నకు మిత్రరూపంతో వున్న శత్రుడవు. నాకోసం నువ్వు రాముడు నశించిపోవాలని కోరుకుంటున్నావు. నామీది ఆశచేతనే నువ్వు నీ అన్నదగ్గిరికి వెళ్ళకుండా వున్నావు. నీఅన్నకు కష్టాలు రావడమే నీకిష్టంగా వుందని తోస్తోంది. నీఅన్నమీద నీకు స్నేహం ఏంతమాత్రమూ లేదు. అంచేతనే నువ్వు ఆమహా తేజశ్శాలికి ఆపద కలిగితే నిశ్చింతగా వున్నావు. ముఖ్యంగా యెవరికోసం నువ్విక్కడికి

వచ్చావో ఆరామునకు ప్రాణసంశయం కలిగినప్పుడు నువ్వీఆశ్రమంలో వుండి చెయ్యవలసిన దేమున్నదీ ? ” అని చాలా కష్టంగా అంది.

ఆడలేడి లాగ భయపడి వెక్కివెక్కి శోకిస్తున్న సీతను చూసి లక్ష్మణుడు “వైదేహీ ! నాగులకూ అసురులకూ గంధర్వులకూ, దేవతలకూ మనుష్యులకూ, రాక్షసులకూ కూడా నీభర్తను జయించడం సాధ్యంకాదు, నమ్ము. దేవతలలోనూ, మనుష్యులలోనూ, గంధర్వులలోనూ, పక్షులలోనూ, రాక్షసులలోనూ, పిశాచాలలోనూ, కిన్నరులలోనూ, క్రూరమృగాలలోనూ, దానవులలోనూ కూడా మహేంద్రసమానుడైన నీభర్తను యుద్ధంలో ఎదిరించగలవాడు లేడు. ఎలాంటి యుద్ధాల్లోనూ కూడా రాముడు అవధ్యుడు. కనక, నువ్విలా అనడం ధర్మం కాదు. రాముడు లేనప్పుడు నిన్నిక్కడ ఒంటరిగా విడిచి నేను వెళ్ళలేను. ఎలాంటి బలవంతులు వచ్చినా మూడులోకాలూ దండెత్తి వచ్చినా, మహేంద్రునితో దేవతలందరూ వచ్చినా కూడా రాముని బలం అనివార్యంగానే వుంటుంది. నీమనస్సు నిశ్చలం చేసుకో. దుఃఖించకు. లేడిని చంపి నీభర్త నిరపాయంగా ఇప్పుడే వస్తాడు. ఆస్వరం మాఅన్నది కాదు. ఎవడో అలా మూలిగాడు. నిజంగా అది రాక్షసమాయ కాని మరొకటి కాదు. రాముడు రక్షించమని నిన్ను నాకప్పగించి వెళ్ళాడు. అంచేత నేనిప్పుడు నిన్ను విడిచివెళ్ళడానికి వీలులేదు. ఈరాక్షసులకూ మాకూ గర్భశత్రుత్వం వుంది. ఖరుణ్ణి సంహరించడంవల్లా, జనస్థానం ఆక్రమించడంవల్లా యిది ముదిరింది. హింసాస్వభావులైన రాక్షసులు ఎన్నివిధాలో మాట్లాడతారు. అదంతా నువ్వు మనసులో పెట్టుకోకూడదు ” అని అనేక విధాల శాంతపరచాడు.

అయినా సీత లక్ష్మణుని మాటలు నమ్మలేదు “ అనార్యుడా ! క్రూరుడా ! నృశంసుడా ! కులపాంసనుడా ! నేను నీమాటలు నమ్మను.

రామునకు కష్టాలు రావడమే నీకిష్టం. రాముని కష్టం చూసే నువ్విలా మాట్లాడుతున్నావు. నీలాగ దొంగవేషాలు వెయ్యగల దాయాదులకు ఇలాంటి బుద్ధులుండడం విచిత్రం కాదు. నువ్వు దుర్మార్గుడవు. నాకోసమే నువ్వు రామునితో వచ్చావు. నాకోసం నిన్ను భరతుడు పంపినా పంపివుండవచ్చు ; కాని నీకోరికా, భరతుని కోరికా నెరవేరదు, తెలుసా ? ఇందీవరశ్యాముడూ, పద్మాక్షుడూ అయిన భర్తను కాదని నేను మరొకణ్ణి కోరతా ననుకున్నావా ? నీయెదటే నేను ప్రాణాలు విడిచిపెడతాను. రాముడు లేనిదే భూమి మీద నేను క్షణం అయినా వుండను'' అంటూ ఆమె మరీ కఠినంగా అంది.

దానిమీద విజితేంద్రియుడైన లక్ష్మణుడు దోసిలి వొగ్గి "నేను నీకు బదులు చెప్పను. నువ్వు నాకు దేవతవు. స్త్రీలు ఇలాంటిమాటలనడం ఆశ్చర్యం. కాదు. లోకంలో స్త్రీలకిది సహజగుణం. స్త్రీలకు ధర్మం అక్కర్లేదు. స్త్రీలు ఎలాంటిచోట అయినా భేదమూ విరోధమూ కలిగిస్తారు. స్త్రీలు చంచలచిత్తలు. వైదేహీ! ఇలాంటి మాట నేను సహించలేను. నీమాట కాల్చిన బాణంలాగ నాచెవుల్లో గుచ్చుకుంటోంది. నిజం చెప్పిన నన్ను నువ్విలాగ పరుషంగా నిందిస్తున్నావు. వనదేవత లందరూ నాకు సాక్షులు. అన్న ఆజ్ఞ శిరసా వహించివున్న నన్ను ఇలా సందేహిస్తున్న నువ్వు నశించిపోతావు. ఇంకెందుకూ ? నేను రాము డెక్కడ వున్నాడో అక్కడికే వెడతాను. నీకు శుభం కలగాలి. ఈవనదేవత లందరూ నిన్ను రక్షించాలి. అతి ఘోరాలైన దుర్నిమిత్తాలు కనపడుతున్నాయి. అంచేత నువ్వు రామునిదగ్గిర వుండగా చూస్తానో లేదో ?'' అని చెప్పాడు.

అప్పటికీ తాను చెప్పినట్టు చెయ్యకుండా వుండిన లక్ష్మణుణ్ణి చూసి సీత ఏడుస్తూ "రాముడు లేకపోతే నేను గోదావరిలో పడతాను. ఉర

పోసుకునో, పర్వతశిఖరంనుంచి వురికో, విషం పుచ్చుకునో, అగ్ని హోత్రంలో పడో నేను ప్రాణాలు విడిచిపెడతాను; కాని రాముణ్ణికాక మరొకణ్ణి కాలితో అయినా తాకను " అని నెత్తీ నోరూ కొట్టుకుంది.

లక్ష్మణుడు ఆమె నూరడించలేదు. అతనితో సీతకూడా మరి మాట్లాడలేదు; కాని లక్ష్మణుడు కృతాంజలి అయి సీతకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి, వెనక్కి తిరిగి తిరిగి సీతకేసి చూస్తూ రాముణ్ణి కలుసుకోడానికి వెళ్ళిపోయాడు.

## ౪౬
## రావణ దర్శనం

సీత అలాగ కఠినంగా మాట్లాడగా, లక్ష్మణుడు, ఎంత యిష్టంలేక పోయినా విధిలేక రాముని దగ్గిరికి బయలుదేరివెళ్ళి పోయాడు. అలాంటి అవకాశంకోసం కనిపెట్టుకునివున్న రావణుడు సన్యాసివేషం ధరించి వెంటనే సీతదగ్గిరికి వచ్చాడు. అతను అతిమృదువైన కాషాయవస్త్రం చుట్టబెట్టుకున్నాడు. జుట్టుముడి వేసుకున్నాడు. గొడుగు పట్టుకున్నాడు. కాళ్ళకి చెప్పులు తొడుక్కున్నాడు. ఎడమభుజాన దండకమండలువులు పెట్టుకున్నాడు. సూర్యుడూ చంద్రుడూ కూడాలేని సమయాన చిమ్మచీకటివచ్చి సంజని ఆక్రమించే టట్టు ఇలాంటివేషంతో రావణుడు రాముడూ లక్ష్మణుడూ కూడా లేని సమయంలో సీత దగ్గిరికి వచ్చాడు. వచ్చి దారుణమైన అంగారకగ్రహం చంద్రుడు లేని రోహిణిని చూసినట్టు రాముడు దగ్గిర లేని సుకుమారి సీతను చూశాడు.

మహోగ్ర తేజశ్శాలీ, క్రూరకర్ముడూ అయిన రావణుణ్ణి చూసి జనస్థానంలో వుండిన చెట్లన్నీ గడగడ వొణికిపోయాయి. గాలి స్తం

భించిపోయింది. ఎర్రనికళ్ళతో చూస్తున్న రావణుణ్ణి చూసి అతివడిగా ప్రవహిస్తున్న గోదావరి భయంవల్ల మెల్లిగా కదలసాగింది. రాము డెప్పుడు లేకపోతాడా అని మూర్ఖుడైన రావణుడు సుజనరూపంతో చిత్రానక్షత్రం శనిగ్రహం దగ్గిరికి వచ్చినట్లు భర్తను తలుచుకుంటూ దుఃఖిస్తున్న సీతదగ్గిరికి వచ్చాడు. పాపాత్ముడైన రావణుడు సుజన రూపంతో, గడ్డితో కప్పిన నూతిలాగ మహాపతివ్రత అయిన సీతను చూస్తూ నుంచున్నాడు. మంగళాంగీ, సుదతీ, చంద్రముఖీ, పద్మపలా శాక్షీ, పీతకౌశేయవాసినీ. అయిన సీతాదేవిని దుర్బుద్ధితో రావణుడు సమీపించాడు.

సమీపించి రావణుడు మన్మథశరావిష్టు డయ్యుండీనీ మహాసుజనుడు లాగ వేదమంత్రా లుచ్చరిస్తూ చేతిలో తామరపువ్వు మాత్రం లేని మహాలక్ష్మిలాగ మహా తేజశ్శాలిని అయివున్న సీతాదేవిని "కాంచ నాంగీ, ముఖనేత్రహస్తపాదాలతో పద్మలతలాగ మెరుస్తున్న నువ్వెవ్వ తెవు? భూదేవివా? లక్ష్మివా? కీర్తివా? అప్సరస్త్రీవా? స్వేచ్ఛగా సంచరించే రతీదేవివా? నీదంతాలు తెల్లగానూ, సమాగ్రాలతోనూ తళతళ మెరుస్తున్నాయి. రక్తాంతాలూ కృష్ణతారకలూ అయిన నీ విశాలనేత్రాలు చాలా చక్కగా వున్నాయి. నీజఘనం మిక్కిలి విశాలంగా వుంది. నీతొడలు ఏనుగుతొండాల్లా వున్నాయి. పీనోన్నతా లయి తాళఫలాల్లా లయిన నీ స్తనాలు మణిమయసువర్ణహారాలం కృతాలై చాలా చక్కగా ప్రకాశిస్తున్నాయి. చారునేత్రీ! విలా సినీ! ప్రవాహవేగంతో మహానది గట్టు కోసేటట్టు నువ్వు నామనస్సు హరించేస్తున్నావు. నీశిరోజాలు చాలా మనోజ్ఞంగా వున్నాయి. నీ నడుము గుప్పిట్లో యిమిడిపోతుంది. దేవతలలోనూ, గంధర్వులలోనూ యక్షులలోనూ, కిన్నరులలోనూ నీయంత అందమైన స్త్రీ నాకింత వరకూ భూమిమీద కనపడలేదు. త్రిలోకాలయందూ కూడా అ

తరదుర్లభ మైన నీరూపమూ, నీసౌకుమార్యమూ, నీచిన్న వయస్సూ, యీ ఘోరారణ్యంలో నివాసమూ—ఇదంతా నాకు పిచ్చెత్తిస్తోంది. క్రూరులూ, కామరూపులూ అయిన రాక్షసుల కిది సంచారభూమి. కనక, నువ్విక్కడ వుండగూడదు. వెళ్ళిపో. రమ్యాలైన మేడలూ సుగంధ భరితాలైన నగరోద్యానవనాలూ—ఇవే నువ్వుండతగ్గవీ, సంచరించతగ్గవీని. నువ్వు ధరించిన పూలదండలే పూలదండలు. నువ్వు భుజించిన ఆహారమే ఆహారం. నువ్వనుభవించిన వైభవాలే వైభవాలు. నువ్వుకట్టిన బట్టలే బట్టలు. నువ్వంగీకరించిన భర్తే భర్త. వరారోహా! అలాంటి నువ్వెవరిదానవూ? రుద్రపతి వా? మరుత్తుల భార్యవా? వసువుల భార్యవా? నిజంగా నువ్వు దేవతాస్త్రీవి గాని మనుష్యస్త్రీవి కావు. అయితే, దేవతలూ, గంధర్వులూ, యక్షులూ ఇక్కడికి రారు. రాలేరు. ఇది రాక్షసుల నివాసం. నువిక్కడి కెలా వచ్చావూ? ఇక్కడ అతిభయంకరాలైన కోతులూ, సింహాలూ, చిరుత పులులూ, పులులూ, పెద్దపులులూ, ఇంకా అనేకక్రూరజంతువులూ వున్నాయి, నీకేమీ భయంలేదూ? ఈ ఘోరారణ్యంలో నడగొండలవంటి మత్తేభాలెన్నో వున్నాయి. ఇక్కడ భయం లేకుండా వొక్కతెవూ యెలా వున్నావూ? నువ్వెతెవూ? ఎవరిదానవు? ఎలాంటిదానవు? రాక్షస భూములైన యీదండకారణ్యాల్లో ఏకాకివై యెందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు.

ఇలా స్తోత్రం చేసిన వాడు నిజంగా సన్యాసే అని భ్రమపడి సీత రావణునకు అతిథులకు చేసే సకలసత్కారాలూచేసి పూజించింది. ముందు పీటవేసింది. తరవాత పాద్యమూ అర్ఘ్యమూ ఇచ్చింది. "పక్వాన్నం సిద్ధంగా వుంది భోజనం చెయ్యి" అని విన్నవించింది. వచ్చినవాడు మాయకాడనీ, విశేషించి రావణుడనీ ఆమె యెరగనే యెరగదు. బ్రాహ్మణసన్యాసే అనుకుంది.

ఇలాగ అతివినయంగా నోరారా పిలిచి గౌరవిస్తున్న సీతను చావున కయినా తెగించి రావణుడు హరించతలిచాడు. రావణుడిలా నిశ్చయించుకుంటూ వుండగా సీత లేడికోసం వెళ్ళిన రాముడు వస్తు న్నాడేమో అని చూసింది; కాని ఆమెకి పచ్చని మహారణ్యమే కాని రాముడూ లక్ష్మణుడూ కూడా కనపడలేదు.

## ४८

## రావణుడు తన సంగతి చెప్పి సీతని తనతో రమ్మనడం

తన్ను హరించడానికి మారువేషంతో వచ్చిన రావణు డిలా అడగ్గా, వాడు నిజంగా సన్న్యాసే అనుకుని సీత తన సంగతి అంతా చెప్పింది. "ఇతను బ్రాహ్మణుడు. అతిథి. చెప్పకపోతే శపించేస్తాడు" అను కుంటూ వొక్క క్షణం ఆలోచించి ఆమె యిలా ప్రారంభించింది.

"నేను మిథిలాధిపతి అయిన జనకమహారాజు కూతుర్ని. నాపేరు సీత. రాముని భార్యను. నా అత్తవారైన ఇక్ష్వాకుల యింటో పన్నెండు సంవత్సరాలనుంచి మానవు లనుభవించతగ్గ మహావైభవాలూ, భోగాలూ అనుభవిస్తున్నాను. ఇలా వుండగా – అంటే పదమూడో యేడు నడుస్తుండగా దశరథమహారాజు మంత్రులతో ఆలోచించి రామునకు పట్టాభిషేకం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. ఆప్రయ త్నాలు జరుగుతూవుండగా నాఅత్తలలో కైక అనే ఆమె భర్త నొకవరం అడిగింది. పూర్వం తాను ఆయనకు చేసిన మహోపకారానికి బదులుగా నాభర్తను అడవులకు పంపడమూ, నామరిదీ తనకొడుకూ అయిన భరతునకు పట్టాభిషేకం చెయ్యడమూ – ఇలాగ ఆవరం రెండుభాగాలుగా అడిగింది. "నువ్వు రాముడికే పట్టాభిషేకం చేసి నట్టయితే నేనిక అన్నం ముట్టను. నిద్రపోను. పచ్చిమంచినీళ్ళయినా

తాగను. ఇప్పుడే నేను చచ్చిపోతాను" అంటూ ఆమె భీష్మించు కూర్చుంది. సత్యసంధు డైన నామామగారు "నీకింకేమి కాలసినా యిస్తా" నని "ఈవరాలు మాత్రం కోరవ" ద్దనీ అనేకవిధాల బతి మాలాడు; గాని అందు కామె అంగీకరించలేదు. మహాతేజశ్శాలి అయిన నాభర్త అప్పటికి పాతికేళ్ళవాడు. నేను పద్ధెనిమిదేళ్ళదాన్ని. నాభర్తపేరు రాము డని లోకప్రఖ్యాతం అయిపోయింది. అతను సత్యవంతుడు. శుచి. విశాలాక్షుడు. మహాబాహుడు. భూతదయా పరుడు. కామార్తు డైన దశరథమహారాజు కైక యిష్టం తీర్చడంకోసం రామునకు పట్టాభిషేకం చెయ్యడం మానేశాడు. పట్టాభిషేకం జరు గుతుం దని నాభర్త తండ్రి దగ్గిరికి వెళ్ళగా కైక నాభర్తను చూసి "నీతండ్రి నాకిలా చెప్పాడు, విను. నిష్కంటక మైన ఈరాజ్యం భర తున కివ్వాలి. నువ్వు పధ్నాలుగు సంవత్సరాలు అడవుల్లో నివ సించాలి. కనక, రామా, నువ్వు అడవులకు వెళ్ళిపో. నీతండ్రిని అబద్ధం ఆడాడని అపకీర్తి కలక్కుండా రక్షించు" అని గట్టిగా చెప్పింది. ఎవళ్ళకీ యెలాంటి స్థితిలోనూ కూడా భయపడని దృఢవ్రతు డైన నాభర్త "అలాగే" అని కైక చెప్పినట్టే చేశాడు. ఏమంటే? "ఒకళ్ళ దగ్గిర పుచ్చుకోగూడదు. నిజమే చెప్పాలి. అబద్ధం చెప్పగూడదు" బ్రాహ్మణోత్తమా! ఇది రాముని దృఢవ్రతం. నాభర్తకు లక్ష్మణు డని మరొక సవతితల్లి కొడుకు. యుద్ధంలో సకలశత్రువులనూ సంహ రించగల ఆపురుషవ్యాఘ్రుడు నాభర్తకు సహాయంగా వచ్చాడు. నాభర్త జడలు ధరించి మునిరూపంతో నన్నూ లక్ష్మణుణ్ణీ వెంటబెట్టు కుని యీదండకారణ్యానికి వచ్చాడు. ఇలాగ మేము ముగ్గురమూ రాజ్యభ్రష్టులమై ఈఘోరారణ్యంలో తిరుగుతున్నాము. కనక, నువ్వు ఆయాసం తీర్చుకో. ఇక్కడ సుఖంగా ఉండు. జింకలనూ ఉడుము లనూ, అడివిపందులనూ వధించి మంచిమంచి కందమూలఫలాలున్నూ

పట్టుకుని నాభర్త యిప్పుడే వస్తాడు. నాసంగతి యిది. ఇక నువ్వు నీపేరూ నీగోత్రమూ, నీవంశమూ, చెప్పు. నువ్వు కూడా ఈదండకారణ్యంలో వొక్కడవే యెందుకు తిరుగుతున్నావో అది కూడా చెప్పు" అని అడిగింది.

దానికి రావణుడు ఇలాగ మొండిగా చెప్పాడు. "సుందరీ! నేను ఎవడి పేరు చెబితే దేవతలూ అసురులూ, నాగులూ మొదలైనవా రందరూ భయభ్రాంతు లయిపోతారో ఆరావణుణ్ణి. రాక్షసరాజు నైన నాకు కనకాంగివైన నిన్ను చూశాక నాభార్యలమీాదికి బుద్ధిపోవడం లేదు. అక్కణ్ణుంచీ యిక్కణ్ణుంచీ నేను ఉత్తమస్త్రీలనెందరినో తీసుకువచ్చాను. వారందరిలోనూ నువ్వు నాకు పెద్దభార్యవయి ఉండు. లంక అని నారాజధాని. అది సముద్రంమధ్య పర్వతశిఖరంమీాద వుంది. నువ్వు నాతోగూడా ఆనగరోద్యానాలలో విహరించతగ్గదానవే. కాని యిలాంటి కీకారణ్యంలో వుండతగ్గదానవు కావు. నువ్వు నాకు భార్యవైతే సర్వాభరణాలూ ధరించి గొప్ప అందకత్తె లయిన అయిదువేలమంది దాసీలు నిన్నెప్పుడూ సేవిస్తూ వుంటారు." అని చెప్పాడు.

ఇది విని సీత మండిపడిపోయింది. ముందు రావణుణ్ణి గడ్డిపరకలాగ తృణీకరించి ఆమె యిలా అందుకుంది. "రాముడు మహాపర్వతంలాగ కదపడానికి శక్యంకానివాడు. మహాసముద్రం లాగ క్షోభపెట్టడానికూడా ఎవ్వరికీ శక్యంకానివాడు. మహేంద్రుడితో సమానుడైన అలాంటి నాభర్తను—రాముణ్ణి నేను అనుసరించి బతుకుతున్నాను. రాముడు సర్వలక్షణసంపన్నుడు. అసంఖ్యాకబంధువర్గంతో అతను మర్రిచెట్టు లాగ విస్తరించి వున్నాడు. సత్యసంధుడైన ఆరాముణ్ణి అనుసరించి బతుకుతున్నాను. రాముడు మహాశూరుడు. మహాబాహువు, సింహంవంటి మహాపరాక్రమశాలి, పురుషసింహుడు.

నే నలాంటి రాముణ్ణి అనుసరించి బతుకుతున్నాను. రాముడు పూర్ణ చంద్రముఖుడు. మహారాజకుమారుడు. జితేంద్రియుడు. మహా కీర్తిశాలి. మహాత్ముడు. నేనలాంటి రాముణ్ణి అనుసరించి బతు కుతున్నాను. ఇక నువ్వో, నక్కవు. ఆడుసింహం వంటి నన్ను కోరుతున్నావు. కాని సూర్యుని తేజస్సు తాకలేనట్టు నువ్వు నన్ను తాకలేవు. రావణా! రాముని ప్రియభార్యని నువ్వు కోరుతున్నావు. మందభాగ్యుడ వైన నువ్విక అనేకబంగారుచెట్లు చూస్తా వన్నమాట. క్షుద్రుడా! మహాబలవంతాలై ఆకలితో నకనకలాడుతున్న సింహం కోరలూ, నల్లతాచు కోరలూ పెరకడానికి నువ్వు సిద్ధపడుతున్నావు. మందరపర్వతం చేతులతో యెత్తడానికీ, కాలకూటవిషం తాగి సుఖం గా యింటికి వెళ్ళడానికీ నువ్వు చూస్తున్నావు. అయితే, నువ్వు రాముని భార్యను కోరుతున్నావంటే, సూదితో కళ్ళు తుడుచుకోడా నికీ, నాలుకతో కత్తినాకడానికీ చూస్తున్నావన్నమాట. నువ్వు రాముని భార్యను కోరుతున్నావంటే, మెడలో బండరాయి కట్టుకుని సముద్రం యీదుకువెళ్ళడానికీ, సూర్యచంద్రుల నిద్దరినీ చేతులతో పట్టుకోడానికీ చూస్తున్నావన్నమాట. సచ్చరిత్ర అయిన రాముని భార్యను నువ్వు హరించ కోరుతున్నా వంటే, మండుతున్న అగ్నిని బట్టలోకట్టి పట్టుకువెళ్ళడానికి చూస్తున్నా వన్నమాట. నువ్వు రాముని ప్రియభార్యను పొందగోరుతున్నా వంటే శూలాల మొనలమీాద నడవడానికి చూస్తున్నా వన్నమాట. అడవిలో సింహానికీ నక్కకీ యెంత భేదంవుందో, సముద్రానికీ కొండవాగుకీ యెంత తేడా వుందో, శ్రేష్ఠమైన మద్యానికీ బియ్యపు కడుగునీళ్ళకీ యెంత వార వుందో, రామునకూ నీకూ అంత తారతమ్యం వుంది. బంగారానికీ సీసానికీ యెంత వ్యత్యాసంవుందో, మంచిగంధానికీ నీటిబురదకీ యెంత అంతరం వుందో, ఏనుక్కీ పిల్లికీ యెంత హెచ్చుతక్కువ లున్నాయో, రాము

నకూ నీకూ అంత భేదంవుంది. గరుత్మంతునకూ కాకికీ యెంత తేడా వుందో, హంసకీ నీటికాకికీ యెంత వ్యత్యాసంవుందో, సారసపక్షికీ గద్దకీ యెంత అంతరం వుందో, రామునకూ నీకూ అంత తారతమ్యం వుంది. సహస్రాక్షునితో సమానమైన పరాక్రమశాలి అయిన రాముడు ధనుష్పాణి అయి వుండగా నువ్వు నన్ను హరిస్తే వజ్రం మింగితే యీగకి జీర్ణం కానట్టు నేను నీకు జీర్ణం కాను. ”

ఇలా అంటూ సీత రావణుణ్ణి గద్దించింది; కాని, గాలికి కదిలి పోతున్న అరటిచెట్టులాగ ఆమె వొణికిపోసాగింది.

## ౪౨

## రావణుడు భయపెట్టగా, సీత గట్టిగా తిరస్కరించడం

సీత యిలా అనగా రావణునకు చాలా కోపం వచ్చింది. “సీతా, నాసంగతి నీకు తెలియదు. నేను కుబేరుని సవతితమ్ముణ్ణి. నాపేరు రావణుడు. నేను పదితలలు గలవాణ్ణి. గొప్ప ప్రతాపశాలిని. నన్ను చూశారంటే ప్రజలు మృత్యువుని చూసి పారిపోయేటట్టు దేవతలూ, గంధర్వులూ, నాగులూ, చివరికి పిశాచాలూ కూడా భయపడి పారి పోతారు. వెనకటికి ఒకానొక కారణంవల్ల క్రోధంపెట్టుకుని నాతో ద్వంద్వయుద్ధం చేసి కుబేరుడు చిత్తయిపోయాడు. నాకు భయపడి ఆకుబేరుడు సకలసంపదలతోనూ తులతూగుతూ వుండిన తన రాజ ధాని విడిచిపెట్టి కైలాసపర్వతానికి పారిపోయాడు. పుష్పకం అనే అతనివిమానం బలాత్కారంగా నేను స్వాధీనం చేసుకున్నాను. నేనిప్పుడు దానిమీదే ఆకాశయానం చేస్తూ వుంటాను. నాకు రోషం వచ్చినప్పుడు నా మొగం చూస్తే దేవత లందరూ దేవేంద్రునితో కూడా చెట్టుకొక పిట్టగా పారిపోతారు. నేనెక్కడ వుంటే అక్కడ

భయపడి గాలి వీచదు. వేడికిరణాలు గల సూర్యుడు చల్లబడి పోతాడు. ఎక్కడెక్కడ నేనుంటానో అక్కడక్కడల్లా చెట్ల ఆకు అల్లాడను. నదు లన్నీ స్తంభించి నిలిచిపోతాయి. ఇంద్రుని కమరావతీ పట్నం వున్నట్టు సముద్రతీరాన నాకు లంకాపట్నం వుంది. అది మహాక్రూరులైన రాక్షసులతో నిండివుంది. దానికి చుట్టూ తెల్లని ప్రాకారం వుంది. అందున్న మేడలన్నీ బంగారపువే. అన్నిటికీ వైడూర్యతోరణా లున్నాయి. లంకలో ఏనుగులకూ, గుర్రాలకూ, రథాలకూ లెక్కలేదు. ఎప్పుడూ అది మంగళవాద్యాలతో ముఖరితం అవుతూ వుంటుంది. అక్కడ ఎన్నో వుద్యానవనా లున్నాయి. అన్నిటిలోనూ సర్వకాలసర్వావస్థల్లోనూ ఫలించే పళ్ళచెట్లు వేలూ లక్షలూ వున్నాయి. సీతా! అలాంటిపట్నంలో నువ్వు నాతో వుంటే దిక్కుమాలిన మనుష్యులను స్మరిస్తావా? లంకలో నువ్వు మనుష్యు లనుభవించే మహాభోగాలే కాదు, దేవత లనుభవించే గొప్ప భోగాలు కూడా అనుభవిస్తావు. చావు మూడిన రాముడైనా అప్పుడు నీకు జ్ఞాపకం వస్తాడా? పెద్దకొడుకు శౌర్యధైర్యసాహసాలు లేనివాడు కనకనే అడవులకు పంపేసి, నీమామగారు ప్రియపుత్రుడైన చిన్న కొడుక్కి పట్టంకట్టాడు. ఇలాగ మూఢుడూ మూర్ఖుడూ అయి రాజ్యం పోగొట్టుకుని అడవులకు వచ్చి ముని అయిపోయిన రాముణ్ణి పెట్టుకుని నువ్వు చెయ్యగల దేముందీ? ఇక యిక్కడ, సమస్తరాక్షసు లకూ నేను రాజుని. నిన్ను కోరుతున్నాను. మన్మథశరావిష్టుణ్ణయిన్నీ వున్నాను. ఇలాంటి నన్ను తిరస్కరించడం నీవంటిదానికి తగదు. పూర్వం, ఊర్వశి ముందు పాదాక్రాంతుడైన పురూరవుణ్ణి కాలితో తన్ని తరవాత చాలా పరితాపపడిపోయింది. అలాగే నువ్వున్నూ నన్నిప్పుడు తిరస్కరిస్తే తరవాత గోలపెట్టేస్తావు, తప్పదు. మానవుడైన రాముడు యుద్ధరంగంలో నాకాలిగోటికి చాలడు. అలాంటి నేను

నీఅదృష్టంవల్ల నీకు దొరికాను. నన్ను సేవించుకో" అని రావణుడు చాలాదూరం చెప్పాడు.

ఇది విని సీత మరీ మండిపడింది. ఆమె కళ్లు నిప్పులు కురిశాయి. "రావణా! సర్వభూతాలకూ పూజ్యుడైన కుబేరుడు నీ అన్న అంటున్నావే. అలాంటి నువ్వు ఇలాంటి దుర్మార్గాని కెందుకు వొడి కడతావూ? క్రూరుడవూ, నీచుడవూ, తుచ్ఛుడవూ అయిన నీవల్ల నీయేల్బడిలో వున్న రాక్షసు లందరూ తప్పకుండా నశించిపోతారు. ఇంద్రుని భార్య అయిన శచీదేవి నైనా హరించవచ్చును; గాని రాముని భార్యనైన నన్ను హరించాలేవు, హరిస్తేబతకాలేవు. వజ్రధరుడైన మహేంద్రుని భార్యను హరించి అయినా బతకవచ్చు గాని నన్ను హరించి నువ్వు అమృతం తాగినా బతకలేవు" అని ఆమె మళ్ళీ రావణుణ్ణి ధిక్కరించి నిరాకరించింది.

## ౪౯

## రావణుడు సీతను రథంయెక్కించుకుని బయలుదేరడం

సీత యిలా అనగా మహాపరాక్రమశాలి అయిన రావణుడు చేతిలో చెయ్యివేసి గట్టిగా కొట్టుకుని శరీరం పెంచేశాడు. మరిన్నీ వాడు మరింత కఠినంగా కూడా ప్రారంభించాడు.

"నాబలపరాక్రమాల సంగతి నువ్వు వినిపించుకోలేదు. నువ్విప్పుడు ఉన్మత్తురాలివై వున్నావు. నేనాకాశాన వుండి యీభూమండలం అంతా రెండుచేతులతోనూ యెత్తిపట్టుకోగలను. సముద్రంలోని జలం అంతా తాగెయ్యగలను. మృత్యువును కూడా యెదిరించి చంపెయ్యగలను. తీక్ష్ణబాణాలతో కొట్టి సూర్యగతి కూడా అడ్డగించెయ్యగలను. భూమి చీల్చెయ్యగలను. నేను కామరూపిని. ఎవరేం కోరినా యివ్వగలను. నీకు తగినభర్తను నేనే చూసుకో."

ఇలా అన్నప్పుడు క్రూరుడైన రావణుని కళ్లు అసలే సూర్యుడు లాగా అగ్నిలాగా మండుతున్నవి యెర్రబడ్డాయి. చూస్తుండగా సౌమ్యమైన సన్యాసిరూపం విడిచి నిజస్వరూపం ధరించి యముడు లాగ భయంకరుడైనాడు. వాడి కళ్ళెర్రగా వున్నాయి. కుండలాలు ధరించి వున్నాడు. నీలజీమూతంలా నల్లగావున్నాడు. పదితలలూ యేర్పడ్డాయి. చేతుల్లో ధనస్సులూ బాణాలూ వున్నాయి. ఎర్రనిబట్టలు కట్టుకున్నాడు. అలాంటి రూపంతో యెదట నుంచుని రావణుడు, మంచి పట్టువస్త్రమూ, రత్నాభరణాలూ ధరించి సూర్యప్రభ లా వున్న సీతను చూసి "వరారోహా ! నీకు త్రిలోకాలలోనూ ప్రఖ్యాతిపొందిన భర్త కావా లంటావా, నన్నాశ్రయించు, నేనే నీకు తగినభర్తను. చిరకాలానికి నీకు నేను లభించాను. నేను చాలా గొప్పవాణ్ణి. నేను నీకెప్పుడూ అప్రియం చెయ్యను. మనుష్యునిమీద దృష్టి తప్పించుకుని నన్నే మనస్సులో వుంచుకో. మూఢురాలా ! అహంభావం తప్ప నీకేమి తెలుసూ ? ఆడదాని మాటమీద రాజ్యమూ బంధుమిత్ర గణమూ విడిచి క్రూరమృగసంకులమైన యీ ఘోరారణ్యంలో వున్న దుర్మతి రాముని యెడల యేమి చూసి నువ్వు అనురక్తురాలివైనావూ ?" అంటూ మీదికి వెళ్ళి ఆకాశాన బుధుడు రోహిణిని పట్టుకున్నట్టు కామమోహితుడై సీతను ఒడిసి పట్టుకున్నాడు. ఎడమ చేత్తో జుట్టూ కుడిచేత తొడలూ పట్టుకుని రావణుడు సీతను ఆక్రమించుకున్నాడు.

భయంకరాలైన కోరలతో మృత్యువు లా వున్న ఆరావణుణ్ణి చూసి భయార్తులైన వనదేవతలు పారిపోయారు. ఇంతలో కంచర గాడిదలు కట్టి వుండిన రావణుని బంగారపురథం అక్కడ కనపడింది. వెంటనే పరుషభాషలతో బెదిరిస్తూ రావణుడు, రథంయెక్కి సీతను తొడమీద కూచోబెట్టుకున్నాడు. "రామా, రామా" అంటూ

సీత గోలపెట్టసాగింది. కామార్తుడై రావణుడు తానంటే యెంత మాత్రమూ యిష్టంలేక ఆడతాచులాగ చుట్టుకుపోతున్న సీతతో రథంతో ఆకాశాని కెగిరాడు. అప్పుడు మతిపోయి సీత యిలా యేడవ సాగింది.

“మహాబాహూ! లక్ష్మణా? నువ్వెప్పుడూ నీ అన్నకు ప్రీతి కలిగే టట్టు సంచరిస్తావు; కాని క్రోధపరవశుడై రావణుడు నన్నెత్తుకు పోతూ వుండడం నువ్వెరగవు, ధర్మంకోసం నువ్వు జీవితమూ సుఖమూ వాంఛలూ విడిచిపెడుతున్నావు; కాని రావణుడు నన్ను తీసుకు పోవడం యెరగవు. పరంతపా! నువ్వు అవినీతులను అణిచేస్తావుగదా, ఇలాంటి పాపాత్ముణ్ణి రావణుణ్ణి నువ్వు శిక్షించవేమీ? అవినీతుని దుష్కార్యానికి అప్పుడే ఫలం కనబడుతుంది. ఈవిషయమై సస్యాలు పండడానికి లాగే కాలం కూడా అంగమే అవుతుంది. రావణా! కాలో పహతచిత్తుడవై నువ్వీ దుష్కర్మ చేశావు. దీనికి ఫలంగా రాముని చేతిలో ప్రాణాంతక మైన ఘోరాపద అనుభవించు. ధర్మమే ప్రధా నంగా భావించే రామునిభార్య ని దే రావణుడు హరించుకుని పోతు న్నాడు. ఇక కైక తన బంధువర్గంతో కూడా కోరిక యీడేర్చు కుంటుంది. ఓకొండగోగుపువ్వుల్లారా ఇదిగో, రావణుడు సీతను తీసుకు పోతున్నాడు. మీ రీ సంగతి రామునితో చెప్పండి. గొప్ప శిఖర ములు గల ప్రస్రవణపర్వతమా రావణుడు సీతను పట్టుకుని పోతున్నాడు. నువ్వీ సంగతి రామునితో చెప్పు. హంసలతోనూ కారండవాలతోనూ నిండివున్న గోదావరీ! నీకిదే వందనం. రావణుడు సీతను కొనిపో తున్నాడు. ఈసంగతి నువ్వు రామునితో చెప్పు. రకరకాలమహా వృక్షాలతో నిండివున్న యీ మహారణ్యంలో సన్నిహితులై వున్న వనదేవతలారా! మీకు నమస్కారాలు. నేను దొంగిలింపబడ్డానని నాభర్తతో చెప్పండి. ఈమహారణ్యంలో ఏమిటేమిటో మహాసత్వా

టున్నాయి. వివిధాలైన మృగాలూ పక్షులున్నూ వున్నాయి. వాటి నన్నిటినీ నేను శరణుపొందు తున్నాను. నాభర్తకి నేనంటే ప్రాణాల కంటే యెక్కువ. నన్ను రావణుడు యెగరేసుకు పోతున్నాడు. నేనేమీ చెయ్యలేకుండా వున్నాను. మీరీసంగతి నాప్రియభర్త రామునితో చెప్పండి. మహాబాహువైన రాముడు నేను స్వర్గంలో వుండినా, యమలోకానికి వెళ్ళిపోయినా తెలుసుకోనూ గలడు, బల పరాక్రమాలు చూపించి నన్ను తీసుకు వెళ్ళనూ గలడు."

ఇలా యేడుస్తుండగా సీతకి ఒకచెట్టుమీద కూచునివున్న జటాయువు కనపడింది. వెంటనే ఆమె "జటాయూ! నన్ను చూడు. పాపకర్ముడైన యీరావణుడు అనాథకింద కట్టి నన్ను తీసుకుపోతున్నాడు. వీణ్ణి ను వ్వడ్డుకోలేవు. వీడు చాలా బలవంతుడు. సాయుధుడై వున్నాడు. ఆపైని మహాక్రూరుడూ, జయావహుడూ, కూటయుద్ధ విశారదుడున్నూ కనక, రామునితోనూ లక్ష్మణునితోనూ నన్ను వీడు తీసుకుపోతూ వున్న సంగతి మాత్రం త్వరగా చెప్పు." అంటూ రావణుని పట్టు విడిపించుకోడానికి గింజుకుంటూ, డగ్గుత్తికతోనూ జాలిగానూ గోలపెట్టింది.

## ౫౦

## జటాయువు రావణుణ్ణి అడ్డుకోడం

ఒక చెట్టుకొమ్మమీద కూచుని నిద్రిస్తున్న జటాయువు మెడ రిక్కించుకుని రావణుణ్ణీ సీతనూ చూసి యిలా ప్రారంభించాడు.

"రావణా! నేను సనాతనధర్మపరాయణుణ్ణి. సత్యవాదిని. నాపేరు జటాయువు. నేను గృధ్రరాజుని; మహాబలశాలిని. దశరథమహారాజు కొడుకయిన రాముడు మహేంద్రునకూ వరుణునకూ సాటి అయినవాడు. సర్వలోకేశ్వరుడు. లోకహితచింత

కుడు. ఈమె ఆరాముని ధర్మపత్ని. ధర్మనిరతి గల రాజవు నువ్వు, ఇలాగ పరస్త్రీలను తాకవచ్చునా? విశేషించి రాజభార్యలను నీవంటి వాడు కాపాడాలి గదా? పరస్త్రీలను కోరడం మిక్కిలీ నీచం. నువ్వీ ప్రయత్నం విడిచిపెట్టు. తెలిసినవాళ్ళు ఇతరులు నిందించే పనులుచెయ్య కూడదు. బుద్ధిగలవాడు తన భార్యలను లాగే యితరుల భార్యలను కూడా కాపాడుతూవుండాలి. శిష్టులైనవారు శాస్త్రాలంగీకరించని ధర్మార్థకామాలకోసం ఆశాపడరు, ప్రయత్నమూ చెయ్యరు. కనక, నువ్వు ధర్మంతప్పకు. రాజే ధర్మానికీ కామానికీ అర్థానికీ మూలం. ధర్మం అయినా అధర్మం అయినా రాజు ననుసరించే వుంటుంది. మహా పాపాత్మునకు దేవతావిమానం లభించినట్టు పాపస్వభావుడవూ చపలుడవూ అయిన నీకీ ఐశ్వర్యం యెలా వచ్చిందీ? ఎవని కేది స్వభావమో అది తిప్పడాని కెవరికీ శక్యం కాదు. దుష్టుల హృదయంలో సదుపదేశం చిరకాలం నిలిచి వుండలేదు. నీ రాజ్యంలో గాని, నీపట్నంలో గాని రాముడు నీకేవిధంగానూ అపరాధంచేసి వుండలేదే, నువ్వుమాత్రం అతని కీ అపరాధం యెందుకు చేస్తావూ? శూర్పణఖ కారణంగా మీదికి వచ్చిన ఖరుణ్ణి రాముడు చంపాడంటే అక్కడ రాముని తప్పేమి వుందని నువ్విప్పుడు అతని భార్యని హరిస్తావూ? కనక సీతని విడిచిపెట్టెయ్యి. ఆలస్యం చెయ్యకు. లేకపోతే రాముడు నిన్ను భస్మం చేసేస్తాడు. నువ్వు కాలసర్పాన్ని కొంగున మూటకట్టుకున్నావు. అది తెలుసుకోలేకుండా వున్నావు. నీకంఠంలో కాలపాశం తగులుకుని వుంది. అదికూడా నువ్వు తెలుసుకోలేకుండా వున్నావు. తెలివిగలవాడు అణిచివెయ్యకుండా వుండేటంత బరువే యెత్తుకోవాలి. జీర్ణం చేసుకోగలంత అన్నమే తినాలి. ఏది చేస్తే ధర్మమూ ఐశ్వర్యమూ కీర్తీ, భోగపరమైన యశస్సూ కలగవో శరీరక్లేశం మాత్రం కలుగుతుందో బుద్ధి వున్నవాడు ఆపని యెందుకు

చేస్తాడూ? పితృపితామహక్రమంగా లభించిన రాజ్యం పరిపాలించుకుంటున్న నాకు ఇప్పటికి అరవై వేల సంవత్సరాలు గడిచాయి. నేను వృద్ధుణ్ణి. నువ్వో పడుచువాడవు. పైగా, కవచమూ ధనుర్బాణాలూ ధరించివున్నావు. అయినా సీతను తీసుకుని నువ్వు క్షేమంగా వెళ్ళలేవు సుమా! తర్కసూత్రాలతో వేదం యెలా ఖండించలేరో, అలాగే నేను చూస్తుండగా నువ్వు సీతను బలాత్కారంగా తీసుకుపోలేవు. రావణా! నువ్వు శూరుడవే అయితే, నుంచో. యుద్ధం చెయ్యి. ఖరుడు లాగే నువ్వు కూడా క్షణంలో నేలపాలయిపోతావు. దైత్యులనూ దానవులనూ అసంఖ్యాకంగా యెన్నోమాట్లు సంహరించిన రాముడు ఇప్పుడు మునిఅయి అహింసాపరుడయినన్ని వున్నాడనుకుంటున్నావేమో నిన్ను నరికేస్తాడు. రాముడూ లక్ష్మణుడూ యిప్పుడు దూరాన వుండిపోయారు. నుంచుళ్ళపాళంగా నేను వారిని తీసుకురాలేనుగదా అని వారికి భయపడి నువ్వు మేఘాలమీద యెగిరిపోతుతున్నావు కదూ? కాని నేను బతికివుండగా రాముని భార్యను నువ్వు తీసుకుపోలేవు. నాప్రాణాలిచ్చి అయినా మహాత్ముడైన రామునకూ, నాచెలికాడైన దశరథునకూ నేనిప్పుడుపకారం చెయ్యవలసి వుంది. కనక, రావణా! నుంచో ఇదే, నేను బతికివున్నంతకాలమూ నీకు యుద్ధాతిథ్యం యిస్తున్నాను. తొడిమనుంచి పండు వూడగొట్టేటట్టు రథంలో నుంచి నిన్నిప్పుడే భూమిమీద పడగొడతాను చూసుకో"

## ౫౧

## రావణునితో ఘోరయుద్ధంచేసి జటాయువు రెక్కలుతెగి పడిపోవడం.

జటాయువు ఇలాగ ధర్మంగా చెప్పగా క్రుద్ధుడైన రావణుని కళ్ళు భయంకరంగా నిప్పులు కక్కాయి. వెంటనే రావణుడు జటాయువు

మీాద విజృంభించాడు. వాళ్ళ కిద్దరికీ సంకులసమరం ప్రారంభమయింది. అది రెండు మేఘాలు ఒకదాన్నొకటి ఢీకొన్నట్టుంది. దండకారణ్యంలో వుండిన మాల్యవంతమూ, మేరువుదగ్గిరగా వుండిన మాల్యవంతమూ రెక్కలతో యెగిరివచ్చి తలపడ్డట్టున్నూ వుంది.

మహాబలశాలి అయిన రావణుడు సూదుల్లాంటివీ, ఇనపవీ, అంకుశాల్లాంటివీ బాణా లెన్నో వేసి నొప్పించాడు; గాని జటాయువు అందుకు భయపడక వాటిని లెక్క-కూడా చెయ్యక పైగా తన వాడిగోళ్ళతోనూ, కాళ్ళతోనూ గీరి పొడిచీ రావణుని శరీరం అంతటా గాయాలు చేశాడు. అందుకు సహించక రావణుడు పదిబాణాలు పుచ్చుకున్నాడు. అవి మృత్యుదండం లాగ చాలా ఘోరమైనవి. సూటిగా వెళ్ళేవీ, చాలా పదునైనవీ కూడానూ. అలాంటి బాణాలను రావణుడు చెవిదాకాలాగి విడిచాడు. జటాయువు పడిపోతా డనిన్నీ అనుకున్నాడు; కాని వాటిని కూడా జటాయువు లెక్క-చెయ్యలేదు. రావణుని రథంమీాద యేడుస్తూ వున్న సీతను చూశా టప్పటి కతనికి క్రోధం మరీయెక్కు-వయిపోయింది. వెంటనే యెగిరిపడి ముత్యాలతోనూ మణులతోనూ అలంకృతమైన రావణుని ధనుస్సు కాళ్లతో విరిచిపారేశాడు.

రావణుడు మరోధనుస్సందుకుని రోషంతో వందలూ వేలూ శరాలు కురిసేశాడు. కాని ఏఅపాయమూ లేకుండా జటాయువు ఆబాణసమూహంలో గూటిలో వున్నట్టున్నాడు. ఉన్నట్టుండి అతను రెక్కలతో ఆబాణా లన్నీ దూదిపింజె లెగరగొట్టిన ట్లెగరగొట్టి రావణుడు ధరించి వున్న ఆరెండో ధనుస్సు కూడా కాళ్ళతో విరిచేశాడు. రావణుని రథాశ్వాలకు బలీయూ లైన బంగారు కవచాలు తొడిగారు. జటాయువు ఆకవచాలను చీల్చేశాడు. రావణుని రథం త్రివేణీ సంపన్నం.

ఎక్కడికిపడితే అక్కడికి వెళ్ళగలదు. నవరత్నాలూ పొదిగిన సువర్ణ రథం అది. అగ్నిహోత్రంలా వెలిగిపోతోంది; కాని ఆమహోత్తమ రథం కూడా జటాయువు విరిచేశాడు. కొందరు రాక్షసులు రావణు నకు ఛత్రచామరాలు వేస్తున్నారు. జటాయువు వాటితో కూడా ఆ రాక్షసులనూ కూల్చేశాడు. సారథి చాలా బలశాలి. నిపుణుడు. జాటాయువు తొండంతో వాడి మెడకొరికేసి తల అవతల పారేశాడు. దాంతో, ధనుస్సులేక, గుర్రాల్లేక, రథంలేక రావణుడు నేలమీద పడిపోయాడు. సీతనిమాత్రం వాడు విడిచిపెట్టలేదు. రావణుడు పడి పోవడం చూసి సకలభూతాలూ "మేలు మేలు" అని జటాయువును పొగిడాయి. కాని జటాయువు అలిసిపోయి వున్నట్టు గుర్తించి రావ ణుడు మళ్ళీ ఆకాశాని కెగిరాడు.

అది చూసి జటాయువు కూడా యెగిరిబయలుదేరి "రావణా! నువ్వు బుద్ధిహీనుడవు. అంచేతే రాముని భార్యను హరించి తీసుకు పోతున్నావు రాముని బాణాలు వజ్రాయుధం కంటే చాలా గొప్పవి నువ్వీక్రూరకృత్యం చేసినందుకు ఆబాణాలతో నీరాక్షసకులం అంతా సర్వనాశనం అయిపోతుంది. దప్పిగొన్నవాడు మంచినీళ్ళు పుచ్చుకునే టట్టు నువ్వు సీతాపహరణరూప మైన విషం తాగుతున్నావు. దీనివల్ల నువ్వేకాదు నీమిత్రబృందమూ, బంధువర్గమూ, మంత్రిమండలీ పరి వారమూ చతురంగబలమూ కూడా నాశనం అయిపోతుంది. బుద్ధి హీనులు తాము చేసే దుష్కార్యాలకు ఫలం ఏమిటో యెరక్కచేసి చెడిపోతారు. ఇందుకు నువ్వే ఉదాహరణం. మాంసానికి భ్రమపడి గేలం మింగిన చేపలాగ నువ్వు ఈ దురాగతం చేసి కాలపాశానికి తగులుకున్నావు. ఎక్కడికి వెళ్ళినా చేపలాగే నీకున్నూ యిక బతుకు లేదు. రావణా! రామలక్ష్మణులు ఎలాంటివాళ్ళకీ జయించరాని మహా

వీపులు. నువ్వు చేసిన సీతాపహరణరూపమైన ఆశ్రమద్రోహం వాళ్ళెంత మాత్రమూ క్షమించరు. నువ్వు వీరుడవుకావు, పిరికిపందవు. అంచేతనే నువ్వు దొంగపోటుగా ఈపనిచేశావు. వీరు డైనవాడిలాగ ఎన్నటికీ చెయ్యడు. నువ్వు మొగవాడ వయితే యెదట నిలిచి యుద్ధంచెయ్యి. నీతమ్ముడు లాగే నువ్వూ నేలపాలయిపోతావు. తప్పదు. దురంతకాలం వచ్చినప్పుడు పురుషు డెలాంటి పాడుపని చేస్తాడో నువ్విప్పు డాపనే చేశావు" అంటూ రావణుని మూపెక్కి పెంకియేనుగును ఎక్కి మావటివాడు అంకుశంతో పొడిచేటట్టు గోళ్ళతో చాలా దారుణంగా గీరేశాడు. ముక్కుతో పొడిచేశాడు. తలవెంట్రుకలున్నా పీకేశాడు. అందు కేమీ చెయ్యలేక పెదవి కరచుకుంటూ క్రోధంతో వణికిపోయి రావణుడు చివరికి జటాయువును ఒక్క చరుపు చరిచాడు.

జటాయు వది తప్పించుకుని యెగిసిపడి ముక్కుతో రావణుని ఎడమచేతులు పదీ కొరికేశాడు; కాని విషం కక్కుకుంటూ పుట్టలో నుంచి తాచుపాములు బుస్సున పైకివచ్చేటట్టు ఆపది చేతులూ అప్పటి కప్పుడే మళ్ళీ మొలుచుకువచ్చాయి. అప్పుడు రావణుడు సీతను విడిచి పెట్టి జటాయువును తన్నుతూ గుద్దుమీదగుద్దు చొప్పున కొట్టసాగాడు. వారిద్దరికీ మళ్ళీ దారుణమైన ద్వంద్వయుద్ధం జరిగింది. చివరికి రావణుడు ఖడ్గం యెత్తి పక్కలూ డొక్కలూ రెక్కలూ తెగ్గొట్టేశాడు. వెంటనే జటాయువు కిందపడిపోయాడు. అలా పడిపోయి రక్తంలో దొర్లుతున్న జటాయువును చూసి ఆత్మబంధువు పడిపోయినట్టు దుఃఖిస్తూ సీత అతని దగ్గిరికి పరుగెత్తింది. రెక్కలు తెగి పడిపోయిన జటాయువు నల్లని మేఘం భూమిమీద పడిపోయినట్టున్నాడు. చల్లారిన దావాగ్నిలా కూడా వున్నాడు. రావణుడటు చూస్తుండగా సీత జటాయువును కౌగలించుకుని ఘోరంగా యేడ్చింది.

## ౫౨

## రావణుడు సీతనెత్తుకుని మళ్ళీ బయలుదేరడం

జటాయువుకి ప్రాణాలు కడంటాయి. ఇంకా కొంచెం కదులుతున్నాడు. పడిపోయే వున్నాడు. రాముని ఆశ్రమం అక్కడికి దగ్గిరగానే వుంది. సీత ఆజటాయువును కౌగిలించుకుని దుఃఖించి దుఃఖించి "రామా కళ్ళ దరడాన్ని బట్టీ, పిట్టల కూతలనుబట్టీ మనుష్యులకు కలిగే సుఖదుఃఖాలు తెలుస్తాయి. నన్ను చూసి యీమృగాలూ పక్షులూ యిలా యె గురుతూ దుముకుతూ వున్నాయే నాకు ప్రాప్తించిన దుఃఖం నీకింకా తెలవలేదూ? నన్ను రక్షించడానికి వచ్చిన యీజటాయువు నాదౌర్భాగ్యంవల్ల పాపాత్ముడైన రావణునివల్ల దెబ్బలుతిని ఇదే పడిపోయాడు. రామా నన్ను రక్షించు. లక్ష్మణా నన్ను రక్షించు" అంటూ గోలపెట్టింది.

అప్పుడు వస్త్రాభరణాలు నలిగీ చిక్కుపడీ అనాథలాగ యేడుస్తూనూ వున్న సీతదగ్గిరికి వెళ్ళి, రావణుడు తీగ చెట్టు నలుముకుంటున్నట్టు జటాయువును కౌగిలించుకునే వున్నా, "విడిచిపెట్టు విడిచిపెట్టు" అంటూ పెనగులాడుతూనే వున్నా "రామా రామా" అంటూ ఆక్రోసిస్తూనే వున్నా, చావుకు సిద్ధమయి ఆమె జుట్టుపట్టుకున్నాడు. రావణుడు సీత నలా పట్టుకోగానే జగత్తంతా క్రమం తప్పి చీకట్లో మునిగిపోయిన ట్టయిపోయింది. గాలి వీవడం మానేసింది. సూర్యుడు కళాహీను డయిపోయాడు. సీతను రావణు డెత్తుకుని పోతూ వుండడం దివ్యదృష్టివల్ల గ్రహించి, బ్రహ్మదేవుడు "కావలసిన పని అయిం" దన్నాడు. సీత అలాకావడం చూసీ రావణుని అంతం దగ్గిర పడడం తెలిసీ, దండకారణ్యంలో వుండిన మహర్షు లందరూ ఒకకంట ఆనందించారు రెండోకంట దుఃఖించారు.

రావణుడు సీత నెత్తుకుని ఆకాశమార్గాన బయలు దేరాడు. అప్పుడు రావణుని చంకనున్న సీత స్వర్ణాభరణాలూ పచ్చనిపట్టుచీరా, కట్టుకుని వుండడం వల్ల నీలమేఘగత మైన మెరుపుతీగలా వుంది. యెదురుగాలికి సీత పచ్చనిపట్టుచీర యెగురుతుండగా రావణుడు దావాగ్ని రేగిన పర్వతం లా వున్నాడు. అప్పటికి సీత సువాసిస్తున్న యెర్ర తామరపువ్వులు ధరించివుంది. ఈగందరగోళంలో అవి నలిగిరాలిపోయి రావణున కంటుకున్నాయి. గాలికెగురుతున్న సీత పచ్చని పట్టుచీరకొంగు సూర్య కాంతిలో ఎర్రని మేఘంలావుంది. రావణుని చంకనున్న సీతాదేవి చక్కనివదనం రాముడు లేకపోవడంవల్ల కాడ లేని తామరపువ్వులాగ వెలవెలబోతోంది. ఇంతేకాదు, ఆవదనం చక్కనినుదురుతో, మనోజ్ఞకేశపాశంతో, వికసించిన తామరపువ్వులా వుంది. తెల్లని దంతపంక్తితో అది మరింత రమణీయంగా వుంది. కాని కన్నీరు కారడంవల్ల కొంచెం వాడిపోయినట్టే వుండినా ఆమె రావణుని చంక నుండడంవల్ల నల్లని మేఘం చీల్చుకు వచ్చిన చంద్ర బింబంలా వుంది. మరిన్నీ రాక్షసుణ్ణి చూసి భయకంపితం అయిపోయిన ఆమొగం రాముడు లేకపోడంవల్ల పగటి చంద్రబింబంలా వుంది. కాటుకకొండవంటి రావణుని చేత వున్న హేమాంగి అయిన సీత నీలవణిని చుట్టుకున్న బంగరు వడ్డాణం లా వుంది. రావణుని స్వర్ణాభరణాలు గలగల్లాడుతున్నాయి. దాంతో రావణుడు సన్నని ఉరుము రుముతున్న నీలమేఘంలా వున్నాడు. సీత ధరించిన పువ్వు లన్నీ ముందు భూమిమీద పడి, తరవాత రావణవేగాన రావణుణ్ణే చేరుకున్నాయి. ఆపువ్వు లన్నీ వరాసగా వెళ్ళి రావణువ కంటుకునేటప్పుడు మేరుగిరి చుట్టూ వుండిన నక్షత్రమాలిక లా వున్నాయి. రత్నాలు పొదిగిన సీత ఎడమకాలి అందె జారిపోయి మెరుపు చుట్టలాగ భూమిమీద పడింది. చిగురుటాకులాగ ఎర్రగావున్న

సీత నల్లని రావణుణ్ణి, బంగారు పటకావేసిన యేనుగులాగ ప్రకాశింప జేసింది. కుబేరుని తమ్ముడైన ఆరావణుడు మహోల్క లాగ ఆకాశాన మెరుస్తున్న సీతను తీసుకుని ఆకాశమార్గాన వెళ్ళాడు. అప్పుడు సీత రత్నస్థగితరత్నాభరణాలు కొన్ని నక్షత్రాల్లాగ కిందపడ్డాయి. సీత మెడలో వున్న స్వర్ణహారం ఆకాశగంగ కిందపడుతున్నట్టు జారి పడింది. పక్షులతో నిండివున్న చెట్లు గాలికి కదిలి "భయపడకు" అని సీతకు ధైర్యం చెబుతున్న ట్టున్నాయి. పద్మసరోవరాలలో తామరపువ్వులన్నీ ధ్వంసం అయిపోయాయి. చేపలు మొదలైన జలచరా లన్నీ ఆకులితా లైనవి. దాంతో ఆసరోవరాలు మొగాలు ముడుచుకునీ కళ్ళుమూసుకునీ సీతను ఓదారుస్తున్నట్టున్నాయి. అప్పుడు అడవిలోవున్న క్రూరజంతువు లన్నీ రావణునిమీది కోపాన నీడననుసరించి సీతను వెంబడించాయి. జలపాతాలే కన్నీటి ధారలుగా, ఉన్నతశిఖరాలే ఎత్తిన చేతులుగా అక్కడి పర్వతాలన్నీ రావణుడు సీతను తీసుకుపోతున్నందుకు దుఃఖిస్తున్నట్టున్నాయి. సూర్యుడున్నూ సీతాపహరణం చూసి దైన్యంతో ప్రభాహీనుడై తెల్లబోయాడు. "రావణుడు రామభార్య అయిన సీతనుఅపహరించుకు పోతున్నాడే ! ధర్మం యేదీ ? సత్యం యెక్కడా ? నిష్కాపట్యం యేదీ ? దయమాత్రం యెక్కడుందీ ?" అంటూ సర్వభూతాలూ గుంపులు గుంపులుగా చేరి విచారించాయి. లేడిపిల్లలు భయపడిపోయి దీనంగా యేడ్చాయి. చూసిచూసి కన్నీటితో చూపులు మందగించగా వాణికిపోయాయి.

ఇలాగ మాటిమాటికీ నేలకేసి చూస్తూ జుట్టువిడిపోయీ, బొట్టు చెరిగిపోయీ, "రామా ! లక్ష్మణా" అంటూ గోలపెడుతున్న సీతను రావణుడు తన వినాశానికే తీసుకుపోయాడు. ఇంత యేడ్చినా యింత గోలపెట్టినా యింత దూరం వచ్చినా రామలక్ష్మణు లెక్కడా కనపడక పోయినందున భయభ్రాంత అయిపోయి సీత మొగం వేలవేసుకుంది.

## సీత రావణుణ్ణి గర్హించడం

సీత మహోద్విగ్నురా లయిపోయింది. రోషంవల్లా, రోదనంవల్లా ఆమె కళ్ళెర్రబడిపోయాయి. ఆమె జాలిగా యిలా ప్రారంభించింది.

"రావణా! నీచా! రాముడూ లక్ష్మణుడూ కూడా ఆశ్రమంలో లేకుండా చూసి నన్ను తీసుకుపోతున్నావే, నీకు సిగ్గు లేదూ? నన్ను తీసుకుపోవడానికి ఎదురుగా వచ్చే మొగతనం లేక పిరికిపందవై మాయ లేడిని పంపి మోహపెట్టి నువ్వే నాభర్తని దూరంగా లాక్కుపోయావు. నన్ను రక్షించడానికి వచ్చిన నామామగారి స్నేహితుడు జటాయువును కూడా నువ్వు పడగొట్టావు 'నేను రావణుణ్ణి' అని చెప్పి యుద్ధం చెయ్యకుండా నువ్వు నన్ను తీసుకుపోతున్నావు. ఛీ, ఏమి పరాక్రమమూ నీది? ఎవరూ లేకుండా చూసి స్త్రీహరణం—అందులోనూ పర స్త్రీహరణం చేశావే, ఇప్పటికీ నీకు సిగ్గురావడంలేదూ? శూరమ్మన్యుడవైన నీ యీ దుష్కృత్యం లోకులు, తరతరాలూ యుగయుగాలూ చెప్పుకుంటూ వుంటారు. నువ్వింతగా చెప్పుకున్నావే నీ శౌర్యమూ నీబలపరాక్రమాలూ? ధిక్? నీచరిత్ర కులాని కంతకీ మాయని మచ్చ వేస్తుంది. ఛీ? నువ్వింతవడిగా పారిపోతే యేమిటి చెయ్యడం? మొగతనం వుంటే వొక్క క్షణం ఆగు, నీప్రాణా లెగిరిపోకపోతే చూస్తాను. నువ్వు రామలక్ష్మణుల కళ్ళబడ్డావంటే పెద్దసైన్యంతో వచ్చినా నువ్వు క్షణం అయినా నిలవలేవు. పిట్ట దావాగ్నిని తాకలేనట్టు నువ్వు రామలక్ష్మణుల బాణస్పర్శ లేశమూ సహించలేవు. కనక, ఇప్పటి కయినా నీకు మేలు కావలిస్తే నన్ను విడిచి పెట్టు. నువ్వు నన్ను విడిచి పెట్టకపోతే రుష్టుడై నాభర్త నిన్ను నాశనంచెయ్యడానికి తమ్మునితో కూడా వచ్చుపడతాడు. పాపం, నాకోసం నువ్విప్పు డింత కష్టపడు

తున్నావు గాని అప్పు డిదంతా వ్యర్థం అయిపోతుంది. నువ్వేదో ఆశ పడుతున్నావు; గాని మహేంద్రసమానుడైన నాభర్తను చూడకుండా శత్రువు అధీనంలో ప్రాణాలతో క్షణ మైనా వుండను. నువ్వు నీహితమూ కోరుకోడం లేదు, నీ శ్రేయస్సూ చూసుకోడం లేదు. మరణం ఆసన్నం అయివున్నప్పు డెవరికీ మంచి పనికిరాదు. నీకిది భయపడవలసిన సంగతి; కాని నీ కదేమీ తెలియడం లేదు. నిజమే, నీమెడలో యిప్పుడు కాలపాశం తగులుకుని వుందిలే. నువ్వింక త్వరలోనే బంగారువృక్షాలు చూడగలవు. రుధిరప్రవాహంతో నిండివున్న వైతరిణీనదిని కూడా నువ్వు త్వరగానే చూస్తావు. భయంకరమైన అసిపత్రవనం నీకు దగ్గిరికే వచ్చింది. బంగారపుపువ్వులూ, వైడూర్యపు ఆకులూ ఇనుపముళ్ళూ గల బూరుగుచెట్లునూ నువ్వు త్వరలోనే చూస్తావు. మహాత్ముడైన రాముని కిలాంటి అపకారం చేసిన నువ్వు విషం తాగినవాడిలాగ త్వరగానే నశించిపోతావు. మహాధానుష్కుడైన నాభర్త తమ్మునితో గూడా ఈక్షణాన యిక్కడలేడు; కాని నువ్వెక్కడికి పోగలవూ! మహాబలశాలి అయిన రాముడు తన తీక్ష్ణబాణాలతో తనభార్యను హరించిన నిన్నిలాగా చంపేస్తాడు"

ఇలాగా, ఇంకా కఠినంగానూ గర్హిస్తూ రావణుని చంకనున్న సీత భయంతో చాలా శోకించింది. అయినా రావణుడు సందేహించక ఆమెని తీసుకుని వెళ్ళిపోయాడు.

## ౫౪

## రావణుడు సీతను లంకలో ప్రవేశపెట్టడం

సీతకు తనని రక్షించేవా డెవరూ కనపడలేదు; కాని వొక పర్వత శిఖరంమీద ఐదుగురు వానరవీరులు మాత్రం కనపడ్డారు. వారయినా తనసంగతి రాముసకు చెబుతారని ఆలోచించి అప్పుడు సీత

తన నగలుకొన్ని తీసి ఉత్తరీయంలో మూటగట్టి వారిమధ్య పడేసింది. సంభ్రాంతుడై వున్న రావణుడు అది చూడలేదు. పింగళనేత్రులైన ఆవానరవీరులు గోలపెడుతున్న సీతను చూశారు. రావణుడు పంపా సరస్సు దాటి తనకు మృత్యుకారణ మైన సీతను వొడిలో పాము నుంచుకున్నట్టు చంకనుపెట్టుకుని లంక కేసి బయలుదేరాడు. వాడు ధనుస్సు విడిచిన బాణం అంత వడిగా అడవులూ సరస్సులూ, పర్వతాలూ దాటాడు. మొసళ్లూ తిమితింమిగలాలూ నిండివున్న అపారమైన సముద్రం కూడా దాటేశాడు. ఆది చూసి చేపలు మొదలైన జల జంతువులు అడుక్కిపోగా కెరటాలున్నూ అడగిపోయి సీతకోసం విచారిస్తూ సముద్రం స్తబ్ధం అయిపోయింది. ఆకాశాన విహరిస్తున్న సిద్ధులూ చారణులూ మొదలైన ఖేచరులు “రావణునకిది అంతమే” అన్నారు.

రావణుడుమాత్రం గింజుకుంటున్న సీతను తీసుకుని లంకాపట్నం ప్రవేశించి అంతఃపురానికి వెళ్ళిపోయి, త్రిపురాధిపతి అయిన మయుడు స్వయంప్రభను గుహలో వుంచినట్టు సీత నక్కడ వుంచాడు. మరిన్ని వాడు ఘోరాకారంతో భయంకరంగా వున్న పిశాచస్త్రీలను పిలిచి “ఈమెనిక్కడ పురుషులూ స్త్రీలూ కూడా యెవరూ చూడగూడదు. రత్నాలు, ముత్యాలు, సువర్ణం, నగలు, నాణేలు, వస్త్రాలు—ఏవి యెన్ని అడిగినా ఈమెకి వెంటవెంటనే యిచ్చేస్తూవుండండి. తెలిసో తెలియకో యీసీత నెవ్వరైనా యేమన్నా అన్నారంటే వాళ్ళబతుకు అంతటితో సరి” అని వాళ్ళని గట్టిగా ఆజ్ఞాపించి అక్కణ్ణుంచి బయలు దేరి “యిక చెయ్యవలసిందేమిటి?” అని ఆలోచిస్తూ, మహావీరులైన యెనమండుగురు రాక్షసులను చూసి “ఖరుని నివాసమైన జనస్థానం ఇప్పుడు నాశన మయిపోయి వుంది. కనక, సకలవిధాల ఆయుధాలూ పుచ్చుకుని వెంటనే మీారక్కడికి వెళ్ళండి. భయం లేకుండా

మీరు శౌర్యంతో అక్కడ విడిదిచేసి వుండండి. నేను జనస్థానంలో వుంచివుండిన ఖరుణ్ణీ అతని మహాసేననీ రాముడు చంపేశాడు. రాముకూ నాకూ దారుణమైన పగ యేర్పడింది. నాకు కోపమూ కోపం వల్ల క్రోధమూ ధైర్యంకంటే చాలా హెచ్చిపోతున్నాయి. నేను ఆశత్రువును అంతంచేసి ఆపగ అంతంచేసుకోవాలని నిశ్చయించుకున్నాను. ఈపని కాకుండా నేను నిద్రపోను. ఖరుణ్ణి సంహరించిన రాముణ్ణి చంపకపోతే నాకు సుఖమూ క్షేమమూ లేవు. కనక, మీరు జనస్థానంలో వుంటూ రాము డేమి చేస్తూ వుంటాడో తెలుసుకుంటూ వుండండి. మీరు చాలా జాగ్రత్తగా వెళ్ళాలి. రాముణ్ణి వధించడానికి వుపాయాలున్నా కనిపెడుతూ వుండాలి. మహాయుద్ధాలలో నేననేకపర్యాయాలు మీ శక్తిసామర్థ్యాలు చూసి వున్నాను. కనకనే మిమ్మల్నే అక్కడికి పంపుతున్నాను.” అని ఆజ్ఞాపించాడు.

అప్పుడు ఆరాక్షసులు ఆమాటలకు చాలా ఆనందించి రావణునకు నమస్కరించి అంతర్ధానం పొంది జనస్థానానికి బయలుదేరారు. “అయ్యో రామునితో విరోధం వచ్చిందే” అన్నగుర్తు తెలియక రావణుడు “సీత మన సొత్తయింది కదా” అని చాలా సంబరపడ్డాడు.

## XX

## రావణుడు తన్నేలుకో మని సీతను కోరడం

అలాగ, మహాబలవంతులైన క్రూరరాక్షసుల నెనమండుగురినీ జనస్థానానికి పంపి, రావణుడు, బుద్ధి పెడతల బట్టడంవల్ల “మనం కృతకృత్యులం అయినాం” అనుకున్నాడు. ఈదిలాసాతో అతను కామబాణపీడితుడై సీతను చూడడానికి అంతఃపురానికి బయలుదేరాడు.

అప్పటికీ సీత కళ్ళల్లో నీళ్ళు పెట్టుకుని ఏడుస్తూనే వుంది. రావణుడే గాన బడి మహాసముద్రంలో మునిగిపోతున్న నావలాగా, గుంపుతప్పి పోయి కుక్కలు చుట్టుకున్న లేడిలాగా భయకంపిత అయి వున్న ఆమెని బలవంతాన దేవేంద్రవనం లా వున్న తన అంతఃపురం అంతా చూపించడానికి బయలుదేరతీశాడు.

అతని అంతఃపురంలో మిద్దెలూ మేడలూ ఎన్నో వున్నాయి. వాటిలో వేలకొద్దీ సుందరాంగులు నిండివున్నారు. వాటిలో రకరకాల పిట్టలున్నాయి. నవరత్నాలూ రాసులు రాసులుగా వున్నాయి. అక్కడి స్తంభాలన్నీ స్ఫటికపు రాళ్ళతోనూ, దంతంతోనూ, వెండితోనూ, బంగారంతోనూ, చేసినవి. వాటికి నవరత్నాలూ పొదిగారు కూడానూ.

అలాంటి భవనాల్లో రావణుడు సీతతో వాస దాన్లో ప్రవేశించాడు. దాని ముంగిట దేవదుందుభులు మోగుతున్నాయి. దాని గుమ్మాలు బంగారంతో చేశారు. దాని కిటికీలు దంతాలతో చేసి వెండిపూత లమర్చి, బంగారపు తెరలు కప్పారు. పాలగచ్చు చేసిన నేలమీద కూడా అక్కడక్కడ రత్నాలు పొదిగారు. దానికి చేరి దిగుడుబావులూ, కొలనులూ వున్నాయి. అన్నీ చూపించి సీతని ప్రలోభపెడుతూ రావణుడు ఇలా ప్రారంభించాడు.

“సీతా, రాక్షసులు ముప్ఫయిరెండుకోట్లు. వాళ్ళందరూ ఏపని అయినా చెయ్యగలరు. వాళ్ళ కందరికీ నేను ప్రభువును. వాళ్ళలో ముఖ్యులకు నాకు సంబంధించిన పనులు చెయ్యవలసివచ్చినప్పుడు ఒక్కొక్కనికి ఒక్కొక్క వెయ్యిమంది పరిచారకుల నేర్పాటు చేస్తాను. ఆపరిచారకు లందరూ ముసలీముతకా కానీ చిడుకూ కాని యువకులు. మహాబలిష్ఠులు. అలాంటి నా రాజతంత్రం అంతా నీఅధీనం చేస్తున్నాను. నా ప్రాణం కూడా నీచేతిలో వుంచుతున్నాను.

నువ్వునాకు ప్రాణాలకంటే యెక్కువదానవు. నాకు ఎన్నో వేలమంది భార్యలున్నారు. వాళ్ళ కందరికీ నిన్ను మహారాణీని చేస్తాను. కనక, సీతా, నువ్వు నాభార్యవయి ఉండు. నువ్వు మరో వూహ పెట్టుకోకు. నేను చెప్పింది బాగా ఆలోచించు. నన్ను సేవించు. కామతప్తుణ్ణాయి వున్న నన్ను కరుణించడానికి నువ్వు తగుతావు. ఈలంకాపట్నం నూరుయోజనాల సముద్రం మధ్యగా వుంది. దేవదానవులతో ఇంద్రుడు దండెత్తివచ్చినా దీన్ని జయించలేడు. దేవతలలోనూ, యక్షులలోనూ, గంధర్వులలోనూ, పక్షులలోనూ గూడా నాకు సాటి అయిన బలవంతుడు లేడు. రాముడు మనిషి. తేజోహీనుడు. రాజ్యభ్రష్టుడు. దీనుడు. ముని. వాడి ఆయువు చెల్లిపోయింది. ఇక వాడితో నీకేమి ప్రయోజనమూ? కనక, నన్నే భర్తగా సేవించుకో. నేనే నీకు తగినభర్తను. సీతా, కాలం వృధా చేసుకోకు. యౌవనం శాశ్వతం కాదు. కనక, ఇప్పుడే నాతో సకలభోగాలూ అనుభవించు. ఇక రాముణ్ణి చూద్దామని పేరాసపెట్టుకోకు. ఇక్కడికి రావడానికే కాదు, రావా లనుకోడానికన్నీ వాడికి శక్తి చాలదు. ఆకాశాన మహావేగంతో సంచరించే వాయువును తాళ్ళతో యెవడు కట్టగలడూ? భగభగ మండుతున్న అగ్నిజ్వాలను ఎవడు పట్టుకోగలడూ? ఈలంకకు రావడం కూడా అలాంటిదే. నా అధీనంలో వున్న నిన్ను పరాక్రమించి తీసుకుపోగలవాడు ముల్లోకాలలోనూ లేడు. ఈ లంకారాజ్యం అంతా నువ్వు నీయిష్టంవచ్చినట్టు పాలించు. నేనూ నావంటివాళ్ళూ దేవతలూ కూడా నీకు దాసులు అయి వుంటాము. ఈ లంకారాజ్యానికి పట్టాభిషేకం పొంది నువ్వు నన్ను ఆనందపెట్టు. నువ్వు పూర్వజన్మలో మొదట పాపంచేశావు. అది నీవనవాసంతో చెల్లిపోయింది. తరవాత గొప్పపుణ్యం చేశావు. దానికి ఫలం యీలంకారాజ్యాధిపత్యం. ఇక యిది అనుభవించు. ఇక్కడి పుష్పాలు

మిక్కిలీ పరిమళంకలవి. ఇక్కడి భూషణాలు వెలలేనివి. ఆపూలమాలలూ ఆనగలూ ధరించి నాతో సకలసుఖాలూ అనుభవించు. కుబేరునకు సూర్యమండలం లాగ మెరిసిపోయే విమానం వుంది. దాని పేరు పుష్పకం. అతణ్ణి జయించి నేనది స్వాధీనపరుచుకుని వున్నాను. అది చాలా విశాల మైనది. చాలా చక్కనిదిన్నీ. నాతోకూడా దాని మీాద విహరించిన్నీ ఆనందించు. నీ మొగం పద్మం లావుంది. స్వచ్ఛంగా వుంది. చాలా చక్కగానూ వుంది. కాని విచారంవల్ల దాని శోభ తగ్గిపోయివుంది. కనక, యిక విచారించకు ''

రావణు డిలా చెప్పగా సీత పైటకొంగుతో మొగం కప్పుకుని కన్నీళ్ళువిడిచింది. చింతవల్ల శోభతక్కి ధ్యానపరురాలై వున్న సీతను చూసి మళ్ళీ రావణుడు " సీతా, సిగ్గుపడకు. ధర్మం భంగపడిపోతుం దని కూడా విచారించకు. ఏమంటే ? ఇప్పుడు నీకూ నాకూ కలిగే సంబంధం ఋషు లంగీకరించిందే. ఇదిగో, స్నిగ్ధాలైన నీపాదాలు నా శిరస్సులమీాద పెట్టుకుంటాను. నామీాద అనుగ్రహం చూపించు. నేను నీస్వాధీనం అయిపోయాను. నీకు దాసుణ్ణాయిపోయాను. కామాగ్ని తప్తుణ్ణి కావడంవల్ల నే నిలా దీనంగా మాట్లాడుతున్నాను ; కాని యీారావణుడు ఇంతవరకూ ఎలాంటి అందకత్తెన్నీ కూడా శిరసా ప్రార్థించి మొగడు '' అని చెప్పి చివరికి " ఏమయినా, చివరికి సీత నాసొత్తే '' అనుకున్నాడు. తనసొత్తు మృత్యువే అని అత నెరగడు.

## ౫౬

## రావణుడు సీతని అశోకవనంలో వుంచడం

రావణు డిలా చెప్పగా, అంతవరకూ శోకిస్తున్న సీత రావణునకూ తనకీ మధ్య వొక గడ్డిపరక వేసుకుని నిర్భయంగా యిలా అంది.

"దశరథు డని వొక మహారాజు. ఆయన ధర్మజ్ఞుడు. ధర్మాత్ముడు. పర్వతంలాగ అచంచలుడు. సత్యసంధుడు. మహాజ్ఞాని. ఆయన కొడుకే రాముడు. రాముడంటే మూడులోకాల్లోనూ దిశలు తెల్లవారతాయి. అతను మహాధర్మాత్ముడు. దీర్ఘబాహుడు. విశాలాక్షుడు. అతనే నాకు భర్తా దైవతమూను. అతను ఇక్ష్వాకువంశీయుడు. సింహస్కంధుడు. మహాతేజశ్శాలి. అతనే తన తమ్ముడైన లక్ష్మణునితో కలిసి నీప్రాణాలు తీసేవాడు. అతను చూస్తూవుండగా నువ్వు నన్ను తాకి వుండినట్టయితే, అప్పుడే ఖరుడు లాగే నువ్వూ నేలపాలయి వుందువు. భయంకరాకారులైన రాక్షసులు నీచేతిలో యెందరో వున్నారనీ, వాళ్లంతా మహావీరులని చెప్పావే, కాని, గరుత్మంతుని యెదట పాముల్లాగ, రాముని యెదట వాళ్ళంతా పిరికిపంద లయిపోతారు. గంగానది కెరటాలు తీరం కోసేసినట్టు ఆరాముని బాణాలు నీశరీరం ముక్కముక్కలు చేసేస్తాయి. దేవదానవులకు నువ్వు అవధ్యుడవే కావచ్చు; కాని రామునితో వైరం పెట్టుకున్నావు, ఇక ప్రాణాలతో బయట పడవు. రాముడు నీఅంతం చూస్తాడు. యూపస్తంభానికి కట్టిన పశువుకి లాగే నీకున్నూ యిక బతుకు అబద్ధం. రాముడు నిన్ను రోషంగా చూస్తేనే చాలు, నువ్వు ఆక్షణంలోనే బుగ్గి అయిపోతావు. రాముడు ఆకాశంనుంచి చంద్రుణ్ణి పడగొట్టగలడు. నాశనమూ చెయ్యగలడు. సముద్రం ఇంకిపోయేటట్టున్నూ చెయ్యగలడు. ఇక సీతను విడిపించుకోగల డని చెప్పడం యెందుకూ? నీఐశ్వర్యం పోయింది. నీబలం సన్నగిల్లింది. నీయింద్రియాలు చెడ్డాయి. నీకు చావుమూడింది. నీమూలాన లంక విధవరా లయి పోతుంది. నా భర్తతో కలిసివున్న నన్ను విడదీశావు. ఈపాపకర్మ నీకు శ్రేయస్కరం కాదు. దైవబలంతో మహాతేజశ్శాలి అయిన నాభర్త శూన్యమైన దండకారణ్యంలో నిర్భయంగా వున్నాడు. ఆరాముడు యుద్ధంలో శరవర్షం

కురిసి నీశరీరాన్నుంచి దర్పమూ, బలమూ, పరక్రమమూ, మిడిసిపాటూ తొలగించేస్తాడు తొందరపడకు. ప్రాణికోటికి అంతం దగ్గిరపడ్డప్పుడు కాల వశాన నరులకు పెడతలబుద్ధి కలుగుతుంది. నీకూ, నీరాక్షసజాతికీ, నీఅంతఃపురానికీ అంతం వచ్చింది. అంచేతనే నువ్వునన్ను హరించుకు వచ్చావు. నీకు ఆకాలం వచ్చింది. బ్రాహ్మణుల మంత్రాలతో పవి త్రమై స్రుక్స్రువాదులతో నిండి శాల మధ్యవుండే యజ్ఞవేదిమీద చండాలుడు కాలుపెట్టలేడు. అలాగే ధర్మనిత్యుడైన రాముని ధర్మ పత్నిని నన్ను స్పృశించడం మహాపాపి వయిన నీకు శక్యంకాదు. పద్మ సరోవరంలో రాజహంసతో క్రీడించే ఆడుహంస నీటికాకిని కళ్ళతో చూడనైనా చూడదు. సహజంగా జడమయిన నాయీశరీరం నువ్వు బంధించు, తిను, నాకీశరీరం ముఖ్యం కాదు. భూమిమీద వున్నంత కాలమూ నే నపవాదు మాత్రం భరించలేను. ''

నిప్పులు కక్కుతూ యిలా చెప్పి సీత మరి మాటాడడం మాను కుంది. దానిమీద రావణుడు ఆమెను భయపెడతూ "సీతా! నా మాట విను. పన్నెండు మాసాలు నీకు వ్యవధి యిస్తున్నాను. ఈలో పున నువ్వు నన్నంగీకరించి నాభార్యవు కాకపోతే మాత్రం పొద్దుటి ఉపాహారం నిమిత్తం నావంటవాళ్ళు నిన్ను ముక్కముక్కలుగా కోసే స్తారు" అని కఠినంగా చెప్పాడు. తరవాత భయంకరాకారంగల రాక్షసస్త్రీలను చూసి "మీరీమె దర్పం అణగించండి" అని ఆజ్ఞాపిం చాడు. వెంటనే ఆరాక్షసస్త్రీలు సీత చుట్టూ మూగారు.

అప్పుడు రావణుడు క్రోధపరవశుడై భూమి బద్దలయి పోయే టంతగా నేలమీద తన్ని "ఈసీతని అశోకవనంలో వుంచండి. అక్కడ ఈమెని చాలా గుప్తంగా వుంచండి. తర్జించీ, బోధించీ, బుజ్జగించీ అడవియేనుగును దారికి తెచ్చేటట్టు దారికితీసుకురండి" అని గట్టిగా ఆజ్ఞాపించాడు.

వెంటనే ఆరాక్షసాంగనలు సీతను అశోకవనానికి తీసుకుపోయారు. ఆవనంలో సర్వకాల సర్వావస్థలయందూ పళ్ళుండే రకరకాల ఫల వృక్షా లెన్నో వున్నాయి. రకరకాలపూలచెట్లున్నూ అసంఖ్యాకంగా వున్నాయి. ఎప్పుడూ బలిసివుండే చక్కని పిట్టలుకూడా లెక్కలే కుండా వున్నాయి. ఆతోటలో సీత ఆరాక్షసస్త్రీలమధ్య పెద్దపులుల మధ్య చిక్కుకున్న ఆడలేడిలా వుంది.

## ౫౭

## రాముడు వెనక్కి బయలుదేరి లక్ష్మణుణ్ణి కలుసుకోడం

లేడి అయివచ్చిన మారీచుణ్ణి సంహరించి సీతను చూడాలని రాముడు త్వరగా బయలుదేరి వస్తూ వుండగా వొకనక్క వెనక్కివచ్చి వికటంగా వూళపెట్టింది. దాంతో రామునికి శరీరం గగుర్పొడిచింది. "ఇది అశుభం సూచిస్తోంది. రాక్షసులచేత భక్షించబడకుండా సీత భద్రంగా వుండివుంటుందా? మృగరూపి అయిన మారీచుడు సరిగా నాలాగే అన్నమాట లక్ష్మణుడు విని వుంటాడా? అది వినే వుంటే ఆమె పంపున అతను నాకోసం తప్పకుండా బయలుదేరే వుంటాడు. మారీచుని మోసం చూడగా రాక్షసులు సీతను చంపడానికి చూస్తు న్నారనడం నిశ్చయమే. సీతా లక్ష్మణుడూ క్షేమంగా వుంటారా? ఈజనస్థానం కోసం నేను రాక్షసులతో విరోధం పెట్టుకున్నాను. ఇప్పుడు దుర్నిమిత్తా లనేకాలు కనపడుతున్నాయి" అని యిలా సందేహిస్తూ నడిచాడు.

దీనుడై వున్న రామునకు అప్రదక్షిణంగా తిరుగుతూ దీనంగా చూస్తూ పక్షులు కటువుగా కూశాయి. అదిగుర్తించి రాముడు మరీ వడిగా నడకసాగించాడు. సీతనీ లక్ష్మణుణ్ణీ తలుచుకుంటూనే వస్తూ,

అతను, దూరాన తనకేసే వస్తున్న లక్ష్మణుణ్ణి చూశాడు. దుఃఖితులూ విషణ్ణులూ అయిన అన్నదమ్ము లిద్దరూ కలుసుకున్నారు. అప్పుడు రాముడు రాక్షసాక్రాంతమై వున్న స్థలంలో సీతను వొంటిగా విడిచి వచ్చినందుకు చాలా కటకటపడుతూ అతనిచెయ్యి పట్టుకుని "నువ్వు సీతను విడిచి యిలా రావడం చాలా గర్హ్యంగా వుంది. మనకి క్షేమం కలుగుతుందా? ఇక్కడ నాకన్నీ దుశ్శకునాలే కనపడుతున్నాయి. రాక్షసులు సీతను భక్షించి అయినా వుంటారు, హరించుకునిపో యయినా వుంటారు, సందేహం లేదు. తమ్ముడూ! సీత ప్రాణాలతో మనకి తక్కుతుందా? బంగారపులేడి నన్ను దూరంగా తీసుకుపోయి నేను కొట్టగా నిజరూపం పొందింది. మారీచుడే అలా వచ్చాడు; కాని చచ్చిపోయాడు. నామనస్సంతా కలిగిపోయి వుంది. నాయెడమకన్ను అదురుతోంది. లక్ష్మణా, సందేహంలేదు. సీత చనిపోయివుంటుంది. లేకపోతే రాక్షసులు తీసుకుపోతూ అయినా వుంటారు" అని నిష్ఠురంగా అన్నాడు.

## ౫౭

## రాముడు భయపడుతూ ఆశ్రమానికి రావడం

"తమ్ముడూ! అందరినీ విడిచి నన్నుమాత్రం విడిచిపెట్టలేక సీత నాతో దండకారణ్యానికి వచ్చింది. ఆమెని నువ్వు విడిచివచ్చావు. ఆమె యేదోయీ? రాజ్యభ్రష్టుణ్ణయి దీనుణ్ణయి దండకారణ్యంలో అల్లాడుతున్న నాకు దుఃఖంలో సహాయురాలై వచ్చిన ఆ సీత యేదోయి? ఎవతెను విడిచి నేను క్షణం అయినా బతికివుండలేనో, దేవకన్య వంటి ఆ నాప్రాణ సహాయురా లెక్కడ వుంది నాయనా? ఆమె లేకపోతే నాకు, పృథివీ రాజ్యమే కాదు, స్వర్గరాజ్యం కూడా అక్కర్లేదు. నాకు ప్రాణాల కంటె యెక్కువఅయిన సీత బతికివుందా? నావనవాసవ్రతదీక్ష భగ్నం అయిపోదుగదా? సీతకోసం నేను ప్రాణాలు విడిచి, నువ్వు ఒక్కడివే

మళ్ళీ అయోధ్యకు వెడితే తన కోరిక నెరవేరి కైక సుఖా లనుభవిస్తుందా? కొడుకుతోనూ ప్రాజ్యవిశాలరాజ్యంతోనూ సకల సుఖాలూ అనుభవించే సవతిని కొడుకూ కోడలూ పోయిన కౌసల్య దీనురాలై సేవించుకోవలసివస్తుందా? ఇంతెందుకూ? సీత బతికివుంటే నేనాశ్రమానికి వస్తాను. ఆమె మరణించివుంటే నేనూ ప్రాణాలు విడిచేస్తాను. ఆశ్రమానికి వెళ్ళాక చిరునవ్వు నవ్వుకుంటూ సీత నాతో మాట్లాడకపోతే నేను నశించిపోయా నన్నమాటే సుమా! లక్ష్మణా! నిజం చెప్పు. సీత బతికే వుందా? లేకపోతే నువ్వు ప్రమత్తుడవై వుంటే రాక్షసులు తినేశారా? సీత బాల. ఎప్పుడూ దుఃఖా లెరగని సుకుమారి. నావియోగంవల్ల ఆమె దుఃఖిస్తుంది. మాయకాడైన ఆమారీచుడు "లక్ష్మణా" అనడం విని నువ్వు భయపడ్డావు, కదూ? సీతకూడా అది విన్నదనుకుంటాను. భయపడి ఆమె తొందరపెట్టింది. అంచేత నువ్వు నాకోసం బయలుదేరావు. అయితే, నువ్వు సీతను విడిచి రావడం సర్వవిధాలా చాలాతప్పు. క్రూరులైన రాక్షసులకు పగ తీర్చుకోడానికి అవకాశం యిచ్చావు నువ్వు. ఖరుణ్ణి నేను సంహరించడంవల్ల మాంసాశనులైన రాక్షసులు చాలా దుఃఖిస్తున్నారు. ఆదుర్మార్గులు సీతను తప్పకుండా చంపేసివుంటారు. అయ్యో, నే నెలాంటి విపత్తులో చిక్కుకున్నాను? ఇప్పు డేమి చెయ్యనూ? ఇదంతా దైవయోగం అనుకుంటాను" అంటూ సీతను గురించి పలవరిస్తూనే—దుఃఖిస్తూనే రాముడు ఆశ్రమానికి వచ్చాడు. ఆకలితో కడుపు నకనకలాడిపోతోంది. దాహంవల్ల నాలుక ఎండిపోయింది. దీనికి సాయం నడక, దీంతో మనస్సు చెడి అప్పటికే దీను డయివున్న లక్ష్మణుణ్ణి గర్హిస్తూ రాముడు వచ్చాటప్పటికి ఆశ్రమం శూన్యంగా వుంది. అయినా, రాముడు పర్ణశాల అంతా వెతికాడు. సీతవిహరించే స్థలాలున్నూ చూశాడు. "ఇదిగో యిక్కడ వుంటుం" దను

కుంటూనే ఆశ్రమం అంతా గాలించాడు. చివరికి పరమదుఃఖితు డయి పోయాడు.

౫౯

ఇంకా ఆశ్రమానికి రాకుండానే, మార్గమధ్యనే, దుఃఖార్దితుడై వుండిన లక్ష్మణుణ్ణి "తమ్ముడూ! నేను నీమీది నమ్మకంవల్ల సీతని విడిచివచ్చాను. ఆమెని విడిచి నువ్వెందుకు వచ్చావూ? నిన్ను చూడగానే నువ్వు సీతను విడిచి వచ్చావని నేను చాలా విచారించాను. అదే నిజం అయింది. సీత లేకుండా వొక్కడవే వస్తున్న నిన్ను చూడగానే నాయెడమకన్నూ, యెడమబాహువూ అదిరాయి. నాగుండెలు కొట్టుకున్నాయి" అన్నాడు. ఇలాగ పరమదుఃఖితుడైన రామునకు అప్పుడు లక్ష్మణుడు తానున్నూ దుఃఖిస్తూనే "అన్నా నాస్వబుద్ధితో నేనిలా రాలేదు. పరుషవాక్కులతో నన్నామె తరిమింది. అంచేత వచ్చాను." అయ్యో, సీతా, "అయ్యో లక్ష్మణా" అని నువ్వన్నట్టున్న మాట వదిన విన్నది. అదివిని నీమీది స్నేహంతో భయవిహ్వల అయి నన్ను "వెళ్లు వెళ్లు" అని తొందర పెడుతూ యేడ్చింది. అన్నిమాట్లు ఆమె అంతతొందరపెట్టినా నేను కంగారుపడక, నీబలపరాక్రమాలు నేనెరుగుదును కనక "అన్నయ్యకు అపాయం కలిగించగల రాక్షసుణ్ణి నేను చూడలేదు. ధైర్యం తెచ్చుకో. ఎవడో అలా కూశాడు. దేవతలను కూడా రక్షించగల మాఅన్నయ్య నీచమూ గర్హితమూ అయిన "రక్షించు" అన్నమాట అంటాడా? నిజంగా రాక్షసుడే యెవడో అలా అన్నాడు. ఆమాట అయినా వికృతంగా వుంది; గాని మాఅన్నమాటలా లేదు. కనక క్షుద్రస్త్రీలలాగ నువ్విలా యేడవగూడదు. మనస్సు సరిచేసుకో. ధైర్యంగా వుండు. రాముణ్ణి యుద్ధంలో వోడించగలవాడు త్రిలోకాలయందూ యిప్పటికి పుట్టలేదు ఇక ముందున్నూ పుట్టబోడు. ఇంద్రాదులకు కూడా

మాఅన్న అజయ్యుడు" అని యిలాగ నేనెంత చెప్పినా గ్రహించక మావదిన గోడుగోడున యేడుస్తూ "మీఅన్న చచ్చిపోతే ఎలాగయినా నువ్వు నన్ను పొందుదా మనుకుంటున్నావు. నీకిలాంటి దుస్సంకల్పం తప్పకుండా వుంది; కాని నీకోరిక సిద్ధించదు. భరతుని దుస్సలహాతో నువ్వు మావెంట వచ్చావు. కనకనే నీఅన్న యెంత గోలపెట్టినా నువ్వు వెళ్ళకుండా వున్నావు. నువ్వు ప్రచ్ఛన్నశత్రుడవు. నిజంగా నువ్వు నాకోసమే వచ్చావు. రామున కెలాగ అపాయం వస్తుందీ అనే చూస్తున్నావు. అంచేతనే నువ్వు నీఅన్నను రక్షించడానికి వెళ్ళకుండా వున్నావు" అని చాలా నిష్ఠురా లాడింది. దాంతో నాకు కోపం వచ్చింది. నాకళ్ళెర్రబడ్డాయి. పెదవులు వొణికి మాటరాక బయలు దేరి వచ్చేశాను" అని వివరంగా చెప్పాడు.

దానిమీద రాముడు మరీ పరితపిస్తూ "తమ్ముడూ! నువ్వు లక్ష చెప్పు. నువ్వు సీతని విడిచిరావడం చాలా తప్పు. రాక్షసులను సంహరించడంలో నువ్వు నాశక్తి యెరిగివుండీన్నీ సీత యేదో అందని వచ్చేశావు. ఆడది పరుషంగా మాట్లాడిందని రోషం తెచ్చుకున్న నువ్విప్పుడేమి చెప్పినా నాకు తృప్తి కాదు. నువ్వు సీత పరుషవాక్కులు విని సర్వవిధాలా నువ్వు నాఆజ్ఞ మీరావు. ఎవడు నన్ను వంచించి ఆశ్రమంనుంచి యిలా తీసుకువచ్చాడో ఆరాక్షసు డిదిగో నాబాణంతో నేలకూలి వున్నాడు. పడిపోగానే వాడు లేడిరూపు విడిచి నిజరూపం ధరించాడు. అప్పుడే వాడు నే నన్న ట్టన్నాడు. దాంతో నువ్వు సీతనువిడిచి వచ్చావు" అన్నాడు.

## ౬౦
## రాముడు సీతకోసం దుఃఖించడం

ఇలా అంటూ రాము డాశ్రమానికి వచ్చాటప్పుడు అతని యెడమ కన్ను అదిరింది. శరీరం అంతటా వొణుకుపుట్టి తూలిపోయాడు.

దుశ్శకునా లెన్నో కనబడగా అతను మాటిమాటికీ "సీత క్షేమంగా వున్న ట్లేనా?" అని అడుగుతూనే వున్నాడు. ఇలాగ సీతను చూడడానికి తొందరపడుతూ వచ్చి ఆశ్రమం శూన్యంగా వుండడం చూసి ఉద్విగ్న మానసు డై పోయాడు. ఇక్కణ్ణుంచి అక్కడికీ, అక్కణ్ణుంచి మరోచోటికీ దుముకుతూ, అతను సీత సంచరించే స్థలా లన్నీ చూశాడు. సీత లేకపోవడంవల్ల పర్ణశాల హేమంతకాలాన శోభతక్కి పోయిన తామరపువ్వులాగా వుంది. పువ్వులన్నీ వాడిపోయాయి. అంచేత అక్కడి చెట్లన్నీ దుఃఖిస్తున్నట్టున్నాయి. ఆశ్రమమృగాలూ పక్షులూ మొగాలు వేలవేసుకుని వున్నాయి. అక్కణ్ణుంచి వనదేవతలు వెళ్ళిపోయారు. ఎక్కడి దర్భాసనా లక్కడే, చిమ్మేసిన ట్టున్నాయి. అదంతా చూసి రాముడు మళ్ళీమళ్ళీ దుఃఖించాడు.

"సీత హరించబడివుంటుంది. లేకపోతే చనిపోయి వుంటుంది. అదీకాకపోతే మాయమయిపోయి వుంటుంది. అలాగా కాకపోతే ఎవళ్ళో ఆమెని తినేసివుంటారు. లేక ఎక్కడో దాగుకుని వుంటుంది. అడవి చూడడాని కయినా వెళ్ళివుంటుంది. పువ్వులు కొయ్యడానికో పళ్ళు తేవడానికో వెళ్ళివుంటుంది. పద్మాలకోసం సరోవరానికో, నీళ్ళకోసం గోదావరికో అయినా వెళ్ళివుంటుంది" అనుకుంటూ రాముడు దుఃఖిస్తూనే చెట్టూ పుట్టా — వనం అంతా తిరిగాడు.

"కడిమిచెట్టూ, నీపువ్వు లంటే నాసీత కెంతో యిష్టం. ఆమె యెక్కడికి వెళ్ళిందో నీకు తెలిసివుంటే చెప్పు. మారేడుచెట్టూ, నాసీత చిగురుటాకుల్లాగ అతికోమలం అయినది. పచ్చని పట్టుబట్ట కట్టుకున్నది. బిల్వఫలస్తని. నువ్వామెని చూసివుంటే నాకుచెప్పు. అర్జునవృక్షమా! నువ్వంటే నాసీతకి చాలా యిష్టం. అమాయికురాలయిన జనక మహారాజు కూతురు బతికివుందా? ఈకకుభవృక్షం చిగుళ్ళతోనూ, పువ్వులతోనూ నిండి చాలా రమ్యంగా వుంది. కకు

భోరువు అయిన సీత సంగతి దీనికి తెలిసివుంటుంది. తుమ్మెదలు మూగివున్న యీతిలకవృక్షానికయినా తనయెడల చాలా ప్రీతిగల సీత సంగతి తెలవకుండా వుండదు. అశోకవృక్షమా! శోకం పోగొట్ట డానికి నీకు చాలా శక్తివుంది. నాప్రియురాలిని నాకు చూపించి నన్ను నీపేరుగలవాణ్ణి చెయ్యి. తాళవృక్షమా! తాళఫలస్తని అయిన నాసీతను నువ్వు చూసివుంటే దయవుంచి నాకు చెప్పు. నేరేడు చెట్లూ! నీపళ్ళలాగే నిగనిగలాడే నాసీతను చూశావా? కొండ గోగూ! చక్కని పువ్వులతో నువ్విప్పుడు చాలా రమ్యంగా వున్నావు, నువ్వయినా నాసీత సంగతి చెప్పు—"

ఇలాగ రాముడు మామిడిచెట్లనూ, పనసచెట్లనూ, కురవక వృక్షాలనూ, దానిమ్మచెట్లనూ, మల్లితీగలనూ, మాధవీలతలనూ, సంపంగెపొదలనూ, మొగిలిడొంకలనూ అడుగుతూ ఉన్మత్తుడు లాగ అడవి అంతా తిరగసాగాడు. "ఇలా కాదు. ఓలేడీ! మృగనేత్ర అయిన నాసీతను చూశావా నువ్వు? ఓమత్తేభమా! గజనాసోరువు అయిన నాసీతను నువ్వుగానీ చూశావా? ఓపులీ! నాసీత చంద్రముఖి. నాప్రియురాలు. ఆమె జాడనీకేమయినా తెలుసునా? సీతా! ప్రియురాలా! అదిగో దూరాన కనపడుతున్నావు. చెట్లచాటున నక్కుతావేం? నాతో మాట్లాడవేం? సుందరీ! నుంచో నుంచో. నీకు నామీద దయలేదు. నువ్వంతగా హాస్యాలాడేదానవు కావే, నన్నెందుకిలా వుపేక్షిస్తావు? నువ్వెంత దాగుకుందామన్నా నీపచ్చని పట్టుచీర నాకు నిన్ను చూపించేస్తోంది. ఇప్పటికయినా నామీద దయవుడితే అక్కడ ఆగు. అయ్యో ఎటు చూసినా సీత లేనట్టుంది. లేకపోతే ఎవళ్ళయినా ఆమెని హింసించి వుంటారు. అలాకాకపోతే ఇంత అవస్థలో వున్న నన్ను ఆమె వుపేక్షించి వూరుకోదు. నేను లేకుండా చూసి రాక్షసులు ఆమెని ఏఅవయవానికావయవం విడదీసి

తినేసివుంటారు. చక్కని ముక్కూ, చక్కని పలువరుసా, చక్కని కుండలాలూ గల ఆచంద్రవదనం శోభ తక్కివుంటుంది. సమస్తకంఠాభరణాలతోనూ నిండి సంపంగె మొగ్గ లాగ వున్న ఆమె కంఠం వాళ్ళు మింగేసివుంటారు. అంగదాలూ, కంకణాలూ, మురుగులూ, మురిడీ గొలుసులూ, ఉంగరాలూ మొదలైన నగలతో మెరిసిపోతూ భయం వల్ల విసరపడుతూ వొణికిపోతున్న ఆమె చేతులు వాళ్ళు కొరికేసి వుంటారు. సీతను రాక్షసులు తినడానికే నేను విడిచిపెట్టినట్టయింది. బాటసారులలోనుంచి తప్పిపోయిన ట్టున్న బహుబాంధవి ఆసీత రాక్షసులవాతబడేవుంటుంది. లక్ష్మణా! వీరాధి వీరా! నాప్రియురాలెక్కడవుందో చూడవోయీ! హాప్రియా. హాసీతా! నువ్వెక్కడున్నావూ?'' అంటూ అతను అరణ్యం అంతా తిరిగాడు. కొండలన్నీ గాలించాడు. నదులన్నీ వెతికాడు. మళ్ళీమళ్ళీ వెతికినచోట్లే వెతికాడు.

## ౬౧

## రాముడు సీతకోసం పర్వతప్రదేశాలన్నీ వెతకడం

పర్ణశాలలో సీత లేకపోవడమూ, ఆసనాదు లన్నీ చిందరవందర అయిపోయివుండడమూ చూసి రాముడు "సీతా, సీతా" అని గట్టిగా పిలుస్తూ కొంతసేపు తల్లడించి, చివరికి లక్ష్మణుని రెండు భుజాలున్నూ పట్టుకుని "తమ్ముడూ, సీత యేదోయీ? ఎక్కడికయినా వెళ్ళివుంటుందిటోయీ? లేకపోతే, యెవడయినా తీసుకుపోయాడంటావా, తినేశాడంటావా? సీతా ఏచెట్టుచాటునైనా నక్కివుండి నాతో వేళాకోళా లాడదలిచావా? నిన్ను విడిచి నేనుండలేను. నువ్వు కనపడితే గాని నాదుఃఖం తగ్గదు. నువ్వు ఆడుకునే లేళ్లు నువ్వులేక తెల్లపోయి వున్నాయి. కళ్ళనీళ్లు పెట్టుకుని నిన్నే తలుచుకుంటున్నాయి.

లక్ష్మణా! సీత లేకపోతే నేను బతకలేను బాబూ! సీత కోసం దుఃఖించి చివరికి నేను చచ్చిపోతాను. పరలోకంలో నాయనగారు నన్ను తప్పకుండా చూస్తారు. "పధ్నాలుగేళ్ళు వనవాసం చేస్తానని నువ్వు మాట యిచ్చావు; కాని ఆకాలం పూర్తి చెయ్యకుండానే నువ్విక్కడికి వచ్చేశావు. నువ్వు స్వేచ్ఛాచారివి. అనార్యుడవు. అసత్యవాదివి. ఛీ, చూడగూడ" దని పరలోకంలో నన్ను నాయనగారు తప్పకుండా నిందిస్తారు. సీతా, విదేహరాజనందనా! శోకసంతప్తుణ్ణీ వివశుణ్ణీ, దీనుణ్ణీ, భగ్నమనోరథుణ్ణీ, నన్ను నిర్దయగా విడిచిపెట్టేసి యెక్కడికి వెళ్ళావ్రూ? నన్ను విడిచి పెడతావా? నిన్ను విడిచి నేను బతగ్గలనా?" అని రాము డిలాగ యెంతో విలపించాడు; గాని సీత కనపడలేదు.

బురదలో కూరుకు పోయిన యేనుగులాగ సీత కనపడక దుఃఖిస్తున్న రాముణ్ణి చూసి లక్ష్మణుడు "మహాబాహూ, విచారించకు. మనం మళ్ళీ ప్రయత్నించి చూతాం. ఈఅడవిలో లతాగృహా లెన్నో వున్నాయి. అడవిలో తిరగడం అంటే వదిన కెంతో యిష్టం కనక, చూడ్డానికి అడవికే వెళ్ళివుంటుంది. లేకపోతే, చక్కగా వికసించి వున్న తామరపువ్వుల శోభ చూడ్డానికి మడుగుదగ్గిర కయినా వెళ్ళివుంటుంది. నదికి స్నానానికే వెళ్ళిందో? వేళాకోళం చెయ్యడాని కెక్కడయినా నక్కిందేమో? ఇంతకీ నిన్నూ నన్నూ పరీక్షచెయ్యడాని కేచాటున అయిన కూచుందేమో? దుఃఖించకు, సీత కనపడేదాకా అడవి అంతా గాలించేద్దాం" అని చెప్పాడు.

సౌహార్దంతో లక్ష్మణు డిలా చెప్పగా రాముడు అడవి అంతా వెతకడానికి బయలుదేరాడు. పర్వతం యెక్కాడు. శిఖరం అంతా వెతికాడు. గుహా లన్నీ చూశాడు. చివరికి "లక్ష్మణా! సీత కనపడింది కాదోయి" అని మిక్కిలీ దుఃఖించాడు. అది చూసి లక్ష్మ

ణుడు "అన్నా! విచారించకు. తొందరపడకు. బలినిబంధించి విష్ణువు భూదేవిని పొందినట్టు నువ్వు తప్పకుండా సీతను చూస్తావు" అని ఓదార్చాడు; కాని అంతమాత్రాన రామునికి కూరట కలగలేదు. "తమ్ముడూ, అడవి అంతా చూశాం. మడుగులన్నీ వెతికాం. అనేక గుహాలూ, వాగులూ వున్న ఈ పర్వతంకూడా అంతా గాలించేశాం. సీత మాత్రం దొరకలేదు. ఆమె నాకు ప్రాణాలకంటే యెక్కువ" అని దుఃఖించి కొంతసేపు విహ్వలుడయిపోయాడు. అతని శరీరం వసి వాడిపోయింది. బుద్ధి మందగించింది. మనస్సు కరిగిపోయింది.

ఇలాగ పరమదీనుడయి పోయి అతను "అయ్యో, సీతా" అంటూ గోలపెట్టేశాడు. చేతులు వొగ్గి దుఃఖించవద్దని లక్ష్మణుడు అనేక విధాల బతిమాలాడు; గాని రాముడు మళ్ళీమళ్ళీ, యింకా యింకా యేడుస్తూనే వుండిపోయాడు

## ౬౨

## రాముడు సీతను తలుచుకుని తలుచుకుని దుఃఖించడం

మదనార్తుడై వుండడంవల్ల కనపడకున్నా కనపడుతూనే వుందనుకుని రాముడు, డగ్గుత్తికతో, మాట్లాడలేక మాట్లాడలేక "ప్రియా! నీకు పుష్పాలంటే చాలా ప్రీతి. అంచేత అశోకచెట్టుకొమ్మలతో కప్పుకుని నాకు దుఃఖం యెక్కువ చేస్తున్నావు. నీతొడలు అరటిబోదెలలా వుంటాయి గదా అని నువ్వు అరటిచెట్లలో దాగుకుంటున్నావు; కాని నీతొడలు నాకు కనపడుతూనే వున్నాయి. దేవీ! నువ్వు నవ్వుకుంటూ కొండగోగు చెట్లలో విహరిస్తున్నావు. ఇక పరిహాసాలు చాలించు. అది నాకు చాలా బాధ కలిగిస్తోంది. నేనెంతో డస్సిపోయి వున్నాను. నీపరిహాసం అంటే మునుపు నాకెంతో ప్రీతిగావుండేది; కాని యిప్పుడది నన్నెంతో బాధపెడుతోంది. నువ్వు పరిహాసం అంటే చెవి

కోసుకుంటా వని నాకు తెలుసు; కాని ఆశ్రమాలు పరిహాసాలకు తగిన తావులు కావు. విశాలాక్షీ! నువ్వు లేక యీపర్ణశాల చాలా చిన్నబోయింది, త్వరగా రా. లక్ష్మణా! సీతను రాక్షసులు తినేసయినా వుంటారు, తీసుకునిపోయయినా వుంటారు. లేకపోతే, నే నింత యేడుస్తూవుంటే సీత నాదగ్గిరికి రాకుండా వుండదు. ఈలేళ్ళన్నీ కళ్ళ నీళ్ళు పెట్టుకునివున్నాయి. సీతను రాక్షసులు తినేసివుంటా రనడానికే యిది గుర్తుగా వుంది. అయ్యో, సీతా, నన్ను విడిచి యెక్కడికి వెళ్ళావూ? నువ్వు లేకపోతే కైక సఫలమనోరథురా లవుతుంది గదా? సీతతో కూడా యిక్కడికి వచ్చాను. మళ్ళీ సీతలేకుండా అయోధ్యకు వెళ్ళి నే నంతఃపురంలో యెలా ప్రవేశిస్తానూ? సీతను పోగొట్టుకోడం వల్ల లోకు లిక నన్ను నిర్వీర్యుడనీ, నిర్దయుడనీ, ధైర్యసాహసాలు లేనివాణ్ణనీ నిందిస్తారు. వనవాసం పూర్తి అయాక "నాయనా, కుశలంగా వచ్చారా?" అని జనకమహారా జడిగితే నేనేమిటీ చెప్పడం? నాతో సీత రాకపోవడం చూస్తే ఆమహారాజు తప్పకుండా మూర్ఛిల్లి పోతాడు. కనక, భరతుడు పాలించే అయోధ్యకు నేను వెళ్ళకుండా వుంటేనే మంచిది. సీత లేకపోతే శూన్యం తప్ప స్వర్గంలో మాత్రం నాకేమి వుంటుందీ? తమ్ముడూ, స్థితి యిలావుంది. కనక, నన్ని క్కడ విడిచిపెట్టేసి నువ్వు అయోధ్యకు వెళ్ళిపో. సీతను విడిచిపెట్టి నే నెలాగూ బతకలేను. నేరుగా నువ్వు భరతుణ్ణి గట్టిగా కౌగిలించు కుని "రాముడు నీకనుజ్ఞ యిచ్చేశాడు; కనక, రాజ్యం స్వేచ్ఛగా పాలించుకో" అని చెప్పు. నేను చెబుతున్నాను; కనక, నువ్వు కైకకూ, సుమిత్రాదేవికీ, కౌసల్యాదేవికీ నాకు బదులుగా నువ్వే నమస్కరించు. నువ్వు చెప్పింది చెప్పినట్టు చేస్తావు, నాకు నమ్మకమే. కౌసల్యను నువ్వు కాపాడాలి సుమా! ముందు సీతా, తరవాత నేనూ నశించిపోవడం మాఅమ్మకి నువ్వు సవిస్తరంగా చెప్పాలిసుమా!" అని

గొల్లు మన్నాడు. అది చూసి లక్ష్మణుడు కూడా కలగాపడి పోయాడు.

## ౬౩

## సీతను తలుచుకుని ఏమిటేమిటో అనుకుంటూ రాముడు దుఃఖించడం

సీత లేకపోవడంవల్ల కామమూ శోకమూ అతిశయించగా బాధపడు తున్న రాముడు తన్ను చూసి లక్ష్మణుడు గూడా దుఃఖించేటట్టు మళ్ళీ యెక్కువగా విచారించ సాగాడు. "తమ్ముడూ, లోకంలో నావంటి ఘోరపాపాత్ముడు మరివొక డుంటా డని నే ననుకోను. ఏమంటే, నాగుండెలు బద్దలయిపోయేటట్టూ, మనస్సు వికలం అయిపోయేటట్టూ నాకు శోకంమీద శోకం వచ్చిపడుతోంది. నేను పూర్వజన్మలో యెన్నో పాపా లెన్నిమాట్లో చేసివుంటాను. ఆపాపాలఫలం టే నాకిప్పుడు దుఃఖంమీద దుఃఖం రావడం. ముందు రాజ్యభ్రంశం, దానిమీద స్వజనాన్ని విడిచిపెట్టడం, ఆపైన నాయనగారు చనిపోవడం, చివరికి అమ్మని విడిచిరావడం — ఇవన్నీ తలుచుకున్నకొద్దీ నన్ను శోకప్రవా హంలోకి నెట్టేస్తున్నాయి. అయితే, యీ దుఃఖా లన్నీ అడవిలోకి వచ్చాక నేను మరిచిపోయాను; కాని కట్టెలతో నిప్పు విజృంభించేటట్టు ఈ సీతావియోగంతో అవన్నీ మళ్ళీ విరుచుకు పడ్డాయి. తమ్ముడూ, తన్నెవడో రాక్షసు డాకాశమార్గాన యెత్తుకుపోతూ వుంటే సీత ఘోరంగా యేడ్చివుంటుంది. కుంకుమపువ్వు కలిసిన మంచిగంధపు పూతకు తగినవీ, గుండ్రనివీ అయిన నాసీత శోణితదిగ్ధ స్తనాలు ఏరాక్ష సుడో భక్షిస్తూ వుంటాడు. మృదుమధురవాక్యాలు పలికేదీ, కుంచిత కేశభారంతో సొగసైనదీ అయిన నాసీత మొగం రాక్షసుని వశం అయి రాహుగ్రస్తమైన చంద్రబింబం లాగ శోభాహీనం అయిపోయి వుంటుంది. రత్నహారాలకూ, ముక్తాహారాలకూ, అంతకంటే ఉత్తమా

లయిన పూలదండలకూ చక్కని తావలం అయిన నాసీత కంఠం విరుచు కుని ఏ రాక్షసుడో ర క్తం తాగుతూ వుంటాడు. నేను లేకుండా చూసి ఏ రాక్షసుడో వచ్చి యీడ్చుకుపోతూ వుంటే నాసీత పులివాతబడ్డ లేడిలాగ ఆక్రోశించి ఉంటుంది. లక్ష్మణా ! ఈరాతిబండమీద నాతో కూడా కూచుని సీత నీతో యెంతో పరిహాసా లాడేది. నదు లన్నిటి లోనూ చాలా ఉత్తమమైన యీగోదావరి అంటే సీతకి చాలాప్రీతి. కనక, అక్కడికి వెళ్ళిం దేమో అంటే నేను వెంటలేకుండా వొంటరిగా యెప్పుడూ వెళ్ళదుగదా ? ఆమె పద్మముఖి, పద్మనేత్రి కనక, పద్మాల మీాది ప్రీతితో సరోవరానికి వెళ్ళిం దేమో అంటే అక్కడికిన్నీ నేను లేకుండా ఆమె వెళ్ళదుకదా ? ఈవనంలో పు ౢ చెట్లన్నీ విరగబూసి వున్నాయి. రకరకాల పక్షు లాచెట్లమీాద అవ్యక్త మధురంగా కూస్తు న్నాయి. కనక, అక్కడికి వెళ్ళిందేమో అంటే, ఆమె మిక్కిలి పిరికి మనిషి, నేను లేకుండా అలాంటి చోటికి అసలే వెళ్ళదు గదా ? ఓ సూర్యుడా, లోకంలో యేమి జరుగుతోందో యేమి జరగడం లేదో అంతా నువ్వు తెలుసుకోగలవు. లోకుల సత్యాసత్యాలకు నువ్వు సాక్షివి. నాసీత యీప్రాంతాన యెక్కడయినా వుందో, ఆమె నెవ డైనా యెత్తుకుపోయాడో చెప్పి నాకు దుఃఖం తగ్గించుతండీ ! ఓవాయు దేవుడా ! మూడు లోకాలలోనూ నీకు తెలియరాని దేమీా లేదు. నాసీతను ఎవడైనా ఎత్తుకుపోయాడా, లేక ఆమె చచ్చి పోయిందా, యెక్కడికయినా వెళ్ళివస్తోందా చెప్పునాయనా ! ” అని యిలాగ అతి దీనంగా యేడుస్తున్న రాముణ్ణి చూసి ధైర్యశాలీ న్యాయప్రవర్త కుడూ అయిన లక్ష్మణుడు “ అన్నా, శోకించకు ధైర్యం తెచ్చుకో. మనం యింకా వెతకాలి కనక వుత్సాహం తెచ్చుకో. ఉత్సాహం వున్నవాళ్లైలాంటి పనులు చెయ్యవలసివచ్చినా జంకరు ” అని ధైర్యం

చెప్పాడు ; కాని రాామునకు ధైర్యం రాలేదు. ఊగకలు వేసుకుంటూ దుఃఖమే వచ్చింది.

## ౬౪
## రాముడు కూలిపడ్డ రావణ రథాదులు చూడడం

"తమ్ముడూ, పద్మాలు తెచ్చుకోడానికి సీత గోదావరికి వెళ్ళిందేమో చూసిరా నాయనా" అని రాముడు దీనంగా చెప్పగా, లక్ష్మణుడు రెండడుగుల్లో వెళ్ళివచ్చి "అన్నా, వదిన యేరేవులోనూ కనపళ్ళేదు. ఎంత పిలిచినా పలకలేదు. ఆమె యెక్కడికి వెళ్ళిందో యెక్కడ వుందో నాకేమీా జాడ తెలియలేదు" అని బదులుచెప్పాడు. ఈమాటమీాద రాముడే స్వయంగా గోదావరికి బయలుదేరాడు. అతనికిన్నీ సీత కనపడ లేదు. "సీత యేదీ?" అని గోదావరి నడిగాడు, కాని "క్రూరుడైన రావణుడు సీత నెత్తుకుపోయా డని వనదేవతలూ గోదావరీ కూడా చెప్పలేదు. అప్పుడు వనదేవతలన్నీ "జరిగిన సంగతి రామునకు నువ్వు చెప్పు" అని గోదావరిని ప్రోత్సాహపరిచాయి. అయినా రాము డెంత అడుగుతున్నా గోదావరి చెప్పలేదు. రావణుని ఘోరరూపమూ అతను చేసిన ఘోరమూ తలుచుకుని భయపడిపోయి గోదావరి చెప్పలేకపోయింది.

అప్పుడు రాముడు "తమ్ముడూ, ఈగోదావరి ఏమీా చెప్ప కుండా వుంది. సీత లేకుండా అయోధ్యకు వెళ్ళి జనకమహారాజునకూ, అమ్మకూ నేనేమిచెప్పనూ? రాజ్యభ్రష్టుణ్ణయి కందమూాల ఫలాలతో యీావనంలో జీవిస్తున్న నాకు సకలశోకాలూ పోగొట్టేది సీత, ఆమె యిప్పు డేమయిపోయిందీ? బంధువులకు దూరం అయిపోయాను. రాజపుత్రిక కనపడ్డంలేదు. నాకిక నిద్రపట్టదు. రాత్రు లెలా గడుస్తాయి నాయనా? ఇప్పుడు నాకు సీత కనపడ్డయితే మందాకినీ నదీతీరమూ, జనస్థానమూ యీాప్రస్రవణగిరీ అంతా తిరిగివస్తునుగదా?

మహాబలవంతాలయిన యీామృగాలు నా కేదో చెప్పడానికా అన్నట్టు మాటిమాటికీ చూస్తున్నాయి కనపడుతోందా ?" అని ఆ మృగాల కేసి చూసి అతను "సీత యెక్కడ వుంది ?" అని అడిగి కళ్ళల్లో నీళ్ళు పెట్టుకున్నాడు.

రాముడిలా అడగ్గా ఆ మృగాలు వెంటనే లేచి ఆకాశం వైక మాటూ భూమి వైక మాటూ చొప్పున చూస్తూ రావణుడు సీత నే దిక్కుకి తీసుకుపోయాడో ఆ దిక్కుకి పరుగెత్తాయి. వాటి యింగితం కనిపెట్టి లక్ష్మణుడు "అన్నా, సీత యెక్కడ అని నువ్వడగ్గా ఈమృగాలు నేలా దక్షిణదిక్కు చూపిస్తున్నాయి. కనక, మనం ఆదిక్కుగా వెడదాం. అలా వెడితే మన కేదయినా వుపాయం అయినా తట్టుతుంది, సీత అయినా దొరుకుతుంది" అని చెప్పాడు. వెంటనే "అది బాగుంది" అంటూ రాముడు బయలుదేరాడు.

ఆఅన్నదమ్ము లిద్దరూ అదీ యిదీ మాట్లాడుకుంటూ కొంతదూరం వెళ్ళాటప్పటికీ, వారికి, దారిపొడుగునా పడివున్న పువ్వులు కనపడ్డాయి. అవి చూసి రాముడు "తమ్ముడూ ! ఈపువ్వులు నేను గుర్తుపట్టగలను. నేను సీతకు తెచ్చియిచ్చినవే యివి. ఇవి సీత తలలో ముడుచుకున్నవే సందేహం లేదు. సూర్యు డెండపెట్టకుండానూ, వాయువు ఎగరగొట్టకుండానూ, భూమి తనలో కలుపుకోకుండానూ యీపువ్వులు నాకు మేలుచెయ్యడాని కట్టేపెట్టారు అని చెప్పి ప్రస్రవణపర్వతం చూసి "ఓ పర్వతరాజా ? సర్వాంగసుందరి అయిన సీత నీకెక్కడ కనపడిందా ?" అని మొదట మెల్లిగా అడిగి, తరవాత సింహం క్షుద్రమృగాన్ని తర్జించేటట్టు తర్జిస్తూ "నీసానువు లన్నీ నేను నాశనం చెయ్యకముందే హేమాంగి అయిన నాసీతను నాకు చూపించు" అని గద్దించాడు. దీని మీాద పర్వతం యేదో చెప్పబోయినట్టు కనపడింది కాని సీతను మాత్రం చూపించలేదు. ఓపర్వతమా ! నేనంటే నీకు ల[illegible]ం లేదు

కాదూ? ఇదిగో నాబాణాగ్నితో తగులబడిపోయి నువ్వు భస్మం అయిపోతావు. గడ్డీ చెట్టూ చేమా లేకుండా అయిపోయి నువ్వు ఎవరికీ పనికిరానివాడ వయిపోతావు. లక్ష్మణా! నాసీత సంగతి చెప్పకపోతే యీనదినయినా యింకించేస్తాను" అని పరవళ్ళు తొక్కుతూ నిప్పులు కక్కుతూ చూడగా రామునకు భూమిమీద దక్షిణాభిముఖంగా వున్న రాక్షసుని పెద్దఅడుగుజాడ కనపడింది. రాక్షసుణ్ణి తప్పించుకుని రాముని దగ్గిరికి వెళ్ళి పోదా మని అటూయిటూ పరుగెత్తిన సీత అడుగులున్నూ కనపడ్డాయి. మళ్ళీ చూడగా ఆసమీపానే విరిగిపోయిన ధనుస్సూ, చెక్కలయిపోయిన అమ్ములపొదీ, ముక్కలయి కూలిపోయిన రథమూ కూడా కనపడ్డాయి.

అవి చూసి సంభ్రాంతహృదయు డయి రాముడు లక్ష్మణునితో "తమ్ముడూ! సీత ధరించిన ఆభరణాల బంగరుతునకలూ, పూలదండలముక్కలూ ఇవిగో చూడూ. కాల్చిన బంగారుగుండ్లలాగ రక్తపు చుక్కలు కూడా యిక్కడ వున్నాయి చూడూ. దీన్ని బట్టి రాక్షసులు సీతను ముక్కలుముక్కలుగా నరికేసయినా వుంటారు, తినేసయినా వుంటారు. సీతకోసం యిద్దరు రాక్షసు లిక్కడ యుద్ధంచేసి నట్టున్నూ తోస్తోంది. రత్నాలూ ముత్యాలూ పొదిగిన ధనుస్సిదిగో యెవనిదో ముక్కలయి పడిపోయింది. వైడూర్యమణులతో బాలసూర్యుడులా మెరుస్తున్న బంగారపు కవచం కూడా యిదిగో యెవనిదో బద్దలయి పడిపోయింది. నూరుకమ్ముల శ్వేతచ్ఛత్రమున్నూ యెవనిదో కామవిరిగిపడిపోయింది. ఆ, అవిగో చూడూ, బంగారపు కవచాలతో అలంకృతా లయి పిశాచాలవంటి కంచరగాడిదలున్నూ యెవనివో ముక్కలై పడిపోయాయి. మండుతున్న అగ్నిలాగ అదిగో యెవనిదో రథంకూడా విరిగిపడిపోయింది. రథం పోలుగర్ర అంతలేసి బాణా లవిగో పొడిపొడి అయి పడిపోయాయి. బాణాలతో నిండీ

వున్నాయి గాని యీఅమ్ములపొదులు బద్దలయిపోయాయి. ఒకచేత పగ్గాలూ వొకచేత కొరడా — వీడు సారథి, చచ్చి పడివున్నాడు. తలపాగాలూ కుండలాలూ వున్నవీళ్ళు చామరగ్రాహులు, కొనవూపిరి అయినా లేకుండా చచ్చిపోయారు. ఇదంతాచూడగా యీమార్గం యెవనిదో వొక రాక్షసుని దని నిశ్చయం. ఇప్పుడు తెలిసిందా? రాక్షసులతో నాకు ప్రాణాంతక మైన బద్ధవైరం యేర్పడింది. కఠినాత్ములూ కామరూపులూ అయిన క్రూరరాక్షసులు సీతను తీసుకుపోయారో, చంపేశారో, తినేశారో యేదో అయి వుంటుంది. ధర్మం అయినా సీతను రక్షించలేకపోయింది. సీతను రాక్షసులు తీసుకుపోవడమో, తినెయ్యడమో జరిగి వుంటే నాకు మేలు చెయ్యగల నాథు లెవరున్నారూ? తమ్ముడూ, త్రిలోకాలనూ సృజించినవాడు శూరు డయినా దయాపరు డయితే మాత్రం అందరూ అతన్ని అవమానిస్తా రన్నమాట కదూ? నేను లోకహితం కోరుతున్నందునా, జితేంద్రియుణ్ణయి నందునా, కాఠిన్యం కనపరచకుండా వున్నందునా, దయాపరుణ్ణయి నందునా దేవతలు నన్ను పిరికిపంద నని భావిస్తున్నారు. నాదగ్గిరవున్నందుకు గుణంకూడా దోషమే అయిపోయింది చూశావా? సూర్యు డుదయించి వెన్నెలను నాశనం చేస్తాడు. అలాగే రాక్షసుల నందరినీ సంహరించడానికి సుగుణా లన్నీ మూలకు నెట్టి నా తేజస్సు విజృంభిస్తుంది చూసుకో. యక్షులూ, గంధర్వులూ, పిశాచులూ, రాక్షసులూ, కిన్నరులూ, మనుష్యులూ కూడా యిక సుఖం యెలా వుంటుందో చూడరు. త్రిలోకసంచారులకు మార్గం లేకుండా ఆకాశం అంతా యిప్పుడు నాబాణాలతో నింపేస్తాను చూసుకో. ఇదిగో, గ్రహాలను ఆపేస్తాను. చంద్రుణ్ణి నిలబెట్టేస్తాను. అగ్నినీ, సూరుణ్ణీ తేజోరహితులను చేసేస్తాను. పర్వతశిఖరాలు పిండిపిండి చేసేస్తాను. జలాశయాలన్నీ యింకించేస్తాను. లతలూ, గుల్మాలూ ధ్వంసం చేసేస్తాను

సముద్రం అల్లకల్లోలం చేసేస్తాను. త్రిలోకాలనూ అంతం చేసేస్తాను. దేవతలు నాసీతను నాకిప్పుడు క్షేమంగాతీసుకువచ్చి అప్పగించకపోతే నాపరాక్రమం రుచి చూస్తారు. జగత్తంతా నాబాణాలతో యిప్పుడస్త వ్యస్తం అయిపోతుంది చూసుకో. సీతకోసం నేనిప్పుడు ఆకర్ణాంతమూ లాగి బాణాలు విడిచి ప్రపంచంలో పిశాచులూ రాక్షసులూ లేకుండా వుండేటట్టు చేసేస్తాను. ఎంతదూరం అయినా వెళ్ళి సర్వనాశనం చేసే నాబాణాలశక్తి దేవతలు చూస్తారు. దేవతలూ దైత్యులూ, పిశాచులూ, రాక్షసులూ నాక్రోధంవల్ల ముల్లోకాలలోనూ నామరూపాలు లేకుండా పోతారు. దేవదానవయక్షరాక్షసలోకా లన్నీ యిప్పుడు నాబాణాలతో స్వరూపనాశనం అయిపోతాయి. దొంగిలింపబడి వున్నా చంపబడివున్నా దేవతలు నాసీతను భద్రంగా తెచ్చి నాకివ్వకపోతే లోకాలన్నీ ముంచేస్తాను. ”

ఇలా అంటూ రోషతామ్రాక్షుడై ప్రళయాగ్నిలాగ మండి పడుతూ ధను స్సెక్కిపెట్టి క్రూరసర్పం వంటి బాణం తొడిగాడు. మరిన్నీ అతను “లక్ష్మణా! ఎటువంటివాళ్ళయినా రాజునీ, మృత్యువునూ, యముణ్ణీ, విధినీ, యెలా యెలా యెదిరించలేరో నివారించనూ లేరో క్రోధం వహించా నంటే నన్నూ అలాగే యెదరించలేరు, నివారించలేరు. మళ్ళీ చెబుతున్నాను. నేను బాణం విడవకముందే నాసీతను తెచ్చి నాకివ్వకపోతే జగత్తంతా నేను తల్లకిందులు చేసేస్తా ” నని కూడా అతను వురిమాడు.

## ౭౫

## లక్ష్మణుడు రాముణ్ణి శాంతింపచెయ్యడం

రాముని మహోగ్రరూపం చూశాటప్పటికి లక్ష్మణునికు నోరెండిపోయింది. చివరికెలాగో పిలుచేసుకుని అతను, దోసిలివొగ్గి “ అన్నా,

ఇంతవరకూ నువ్వు సౌమ్యుడవై, జితేంద్రియుడవై, సర్వభూతహితు డవై వుండి, హఠాత్తుగా యిప్పుడు విపరీతాలు తలపెట్టడం ధర్మమా? చంద్రునియందు శోభ వుంది. సూర్యునియందు వెలుగుంది. వాయువునందు చలనం వుంది. భూమియందు ఓర్పుంది. ఇదంతా స్థిరమైనది. నీలో యివే కాక గొప్పయశస్సున్నూ నియతంగా వుంది. ఒక్కని అపరాధంతో లోకం అంతా నాశనం చేస్తావా? ఇదెవసిదో యుద్ధంలో వాడే రథం. దీన్ని ఎవడు ఎందుకు భగ్నం చేశాడో నాకేమీ బోధపడడం లేదు. ఈ ప్రదేశం అంతా గుర్రపు డెక్కల తాకిడికి దుమ్ముదుమ్మయిపోయింది. తరవాత రక్తప్రవాహంతో తడిసిపోయింది. దీన్నిబట్టి యిక్కడ ఘోరయుద్ధం జరిగి వుండడం నిశ్చయం. ఒక్కడే యిక్కడ బలపరాక్రమాలు చూపించాడు. సేనగాని అథమం రెండోవాడు గాని వుండినట్టు కనపడదు. కనక, వొక్కనికోసం నువ్వు లోకాలన్నీ నాశనం చెయ్యడం ధర్మంకాదు. రాజు ప్రశాంతంగా ఎవని కెంత తగునో అంతే శిక్ష విధించాలిగదా? ఇతకీ: నువ్వు సర్వభూతాలకూ సర్వదా శరణ్యుడవు. నీకు కలిగిన భార్యావియోగం మంచిదని యెవడు చెప్పగలడు? యాగదీక్షితునకు సత్పురుషు లెవరూ విఘాతం కలిగించలేరు. అది చివరికి వారికే తగులుతుంది. అలాగే నీకున్నూ నదులూ, సముద్రాలూ, పర్వతాలూ, దేవతలూ, గంధర్వులూ కూడా అప్రియం చెయ్యలేరు. కనక, నువ్వు సీతను ఎవ డెత్తుకుపోయాడో వాణ్ణి వెతకడం మంచిది. ఇందులో ధనుష్పాణినై నేనూ, మహర్షులూ నీకు తోడ్పడతాం. సముద్రాలూ, పర్వతాలూ, అరణ్యాలూ, గుహలూ, నదులూ, సరోవరాలూ — సమస్తమూ మనం గాలించేద్దాం. నీభార్యను తీసుకుపోయినవాడు దొరికేదాకా దీక్షగా దేవగంధర్వలోకాలు కూడా వెతికేద్దాం. సామోపాయంతో దేవతలు నీభార్యను నీకు తెచ్చియివ్వక

పోతే అప్పుడు చెయ్యవలసింది చేస్తువుగాని. అప్పుడు స[illegible]లైన తీక్ష్ణబాణాలతో సర్వనాశం చేస్తువుగాని" అని [illegible] వేడుకున్నాడు.

## ౬౬

## కాళ్ళుపట్టుకుని లక్ష్మణుడు రాముణ్ణి ప్రార్థించడం

ఎంత చెప్పినా పరమ మోహితుడై విలపిస్తున్న రాముణ్ణి, నిమిషంలో పూజించి కాళ్ళు పట్టుకుని లక్ష్మణు డిలా చెప్పాడు. "అన్నయ్యా, గొప్ప తపస్సు చేసీ, గొప్ప గొప్ప పను లనేకాలు చేసీ దేవతలు అమృతం పడసినట్టు దశరథమహారాజు నిన్ను కన్నాడు. నీసుగుణాల యెడల బద్ధానురాగుడై నీతో వియోగం కలగడంవల్లనే మహారాజు స్వర్గస్థుడైనా డని భరతుడు చెప్పాడు. నువ్వే యిప్పటి యీదుఃఖం సహించకపోతే అల్పసత్వుడైన మనుష్యమాత్రు డెవడు దహించ గలడూ ? పురుషశార్దూలా ! ఈదుఃఖంతో నువ్వు లోకా లన్నీ సహిం చేసేటట్టయితే ఆర్తులైన జను లెక్కడికిపోగలరూ ? ఈదుఃఖం లోకస హజం. నహుషుని కొడుకైన యయాతి స్వర్గానికి వెళ్ళినన్నీ అక్కడ కూడా దుఃఖం అనుభవించలేదూ ? మహర్షీ, మన తండ్రికి పురోహి తుడూ అయిన వసిష్ఠుడు ఒక్కనాడే నూర్గురు పుత్రులను కన్నాడు. కాని మళ్ళీ వొక్కనాడే ఆనూర్గురుకొడుకులూ నాశం అయిపోలేదూ ? ఈజగత్తుల కన్నిటికీ తల్లి, లోకపూజ్యురాలు అయిన భూదేవికి కూడా కంపం కలుగుతూ వుంటుందికదా ? ధర్మస్వరూపులూ, లోకచక్షు స్సులూ, సర్వాధారులూ అయిన సూర్యచంద్రులు మహాబలవంతులు కూడా అయ్యుండినన్నీ గ్రహణపీడ అనుభవించడం లేదూ ? మహాభూ తాలూ, వేదాలూ కూడా దైవనిర్ణయం దాటలేరు. మహేంద్రుడు మొదలైన దేవతలకు కూడా సుఖంతో పాటు దుఃఖాలున్నూ కలు

గుతూ వుంటాయిగదా ? కనక, నువ్వు దుఃఖించవద్దు. అనఘా ! సీత చనిపోయిందే అనుకో. అథవా, ఆమెని ఎవడో తీసుకుపోయాడే అనుకో. అయినా, ప్రాకృతుడు లాగ నువ్వు దుఃఖించడం తగదు. నీవంటి సత్యసంధులూ, వివేకమహితులూ, యెలాంటి కష్టాలు వచ్చినా దుఃఖించరు. స్వబుద్ధితో నువ్వు తత్వం తెలుసుకో. బుద్ధిమంతు లైన మహాప్రాజ్ఞులు రాబోయే శుభాశుభాలు తెలుసుకుంటారు. పూర్వ జన్మలో ఎవరేం చేసుకున్నారో తెలియడం శక్యం కాదు; కాని యిప్పుడు ఆకర్మలకు తగిన ఫలాలే కలుగుతాయి. రామా ! వెనక నువ్వే నాకీ సంగతు లన్నీ బోధించావు. బృహస్పతి అయినా నీకు బోధించలేడు. నీబుద్ధి యెంతటిదో దేవతలు కూడా తెలుసుకోలేరు. అలాంటి నీబుద్ధి యిప్పుడు దుఃఖసంఛన్నం అయిపోయి వుంది. నేను దాన్ని ప్రబోధిస్తున్నాను. గాని మరేమీ లేదు. స్వర్గలోకంలోని దేవగంధర్వాదులూ, భూలోకంలోని బ్రాహ్మణక్షత్రియాదులూ కూడా అవధ్యులు. అది చూసుకో. నీపరాక్రమం అపారం. అది గుర్తించుకో. కనక, శత్రువును మాత్రమే సంహరించడానికి నువ్వు ప్రయత్నించు. సర్వనాశం ధర్మం కాదు. ఆశత్రు వెవడో తెలుసుకుని వాణ్ణి మాత్రమే నాశనం చెయ్యి.

## ౬౭

## రాముడు జటాయువును చూడడం

రాముడు తాను పెద్దవాడే అయినా గుణగ్రహణపారీణుడు కనక, యుక్తియుక్తంగా లక్ష్మణుడు చెప్పింది బాగా గ్రహించాడు. వెంటనే కోపం, నిగ్రహించుకుని ధనుస్సు నానుకునుంచుని “తమ్ముడూ ! మన మిప్పు డేమిటీ చెయ్యడం ? ఎక్కడికీ వెళ్ళడం ? ఏంచేస్తే మనకి సీత

కనపడుతుందీ?" అని అడిగాడు. అందుకు లక్ష్మణుడు "ఈజన స్థానమే మనం వెతకాలి. చెట్లూ చేమలూ ఇక్కడ విశేషంగా వున్నాయి. రాక్షసులు లెక్కలేనంతమంది వున్నారు. ఇక్కడ గిరిదుర్గాలూ, గిరికందరాలూ, గుహలూ అనేకా లున్నాయి. క్రూర మృగసంకులా లైన స్థలాలున్నూ చాలా వున్నాయి. కిన్నరుల వసతులూ, గంధర్వుల వునికిపట్టులూ కూడా యెన్నో వున్నాయి. అవన్నీ మనం వెతకాలి. బుద్ధిమంతు లైన నీవంటి మహాత్ములు ఆపదలు వచ్చినప్పుడు, గాలి యెంతవడిగా విసిరినా పర్వతాలు కదల నట్టు చలించకుండా వుండాలి" అని చెప్పాడు.

దీనిమీద ధనుస్సు ఎక్కుపెట్టి బాణంతొడిగివుండి లక్ష్మణునితో రాముడు ఆవనం అంతా తిరిగాడు. ఇంకా యింకా తిరగడంలో చూసిన చోటికే రావడం తటస్థించి, రక్తంతో తడసి ముద్దఅయి నేల మీద పడిపోయి వున్న జటాయువు కనపడ్డాడు. పర్వతశిఖరంలా వున్న ఆజటాయువును చూసి రాముడు లక్ష్మణునితో "సీతను వీడే తినేశాడు. వీడు రాక్షసుడు. గద్దగూపంతో వచ్చి సీతని తినేసి సుఖంగావున్నాడు. వీణ్ణి సంహరించేస్తాను చూడు" అంటూ భూమి వణికిస్తూ మళ్ళీ శరసంధానం చేశాడు. అప్పుడు నురగలతో రక్తం కక్కుకుంటున్న జటాయువు దీనుడై న రాముణ్ణి పిలిచి "చిరంజీవీ! ఈమహారణ్యంలో ఓషధిని వెతుకుతున్నట్టు నువ్వెవర్ని వెతుకు తున్నావో ఆసీతనూ నాప్రాణాలనూ రావణుడు హరించాడు. నువ్వూ లక్ష్మణుడూ కూడా లేకుండా చూసి రావణుడు సీత నెత్తుకుపోవడం నేనుచూశాను. వెంటనే నేనడ్డుకుని యుద్ధంచేసి రథంతోపాటు రావణుణ్ణి నేలమీద పడగొట్టాను. ఇదిగో యిదే వాడిధనుస్సు విరిగిపోయివుంది చూసుకో. ముక్కలయిపోయిన వాని శరాలూ, కుప్పగా కూలిపోయిన వాని యుద్ధరథమూ యివిగో చూసుకో,

నా రెక్కలతో కొట్టి చంపేశాను వాని సారథి యిడిగో. కొంతసేపటికి నే నలసిపోయాను. అప్పుడు రావణుడు నా రెక్కలు తెగనరికి సీతను తీసుకుని ఎగిరి ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు. రాక్షసుడే నన్ను చంపివుండగా నువ్వు మళ్ళీ చంపడం ధర్మం కాదు" అని దీనంగా చెప్పాడు.

అప్పుడు రాముడు సీతకు సంబంధించిన ఆకథ అంతా విని మరింత దుఃఖార్తుడై ధనుస్సు విడిచిపెట్టేసి జటాయువును కౌగిలించుకుని నేల మీద పడిపోయి చాలా యేడ్చాడు. లక్ష్మణుడున్నూ యేడ్చాడు. మరిన్ని రాముడు, జటాయువు, దుర్గమస్థలంలో పడిపోయి ఆయాస పడుతూ వుండడంచూసి "తమ్ముడూ! రాజ్యం పోయింది. వనవాసం తటస్థించింది. సీత దొంగలించబడ్డది. పూజ్యుడు జటాయువు ఇలా అయిపోయాడు. నాదౌర్భాగ్యం యిలా వుంది. ఇది అగ్నిని కూడా దహించేస్తుంది. నేనిప్పుడు అభ్రంకష మైన సముద్రంలో పడిపోతా ననుకో, కాని నాదౌర్భాగ్యంవల్ల అదికూడా యెండిపోతుంది. ఈచరాచరప్రపంచంలో నాకంటే అభాగ్యతరుడు మరొకడుండడు. నాదౌర్భాగ్యంవల్లనే నాయనగారి స్నేహితుడైన ఈగృధ్రరాజు ఇలాగ హతుడై నేలమీద పడిపోయివున్నాడు" అని మిక్కిలీ వగుస్తూ పితృస్నేహం కనపరుస్తూ జటాయువును స్పృశించాడు. ఇలాగ స్పృశించి రాముడు "ప్రాణసమానురాలైన నాసీత యేదీ?" అని వాపోతూ దుఃఖాతిరేకంతో భూమిమీద పడిపోయాడు.

## ౬౮

## రాముడు జటాయువునకు అగ్నిసంస్కారం చెయ్యడం

రాముడు జటాయువును చూస్తూ లక్ష్మణునితో "తమ్ముడూ! జటాయువు నాకోసం రావణునితో యుద్ధంచేసి విడువ[illegible] ప్రాణాలు

విడిచిపెడుతున్నాడు. ఇప్పటికీ యితని శరీరంలో ప్రాణా లున్నాయి, కాని మాట పడిపోతోంది. చైతన్యం తగ్గిపోతోంది. "జటాయువూ! మాట్లాడ్డాని కేమాత్రం శక్తి వుండినా నాకు సీత సంగతి చెప్పు. నిన్నెలా కొట్టాడో వాడు, అది కూడా చెప్పు. రావణుడు సీత నెందుకు తీసుకుపోయాడూ? తనకి నేనేమి అపరాధం చేశా నని వాడా పనిచేశాడూ? ఆసమయాన సీత మొగం యెలావుందీ? అప్పు డామె యేమి చెప్పిందీ? రావణు డేపాటి బలశాలీ? ఎలావుంటాడూ? ఏమిచేస్తూ వుంటాడూ? వాని నివాసం యెక్కడ? ఇదంతా నాకు చెప్పు" అని అడిగాడు.

అప్పుడు ఆయాసపడుతూ జటాయువు హీనస్వరంతో "గాలీ మబ్బూ కలిసిన మాయచేసి రావణుడు సీతనెత్తుకుని ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు. నేనలసిపోగా, నారెక్కలు నరికేసి సీత నెత్తుకుని దక్షిణంగా వెళ్ళిపోయాడు. నాయనా! నాప్రాణాలు కడంటు తున్నాయి. నాదృష్టి తగ్గిపోతోంది. నాకిప్పుడు వట్టివేళ్ళ ఆకులుగా బంగారపువృక్షాలు కనపడుతున్నాయి. ఏముహూర్తాన రావణుడు సీతనెత్తుకుపోయాడో ఆముహూర్తం చాలా మంచిది. ఆముహూ ర్తాన ఏది పోయినా మళ్ళీ వెంటనే దొరుకుతుంది. దానిపేరు "విందం"; కాని రావణు డీసంగతి యెరగడు. . నీభార్యను తీసుకు పోయిన రావణుడు గాలం మింగిన చేపలాగ త్వరగానే నశించిపోతాడు. కనక, నువ్వు సీతకోసం దుఃఖించవద్దు. రావణుణ్ణి చంపేసి కొద్దికాలం లోనే నువ్వు సీతతో సుఖపడతావు" అని యింతవరకూ తెలివిగానే చెప్పాడు; కాని అప్పుడు మాంసంతో కూడా అతను రక్తం కక్కు కున్నాడు. అయినా "విశ్రవసుని కొడుకు. సాక్షాత్తూ కుబేరుని భ్రాత" అని పలుకుతూనే ప్రాణాలు విడిచిపెట్టాడు. "ఇంకా చెప్పు, చెప్పు" అంటూ దోసిలి వొగ్గి రాముడు బతిమాలుతూనే వున్నాడు; గాని

అప్పటి కప్పుడే జటాయువు ప్రాణా లెగిరిపోయాయి. నేలమీద తల వాల్చుకుని, కాళ్ళు నిగడతన్నుకుని, కొట్టుకొ్ట్టుకుని జటాయువు చచ్చిపడిపోయాడు.

అదిచూసి మిక్కిలీ దుఃఖిస్తూ రాముడు "తమ్ముడూ, రాక్షసావాస మైన యీదండకారణ్యంలో బహుసంవత్సరాలు సుఖంగా వుండిన యీజటాయువు కాలధర్మం పొందాడు. అనేకవేల సంవత్సరాల వయస్సు గల యితను ఇప్పుడు చనిపోయాడు. ఎలాంటి వాళ్ళకీ కూడా కాలం దాటరానిదిగదా? లక్ష్మణా? ఈపక్షిరాజు నాకు చాలా వుపకారం చేశాడు. పాపం, సీతకోసం పోరి రావణునిచేతిలో చనిపోయా డితను. పితృపితామహంగా వచ్చిన గృధ్రరాజ్యం విడిచిపెట్టి యితను నామూలాన ప్రాణాలు విడిచేపెట్టాడు. ఆహా! మృగపక్షిజాతుల్లో కూడా సాధువులూ, ధర్మాత్ములూ, శూరులూ, శరణ్యులూ కనపడుతున్నారు చూశావా? సీతాపహరణంవల్ల కలిగిన దుఃఖంకంటే నాకీ జటాయువు నాకోసం చనిపోవడంవల్ల యెక్కువ దుఃఖంగా వుంది. దశరథమహారాజులాగే, నాకు ఈజటాయువున్నూ పూజ్యుడూ మాన్యుడూనూ, కనక, లక్ష్మణా కట్టెలు తీసుకురా. అగ్ని మథించి నాకోసం చనిపోయిన ఈగృధ్రరాజునకు దహన సంస్కారం చేస్తాను. దుర్మార్గుడైన రావణునిచేతిలో దెబ్బతిని చనిపోయిన యీపతగనాథుణ్ణి చితిమీద పెట్టి అగ్నిసంస్కారం చేస్తాను. ఓజటాయూ, గృధ్రరాజా! మహాత్మా! నువ్వు నాచేత అగ్నిసంస్కారం పొంది, యజ్ఞం చేసినవా రేలోకాలకు వెడతారో, తపోధను లేలోకాలకు వెడతారో, సన్యాసు లేలోకాలకు వెడతారో, భూదానం చేసినవా రేలోకాలకు వెడతారో, నేను ఆజ్ఞాపిస్తున్నాను: నీకు ఆలోకాలే లభిస్తాయి వెళ్ళిపో."

ఇలా చెప్పి రాముడు జటాయువును చితిమీద వుంచి అగ్ని ముట్టించాడు. అప్పుడు రాముడు తన ఆత్మ బంధువునకు అగ్నిసంస్కారం చేస్తున్నట్టే మిక్కిలీ దుఃఖించాడు. మరిన్నీ, అతను లక్ష్మణునితో కూడా అడవికి వెళ్ళి పెద్దపెద్ద మహారోహి అనే మృగాలను చంపితెచ్చి మాంసంతీసి పచ్చికపట్టున దర్భలు పరిచి వాటిమీద జటాయువునకు ఆమాంసంతో యథావిధిగా పిండప్రదానం చేశాడు. చచ్చిపోయిన వానికి స్వర్గం లభించడానికి బ్రాహ్మణులు లేమంత్రం జపిస్తారో అప్పుడు రాముడు జటాయువునిమిత్తం ఆపైతృకమంత్రం జపించాడు. తరవాత రామలక్ష్మణు లిద్దరూ గోదావరికి వెళ్ళి స్నానం చేసి యథావిధిగా తర్పణం చేశారు. దీంతో జటాయువు స్వర్గానికి వెళ్ళిపోయాడు. విష్ణుమహేంద్రులవంటి రామలక్ష్మణులు మళ్ళీ సీత కోసం బయలుదేరారు.

## ౬౯

## రామలక్ష్మణులు కబంధుణ్ణి కలుసుకోవడం

ఇలాగ జటాయువునకు తర్పణంచేసి రామలక్ష్మణులు సీతను వెతుక్కుంటూ కొంతవరకూ పశ్చిమంగా వెళ్ళి అక్కణ్ణుంచి మళ్ళీ దక్షిణంగా మళ్ళి తీగలతోనూ పొదలతోనూ చెట్లతోనూ నిండి దుర్గంలావున్న దారిలో ప్రవేశించారు. అక్కడ భయంకరాలైన సింహాలూ, క్రూరసర్పాలూ అనేకాలున్నాయి. అది తెలిసి వారు మిక్కిలీ వడిగా అది దాటిపోయారు. తరవాత వారు జనస్థానం దాటి మూడుకోసులు వెళ్ళాక గహనమైన క్రౌంచారణ్యం ప్రవేశించారు. అది రకరకాల మేఘా లొకచోట గుంపుకూడినట్టుంది. అక్కడ రకరకాల పూలచెట్లు విరగపూసివున్నాయి. చిత్రవిచిత్రాలైన పిట్టలూ, సల్లతాచులూ, సింహాలూ, పులులూ, ఎలుగుబంట్లూ, లేళ్ళూ, దుప్పులూ,

జింకలూ అసంఖ్యాకంగా వున్నాయి. అక్కడక్కడ ఆగుతూ సీతను వెతుకుతూ వా రావనం అంతా తిరిగారు.

అక్కణ్ణుంచి తూర్పుగా బయలుదేరి మూడుకోసులు నడిచి క్రౌంచారణ్యం దాటి మతంగాశ్రమం సమీపించారు. ఆప్రాంతంలో అరణ్యం మహాభయంకరంగా వుంది. క్రూరమృగా లక్కడ వేలూ లక్షలూ వున్నాయి. చెట్లు అడుగుపెట్టడానికి వీలులేనట్టు అలుముకుపోయివున్నాయి. అక్కడ వొక గుహ వుంది. అది పాతాళంలాగ లోతుగానూ చిమ్మచీకటిగానూ వుంది. దానిదగ్గిరగా వారికొక రాక్షసస్త్రీ కనిపించింది. అది బుట్టబొమ్మలాగా దాని నోరు వికృతంగానూ వుంది. సామాన్యులు దాన్ని చూస్తే అడలి బేజారయిపోతారు. బానంతకడుపూ, గునపాల్లాగ కోరలూ, చెట్టుపట్టలాగ చర్మమూ దానికి మరింత వికృతరూపం కలిగించాయి. ఈతరుప్పలాగ జుట్టు విరబోసుకుని ఏదో జంతువును చంపి అది పచ్చిమాంసం తింటోంది.

అన్నదమ్ములిద్దరూ దాన్ని చూశారు. చూసీచూడగానే అది ముందు నడుస్తున్న లక్ష్మణుణ్ణి "మనం మదనక్రీడల్లో మునిగి తేలదాం రా" అంటూ చెయ్యిపట్టుకుని లాగింది. లక్ష్మణుణ్ణి గట్టిగా కౌగిలించుకుని "నాపేరు అయోముఖి. నేను నీకు దొరికాను. నువ్వు నాకు ప్రియుడవైనావు. కనక, నాథా, పర్వతఘాట్లల్లోనూ, యేటి యిసకతిప్పలమీదా మదనక్రీడల్లో తేలుతూ బతికివున్నంతకాలమూ మనం సకలసుఖాలూ అనుభవింతాం" అని కూడా చెప్పింది.

అదివిని మండిపడి లక్ష్మణుడు కత్తిదూసి వెంటనే దాని ముక్కూ చెవులూ స్తనాలూ కోసేశాడు. దాంతో అది అడవి అంతా దద్దరిల్లి పోయేటట్టు బొబ్బలుపెడుతూ ఎలా వచ్చిందో అలా పారిపోయింది. అదలా పారిపోగానే రామలక్ష్మణులు మళ్ళీ కీకారణ్యంలో

ముందుకుసాగారు; కాని వారి కనేకదుశ్శకునాలు కనపడ్డాయి. అవి చూసి మహాతేజశ్శాలీ, బలపరాక్రమవంతుడూ, శుచీ శీలవంతుడూ అయిన లక్ష్మణుడు రామునితో "అన్నా! దృఢమైన నాబాహువు అదురుతోంది. మనస్సులో దిగులుపుడుతోంది. ఇంకా దుర్ని మిత్తాలెన్నో కనపడుతున్నాయి. కనక నువ్వు సిద్ధంగా వుండు. నామాట విను. ఇప్పటికిప్పుడే ఏదో మూడుతుం దని నాకు గట్టిగా తోస్తోంది. కాని, అతిక్రూరమైన యీవంజుళకపక్షి యుద్ధంలో మనకు జయంకలుగుతుందన్నట్టే కూస్తోంది." అని చెప్పాడు.

అత నిలా చెబుతూ వుండగానే పెద్దగాలి వచ్చి ఆవనం అంతా అల్లకల్లోలం అయిపోతున్నట్టు దారుణమైన ధ్వని వినవచ్చింది. ఆకాశం అంతా గాలితో బూరటిల్లినట్టు కూడా వుంది ఆధ్వని. వారిద్దరూ ఈధ్వని యేమిటా అని చూస్తుండగా వొకపొదలో మహాకాయుడూ, విపులోరస్కుడూ అయిన రాక్షసుడు కనపడ్డాడు. వాడు పొదముందు కూచునివున్నాడు. వాడికి తలా మెడా కూడా లేవు. మొగం కడుపుమీాద వుంది. సూదుల్లాంటి రోమాలతో నల్లగా మహాపర్వతం లా వున్నాడు. వాని మాట ఉరుములా వుంది. వానికొొక్కటే కన్ను. అది నొసట వుంది. అయినా మొగం కడుపుమీాద వుండడం వల్ల ఆకన్నుగూడా కడుపుమీాదే వున్నట్టుంది. పైగా ఆకన్ను పెద్దపెద్ద రెప్పలతోనూ, విశాలంగానూ, పింగళవర్ణంగానూ, అగ్గిగుండంలాగ మండుతున్నట్టూ భయంకరంగా వుంది. దానిచూపు అతివేగంగా ఎంతదూరం అయినా ఆనుతుంది. వాడు ఏదో నాకుతున్నట్టు నాలుక చాస్తూ ముడుస్తూ వున్నాడు. సింహాదులను చంపి మాంసం కూడా తింటున్నాడు. వాడిచేతులు ఆమడపొడుగున్నాయి. వాటిని అలాగా యిలాగా చాపుతున్నాడు. ఆచేతులతోనే వాడు ఉన్నచోట వుండే ఎంత

దూరాన వున్న మృగాల నయినా పిట్టల నయినా పట్టుకుని తినెయ్య గలడు. దారి కడ్డంగా కూచునివున్నాడు.

రామలక్ష్మణులకు కోసుదూరాన వుండగానే వాడు కనపడ్డాడు. చూసీచూడగానే వాడున్నూ చేతులుచాపి రామలక్ష్మణులు నిద్దర్నీ వొక్కమాటే పట్టుకుని తనదగ్గిరికి తీసుకున్నాడు. చేతుల్లో ధనుస్సులున్నా బాణాలున్నా ఖడ్గాలున్నా స్వయంగా తాము మహాబలవంతులే అయినా కబంధుడు వొడిసిపట్టుకుని లాగుతూవుంటే వారేమీ చెయ్యలేక, పై పెచ్చు తెల్లపోయారు; కాని మహాశూరుడు కనక రాముడు ధైర్యం వహించి అంతలో తేరుకున్నాడు. కుర్రతనం వల్ల లక్ష్మణుడు మాత్రం విషణ్ణుడై "అన్నా, నేను రాక్షసునిచేతిలో చిక్కుకున్నాను చూడూ. వీడు నన్ను చంపేస్తే, చంపెయ్యనిచ్చి నువ్వు మాత్రం తప్పించుకో. నన్ను భూతబలి యిచ్చి చేతనైనంత వడిగా నువ్వు పారిపో. తరవాత నువ్వు త్వరగానే సీతను కనుక్కోగలవు, సందేహం లేదు. చివరికి నువ్వు అయోధ్యకు వెళ్ళి తండ్రితాతల క్రమంగా లభ్యపడ్డ రాజ్యం పాలించుకునేటప్పుడు మాత్రం నన్ను జ్ఞాపకంచేసుకుంటూ వుండు" అని చెప్పాడు.

దానికి రాముడు "తమ్ముడూ, భయపడకు. నీవంటివాడు విచారించకూడదు" అని ధైర్యం చెప్పాడు; కాని యీలోపునే కబంధుడు గట్టిగా అరుస్తూ ఎవరు మీరు ధనుర్బాణాలూ ఖడ్గాలూ ధరించి నాకు ఆహారంగా వచ్చారు? ఇది చాలా భయంకర మైన ప్రదేశం. ఇక్కడ మీ కేమిపని? ఎందుకోసం వచ్చారు? నాకు చాలా ఆకలిగా వుంది. కత్తులతోనూ ధనుస్సులతోనూ మీరు కొమ్ములుగల గిత్తల్లా వున్నారు. మీ కిక బతకడం వొట్టిది" అన్నాడు.

అది విని రాముడు మొగం మెండిపోగా లక్ష్మణుణ్ణి చూసి "సత్య పరాక్రమా! కష్టంమీద కష్టం వచ్చి, చివరికి మనం సీతని చూడకుండానే చచ్చిపోయే యోగం వచ్చింది. ఎలాంటివాళ్ళూ కూడా కాలాన్ని జయించలేరు. నువ్వూ నేనూ కూడా వొక్కమాటే దుఃఖంతో ముగ్ధులం అయిపోయాము చూడూ. ఎంతటి శూరు లయినా, ఎంతటి బలవంతు లయినా, ఎంతటి కృతాస్త్రు లయినా, ఎన్ని యుద్ధాల్లో జయించిన వాళ్ళయినా కాలం ఆసన్నం అయితే ఇసకతో కట్టిన కట్టల్లాగ కూలిపోతారు" అని చెప్పి లక్ష్మణుణ్ణి చూసి ధైర్యం వహించాడు.

## ౭౦

## రామలక్ష్మణులు కబంధుని జబ్బలు నరకడం

అప్పుడు కబంధుడు రామలక్ష్మణులను చూసి "క్షత్రియకుమారులారా! నన్ను చూస్తూ నుంచుంటే యేమిలాభమూ? నేనిప్పుడే చాలా ఆకలిగా వున్నాను. దేవుడు మిమ్మల్ని నాకు ఆహారంగా పంపించాడు" అన్నాడు కరుగ్గా. అది విని లక్ష్మణుడు ఆర్తుడై వుండీన్నీ ధైర్యం తెచ్చుకుని అప్పటికి తగ్గట్టుగా "అన్నా నిన్నూ నన్నూ రాక్షసుడు తినెయ్యడానికి ముందే మనం కత్తులతో వీడి చేతులు తెగగొట్టేదాం" అన్నాడు. "మహాకాయుడైన యీ రాక్షసుడు భుజవిక్రమంవల్ల చాలా క్రూరుడై వున్నాడు. లోకం అంతా వశంచేసుకుని నిన్నూ నన్నూ చంపా లని చూస్తున్నాడు. నిశ్చేష్టులను సంహారించగూడదు; గాని యిలాంటివాళ్ళని దయతలచగూడదు" అనిన్నీ తొందరపెట్టాడు. ఇది విని కబంధుడు మిక్కిలీ క్రుద్ధుడై రౌద్రమూర్తి అయి నోరు తెరచి వారిని మింగబోయాడు. అది గుర్తించి రామలక్ష్మణులు కత్తులతో వాడిచేతులు జబ్బల్లోకి నరికేశారు, అందులోనూ కుడిచెయ్యి రాముడూ

ఎడమచెయ్యి లక్ష్మణుడూ నరికారు. దాంతో కబంధుడు భూమీ ఆకాశమూ, దిక్కులూ బద్దలయిపోయేటట్టు అరుస్తూ పడిపోయాడు. తన చేతులు తెగిపడిపోడమూ కొండవాగుల్లాగ జబ్బల్లో నుంచి రక్తం కారుతూ వుండడమూ చూసి వాడు పరమదీనుడై "మీరెవరయ్యా?" అని అడిగాడు.

అందుకు లక్ష్మణుడు "ఇతను ఇక్ష్వాకువంశాలంకారం. నేనితని తమ్ముణ్ణి. ఇతని పేరు రాముడూ నా పేరు లక్ష్మణుడూనూ. ఇతను విజనమైన మహారణ్యంలో నివసిస్తూ వుండగా వొక రాక్షసుడు ఇతని భార్యనెత్తుకుపోయాడు. ఆమెని వెతుకుతూ మేమిలా వచ్చాము. మరి నువ్వెవరవు? మొండెం లాగ యిక్కడెందుకు పడివున్నావూ? కడుపు మీద నోరూ నువ్వూ—నీసంగతి యేమిటీ!" అని యెదురడిగాడు. అందుకు కబంధుడు పరమప్రీతుడై ఇంద్రుని మాటలు జ్ఞాపకం చేసుకుంటూ "నరోత్తములారా! మీకు స్వాగతం. నాపుణ్యవశాన మిమ్మల్ని చూశాను. నాఅదృష్టంవల్ల నే మీరు నాయీచేతులు నరికేశారు. నాఅవినయం వల్ల నాకీ వికృతరూపం కలిగింది. ఆకథ అంతా చెబుతా వినండి" అంటూ ప్రారంభించాడు.

## ౭౧

## కబంధుడు తన వృత్తాంతం చెప్పడం

"రామా, వెనకటికి నేను చాలా చక్కనివాణ్ణి. నాచక్కదనం ముల్లోకాల్లోనూ బాగా ప్రసిద్ధిపొందింది. నేను సూర్యుడులాగా, చంద్రుడులాగా మెరిసి పోయేవాణ్ణి. అలాంటి నేను ఇప్పటి యీఘోరరూపం ధరించి అడవుల్లో తిరుగుతూ మునీశ్వరులను చాలా బాధపెడుతూ వుండేవాణ్ణి. ఒకప్పుడు నేను స్థూలశిరుడనే మునిమీద పడ్డాను. పాపం

అతను కందమూల ఫలాల కోసం అడవిలోకి వచ్చాడు. నేనీ రూపంతో వెళ్ళి అప్పు డతణ్ణి చాలా బాధించాను. అందు కతను మిక్కిలీ క్రుద్ధుడై "తుచ్ఛుడా, లోకగర్హిత మైన యీరూపమే నీకు స్థిరపడాలి" అని ఘోరంగా శపించాడు. అప్పుడు నే నతణ్ణి శాపాంతం అనుగ్రహించ మని కాళ్ళా వేళ్ళా పడి బతిమాలాను. "నిర్జనా రణ్యంలో రాముడు నీచేతులు తెగ్గొట్టి నీ కెప్పుడు అగ్నిసంస్కారం చేస్తాడో అప్పుడు నీనిజరూపం నీకు వస్తుం దని దయార్ద్రహృదయుడై అత నన్నుగ్రహించాడు. నేను దనువు కుమారుణ్ణి. ఇప్పటి యీకబంధ రూపం నాకు యుద్ధంలో యింద్రుని వల్ల సంభవించింది. నేను మహోగ్ర మైన తపస్సు చేసి సంతోష పెట్టగా బ్రహ్మదేవుడు నాకు దీర్ఘాయుర్దాయం యిచ్చాడు. దాంతో నాకు గర్వం వచ్చింది. "మనకి దీర్ఘాయు వుందకదా యిక యింద్రుడు మనల్ని ఏమిచెయ్యగలడూ?" అని భావించి యింద్రు ణ్ణెదిరించాను. అప్పుడు ఇంద్రుడు నామీద వజ్రాయుధం ప్రయోగించాడు. దాంతో నాకళ్ళూ నాతలా నాశరీరంలో దూరిపోయాయి. "నన్ను చంపెయ్య మని అనేకవిధాల ప్రార్థించాను. కాని ఇంద్రుడు "బ్రహ్మవరం చెల్లవలసిందే" అని చెబుతూ నన్ను చంపకుండా విడిచిపెట్టాడు. "అయితే, కాళ్లు లేక తల లేక నోరులేక ఆహారం పుచ్చుకోడానికి లేదుకదా, యిక నేను ఎలాగ బతకడం?" అని అడగ్గా ఇంద్రుడు నాకు ఆమడపొడుగుచేతు లిచ్చాడు. నాకడుపు మీదికి మొగం వచ్చేటట్టు చేశాడు. ఈకోరలున్నూ కల్పించాడు. అప్పణ్ణుంచీ నేనిచేతులు చాపి సింహాదిమృగాలను లాక్కుని తిని బతుకు తున్నాను. ఇంతే కాక, ఇంద్రుడు "రాముడు నీచేతులెప్పుడు తెగ నరుకుతాడో అప్పుడు నువ్వు స్వర్గానికి వస్తా" వనిన్నీ అనుగ్రహించాడు. ఈశరీరంతో నాకేది కనపడితే అదే తినేస్తున్నాను. ఇది తిన వచ్చును, ఇది తినగూడదు" అని నాకు సందేహమేమీ కలగడంలేదు.

"రాముడు తప్పకుండా వస్తా" డన్న నమ్మకంతో నేనెలాగో దేహం రక్షించుకుంటూ వస్తున్నాను. ఆరాముడవే నువ్విప్పు డిలా వచ్చావు. మరొకడు నన్ను చంపలేడు. ఇది సత్యం. ఆ మహర్షి చెప్పిన మాట యిది. మీ రిద్దరూ నాకిప్పు డగ్నిసంస్కారం చేస్తిరట్టాయనా నేను మీకుమంచి ఆలోచన చెబుతాను. మీకు తగ్గ మిత్రుణ్ణి కూడా చెబుతాను."

రాము డిది విని, లక్ష్మణుడు వింటుండగా కబంధునితో "రావణుడు యశస్విని అయిన నాభార్య సీత నెత్తుకుపోయాడు. ఇది జనస్థానంలో నేనూ నాతమ్ముడూ ఆశ్రమంలో లేనప్పుడు జరిగింది. అయితే, నేనా రాక్షసుని పేరుమాత్రం విన్నాను. వాడి రూపం యెలాంటిదో, వాడి నివాసం యెక్కడో, వాడి శక్తి యేమిటో మాకేమీ తెలి యదు. శోకార్తులమూ, అనాథులమూ, ఇలాంటి ఆపత్తులో పడి పోయిన వాళ్ళమూ మమ్మల్ని నువ్వు అనుగ్రహించడం ధర్మం. మాకుపకారం చెయ్యడమున్నూ నీకు న్యాయం. ఏనుగులు పడగొట్టిన ఎండుచెట్లు నరికి తెచ్చి పెద్దగొయ్యి తవ్వి నిన్ను అందులో దహనం చేస్తాము, సందేహం వద్దు. కనక, సీతను తీసుకుపోయినవా డెవడో చెప్పు. సీతను వాడు చంపేసి వుంటే అదే చెప్పు. నీకు తెలిసివుంటే అంతా చెప్పి నాకు మహోపకారం చెయ్యి" అని అడిగాడు.

దీనికి బదులుగా వాగ్మి అయిన దనువు (కబంధుడు) "రామా, నాకు దివ్యజ్ఞానం లేదు. నేను సీత నెరగను. నువ్వు నన్ను దహనం చేస్తే నిజరూపం పొందాక ఆమె సంగతి తెలిసినవాణ్ణి మాత్రం నీకు చెబుతాను. నన్ను దహనం చేస్తేగాని ఆసంగతి చెప్పడానికి నాకు శక్తి రాదు. శాపంతో యీవికృతరూపం వచ్చినప్పుడే నావిజ్ఞానం నశించిపోయింది. కనక సూర్యాస్తమయం కాకముందే నన్ను

గోతిలో దహనంచెయ్యి. నన్ను నువ్వు న్యాయంగా దగ్ధం చేస్తే సీత సంగతి తెలిసినవాణ్ణి నీకు తప్పకుండా చెబుతాను. అతనితో నువ్వు న్యాయంగా స్నేహంచెయ్యాలి. అతను మహా పరాక్రమవంతుడు. నీకతను కావలసిన సాయం అంతాచేస్తాడు. అతనికి తెలియనిది ముల్లోకాలలోనూ లేదు. కారణాంతరంవల్ల వెనకటి కొకమాటు అతను సర్వలోకాలూ చూసివున్నాడు. ” అని చెప్పాడు.

## ౭౨

## రామునకు కబంధుడు సుగ్రీవుని సంగతి చెప్పడం

రామలక్ష్మణులు ఒక పర్వతం కలుగులో చితిపేర్చి కబంధునకు అగ్ని సంస్కారం చేశారు. లక్ష్మణుడు బాగా అంటుకొన్న కొరువులు తీసి నాలుగుమూలలా బాగా అంటించాడు. కబంధుని శరీరం పెద్దనేతి ముద్దలా వుంది. అంచేత అగ్ని దాన్ని తొరగా దహించిలేకపోయాడు. కబంధు డప్పుడు స్వచ్ఛవస్త్రాలూ దివ్యమాలికలూ ధరించి చితిని తోసేసి చక్కావచ్చాడు. సకలభూషణాలూ ధరించి కబంధుడు చితివెలుగున మిలమిల మెరిసిపోయాడు. మరిన్నీ అతను హంసలున్న విమానం మెక్కి దివ్యతేజస్సుతో దిక్కులు వెలిగిస్తూ ఆకాశానికి వెళ్ళి “రామా! నీకు సీతలభించే మార్గం చెబుతా విను. లోకంలో సంధీ, విగ్రహమూ, యానమూ, ఆసనమూ, ద్వైధీభావమూ, సమాశ్రయమూ అని యుక్తులు ఆరున్నాయి. వాటికి సాధ్యం కాని పనులేమీ లేవు. మరిన్నీ దుర్దశలోపడ్డవాడు అలాంటివాడితోనే కలుస్తాడు. నువ్వు దుర్దశాపన్నుడవు. అంచేత హీనస్థితిలో వున్నావు. అంచేతనే నీకు కళత్రవియోగం కలిగింది. కనక, నువ్విప్పు డొక మంచిస్నేహితుణ్ణి సంపాదించుకోవాలి. లేకపోతే

నీకు కార్యసిద్ధి కాదు. కనక, విను. సుగ్రీవు డని వొక వానరవీ రుడు. ఇంద్రసూనుడైన వాలి క్రోధం వహించి అతన్ని రాజ్యభ్ర ష్టుణ్ణి చేశాడు. అంచేత ఆసుగ్రీవుడు నలుగురు అనుచరులతో పంపా తీరాన వున్న ఋశ్యమూకపర్వతంమీద వుంటున్నాడు. అతను మహావీరుడు. తేజశ్శాలి. అమితప్రభావుడు. సత్యసంధుడు. వినీ తుడు ధైర్యశాలి. చాలాబుద్ధిమంతుడు. దక్షుడు. చాలానే ర్పరి. మహాబలపరాక్రముడు. రాజ్యంకోసం అన్నగారతన్ని తోసి రాజు చేశాడు. సీతను వెతకడంలో అతను మిత్రుడై నీకు చాలా సహాయంచేస్తాడు. ఇక నీకు విచారం అక్కర్లేదు. కావల సింది కాకమానదు. కాలా న్నెవరూ అడ్డుకోలేరు. ఇక్కణ్ణుంచే త్వరగా వెళ్ళి అతనితో స్నేహంచెయ్యి. ద్రోహం కలక్కుండా వుండ డానికి అగ్నిసాక్షిగా చెయ్యి ఆస్నేహం. అత న్నెప్పుడూ నువ్వు అవమానించకూడదు. అతను కృతజ్ఞుడు. కామరూపి. సాయంకా వలసివున్న మహావీరుడు. మీరిద్దరూ వెంటనే అతను కోరిన పని చెయ్యండి. అది నెరవేరినా నెరవేరకపోయినా అతను మాత్రం నీపని నెరవేరుస్తాడు. అతను ఋక్షరజసుని భార్యయందు సూర్యునివల్ల పుట్టినవాడు. పంపాసరస్సు దగ్గిర అతను తిరుగుతూ వుంటాడు. ఋశ్యమూకపర్వతానికి వెళ్ళి ఆవానరవీరుణ్ణి కత్తి సాక్షిగా స్నేహి తుణ్ణి చేసుకో. రాక్షసస్థానాలన్నీ అతను అతినేర్పుగా గాలించిరా గలడు. సూర్యు డెంతవరకూ ప్రకాశిస్తున్నాడో అంతవరకూ అత నికి తెలియని దేమీ లేదు. అతను తన వానర వీరులతో బయలు దేరి నదులూ, పర్వతాలూ, గిరిదుర్గాలూ, గుహాలూ, అడవులూ, లోయలూ వెతికి నీభార్యను కనిపెట్టగలడు. నీకోసం దుఃఖిస్తూ వుండే నీభార్యను వెతకడానికి అతను వెళ్ళడమే కాకుండా దిక్కుదిక్కుకీ అనేకమంది మహావీరులైన వానరులను కూడా పంపగలడు. ఇంత

ుందుకూ? నీభార్య మేరుపర్వతశిఖరాన వుండనీ, పాతాళంలో వుం
ది రాక్షసుల నందరినీ సంహారించి ఆమెని తెచ్చి నీకివ్వగలను. ''

# 23

## రామునకు కబంధుడు ఋశ్యమూకమార్గం చెప్పడం

ఇలాగ ఉపాయం చెప్పి కబంధుడు మళ్ళీ ప్రారంభించాడు.

"రామా, ఇదే మంచిదారి. తూర్పువైపుగా చెట్లన్నీ పూసి వున్నాయి చూడూ. నేరేళ్ళూ, పనసలూ, జువ్విచెట్లూ, మర్రిచెట్లూ తిందుకవృక్షాలూ, రావిచెట్లూ, కొండగోగులూ, మామిళ్ళూ, కలు కానుగుచెట్లూ, చంద్రచెట్లూ పొన్నచెట్లూ, నల్లఅశోకాలూ కడిమి చెట్లూ కరవీరచెట్లూ జీడిచెట్లూ ఎర్ర అశోకాలూ, వేపలూ—ఇలాంటి చెట్లన్నీ చక్కగా పూసి కాసి ఫలించివున్నాయి చూడూ. ఆచెట్లు ఎక్కో, రాలగొట్టుకునో ఆపళ్లు ఇష్టమైనవి భక్షించండి. అది దాటివెడితే నందనవనం లాగా, ఉత్తరకురుదేశంలాగా చాలా చక్కని మరో ప్రదేశంకనపడుతుంది. అక్కడకూడా చెట్లన్నీ చాలా చక్కగా పూసి వున్నాయి. అక్కడా మంచిమంచిఫలా లున్నాయి. చైత్రరథం లాగే అక్కడకూడా ఋతువులన్నీ యేక కాలంలో కనపడతాయి. చెట్లన్నీ పళ్ళతో వంగిపోయి మేఘపర్వతాల్లా వుంటాయి. అక్కడి వాటిలో లక్ష్మణుడు నీకు మంచి ఫలాలు తెచ్చియిస్తాడు. కమ్మగా ఆరగించు. అక్కణ్ణుంచి ఈఅడవిలోనుంచి ఆఅడవిలోకీ ఈపర్వతం మీదనుంచి ఆపర్వతంమీదకీ దాటుకుంటూ వెడితే పంపాసరస్సు కన పడుతుంది. దాన్లో బురదే వుండదు. గట్లన్నీ పరిశుభ్రంగా వుంటాయి. చక్కని రేవు లెన్నో వున్నాయి. దాన్లో నాచుకూడా లేదు. అడుగున చక్కని యిసుక వుంటుంది. కలవలూ తామర పువ్వులూ చాలా

పుష్కలంగా వుంటాయి. అందులో హంసలూ, క్రౌంచాలూ చక్కగా కూస్తూవుంటాయి. చంపడం అంటే యేమిటో అవి యెరగవు. కనక, అవి యెవరినీ చూసి బెదరవు. బాగా బలిసి నేతిముద్దల్లా వుంటాయి అవి. వాటిలో మీకిష్టంవచ్చినవాటిని కమ్మగా భక్షించండి. ఆపంపా సరస్సుల్లో ముళ్ళులేని చేప లనేకరకా లున్నాయి. వాటిని బాణాలతో కొట్టి చక్కగా కాల్చుకుని తినండి. ఆచేపలు తిని, లక్ష్మణుడు తెచ్చి యిస్తాడు పంపాజలం పుచ్చుకో. అది వెండిలాగా, స్ఫటికం లాగా చాలా స్వచ్ఛంగా వుంటుంది. తామరపువ్వుల సువాసనతో చాలా తియ్యగా వుంటుంది. సుఖశీత మైన ఆజలం ఆరోగ్యకరం. అది కలిగి పోవడం అంటూ యెప్పుడూ వుండదు. తామరాకు దొప్పలతో పుచ్చుకుంటే అది చాలా మనోజ్ఞంగా వుంటుంది. అక్కడ అడివిపందు లెన్నో వున్నాయి. అవి యెనుపోతులంత యెత్తుగానూ సింహాల్లాగ బలంగానూ వుంటాయి. గిరిగుహాలే వాటిని వాసాలు. చాలాచక్కగా వుంటాయి. అవి నీళ్ళకోసం పంపాసరస్సుకి వస్తాయి నువ్వు చూడ వచ్చు. రామా, సాయంకాలం నువ్వు విరగపూసివున్న ఆచెట్లూ ఆ చల్లనినీళ్ళూ చూస్తే దుఃఖం మరచిపోతావు. ఆపుష్పాలు ధరించేవా రెవరూ అక్కడలేరు. ఎన్నాళ్ళు ధరించినా అవి వాడిపోడం అంటూ వుండదు.

అక్కడ మతంగమహర్షి శిష్యులు గొప్పతపశ్శాలులు వుండేవారు. వారు గురువుకోసం కందమూలఫలాల బరువులు మోసుకు వస్తూ వుంటే చెమటపట్టి అది అక్కడ బిందువులుగా పడింది. ఆబిందువులే ఆపుష్పవృక్షాలై పుట్టిపెరిగాయి. ఇలాంటి మునిసంబంధంవల్ల ఆ పువ్వుల కలాంటి యోగ్యత కలిగింది. వారందరూ గతించారు ; కాని వారి పరిచారకురాలు శబరి యిప్పటికీ వుంది. అది ధర్మాత్ముర్కాలు.

చిరజీవిని. నిన్ను చూసి అది స్వర్గానికి వెళ్ళిపోతుంది. ఆపంపాసరస్సు పశ్చిమతీరానికి చేరువగా రహస్యంగా వొక ఆశ్రమం వుంది. అక్కడ మత్తేభా లెన్నో వున్నాయి. కాని అవి ఆఆశ్రమం దగ్గిరగా అయినా వెళ్ళలేవు. అది మతంగమహర్షి శాసనం. నువ్వు నందనవనంవంటి ఆ మహారణ్యంలో దుఃఖంలేకుండా సుఖంగా వుండగలవు.

ఆ పంపాసరస్సుకి యెదటే ఋశ్యమూక పర్వతం వుంది. దాని మీాది చెట్లు ఎప్పుడూ పుష్పించి వుంటాయి అక్కడ పాముపిల్ల లెన్నో వుంటాయి; కనక ఆపర్వతం యెక్కడం చాలా కష్టం. వెన కటి కది బ్రహ్మ నిర్మించిన పర్వతం. ఆ పర్వతశిఖరంమీాద నిద్రించి నప్పుడు ధనం లభించినట్టు కలవస్తే మేలుకున్న తరవాత అది తప్ప కుండా సిద్ధిస్తుంది. దురాచారులూ, పాపాత్ములూ ఆపర్వతం యెక్క లేరు. ఒక్కవేళ యెక్కగలిగితే నిద్రించేటప్పుడు వాళ్ళని రాక్షసులు తీసుకుపోయి చితకకొడతారు. అక్కడ ఆపాముపిల్లల కూతలు చాలా మనోజ్ఞంగా వినిపిస్తూవుంటాయి. నడగొండల్లాంటి అక్కడి యేనుగులు మదించి అన్యోన్యమూ కుమ్ముకుని రక్తంవోడుకుంటూ తిరుగుతూ వుంటాయి. అవి ఆపంపలో కమ్మనినీరు తాగి సుఖంగా ఆఅడవిలో విహరిస్తూ వుంటాయి. అక్కడ యెలుగుబంట్లూ, పులులూ యెన్నో వున్నాయి. అక్కడ భయం యెరగని దుప్పు లున్నాయి. వాటిని చూస్తే నీకు దుఃఖంపోతుంది. ఆపర్వతంమీాద వొక పెద్దగుహ వుంది. అది రాతితో కప్పి వుంటుంది. అందులోకి వెళ్ళడం చాలా కష్టం. ఆగుహ తూర్పుద్వారంలో చల్లనినీళ్ళతో ఒకమడుగు ఉంది. అక్కడ కందమూలఫలాలు విశేషంగా దొరుకుతాయి. నానా మృగాలూ అక్కడ వున్నాయి. సుగ్రీవుడు తన నలుగురు అనుచరుల తోనూ ఆగుహలో వుంటున్నాడు. ఎప్పుడయినా అతనా పర్వత శిఖరాన విహరిస్తూ వుంటాడు, ”

కబంధు డిలా చెప్పి ఆకాశాన పూలమాలతో సూర్యబింబం లాగ ప్రకాశించాడు. రామలక్ష్మణులు అతనితో "మేం వెళ్తాం, నువ్విక వెళ్ళవచ్చు" నని చెప్పారు. వెళ్ళి కార్యసిద్ధి పొందండి" అని అతనున్నూ బదులు చెప్పాడు. తరవాత, వేలుపెట్టి ఋశ్య మూకం కేసి చూపిస్తూ "స్నేహం చెయ్యండి" అని చెబుతూ అతను వెళ్ళిపోయాడు.

## ౭౪

## రాముణ్ణి సేవించి శబరి స్వర్గానికి పోవడం

రామలక్ష్మణులు కబంధుడు చూపించిన మార్గాన తూర్పుగా బయలు దేరారు. ఆపర్వతంమీద తేనె లూరే పళ్ళతో నిండి రకరకాల చెట్లున్నాయి. వారు వాటిని చూస్తూ సుగ్రీవుణ్ణి చూడ్డానికి బయలుదేరారు. వా రారాత్రి ఆపర్వతంమీదే వుండి, మర్నాడు పంపాసరస్సు పడమటి తీరం చేరుకున్నారు. అక్కడే రమ్యమైన శబరి ఆశ్రమం వుంది. అక్కడి చెట్లు చాలా చక్కగా వున్నాయి. అవిచూసి ఆనందిస్తూ వెళ్ళి వారు శబరిని కలుసుకున్నారు. సిద్ధురా లయిన శబరి వెంటనే రామలక్ష్మణుల పాదాలకు మొక్కింది. పాద్యమూ, అర్ఘ్యమూ, ఆచమనీయమూ మొదలైన వన్నీ యథా శాస్త్రంగా యిచ్చి వారిని పూజించింది.

అప్పుడు రాముడు "శబరీ! నువ్వు తపోవిఘ్నాలన్నీ జయించావు కదా? నీతపస్సు బాగా సాగుతోందికదా? నువ్వు క్రోధమూ ఆకలీ జయించావుకదా? నీనియమా లన్నీ జరుగుతున్నాయికదా? నీమనస్సు ఎలాంటి చింతా లేకుండా సుఖంగా వుంది కదా? నీ గురుశుశ్రూష

ఫలం అయిందా?" అని చాలా ఆదరంగా అడిగాడు. అందుకా బరి "రామా! నీదర్శనం లభించడంవల్ల ఇప్పుడు నాతపస్సు సఫలం అయింది. నాగురువులున్నూ పూజితులైనారు. నాజన్మ యిప్పుడు సఫలం అయింది. నిన్ను పూజించుకున్నాను. నాకిప్పుడు స్వర్గమున్నూ లభిస్తుంది. నీచల్లని చూపులతో నేను పవిత్రురాల నయినాను. నీఅనుగ్రహంవల్ల నేనిక అక్షయలోకా లన్నీ అనుభవిస్తాను. నే నెవరికెక్కడ పరిచర్య చేస్తూ వుండినానో వారందరూ నువ్వు చిత్రకూట పర్వతంమీద వున్నప్పుడే విమానారూఢులై స్వర్గానికి వేంచేశారు. వారప్పుడు నాకు 'రాముడు పుణ్యసంభరితమైన నీ ఆశ్రమానికి వస్తాడు. నువ్వు రామునకూ, లక్ష్మణునకూ అతిథిపూజలు చేసి ఆదరించాలి. అతన్ని చూశాక నువ్వు పుణ్యలోకాలకు వెళ్ళిపోతావు' అని చెప్పారు. రామా! నీకోసం నేను ఈ పంపాతీరాన సిద్ధమైన ఫలాదు లెన్నో తెచ్చి జాగ్రత్తచేసి వుంచాను" అని విన్నవించింది.

ఇదంతా విని రాముడు "శబరీ! కబంధుడు నీగురువు ప్రభావమూ నీసంగతీ అంతా చెప్పాడు. అదంతా నేను చూడా లని వుంది, చూపిస్తావా?" అని అడిగాడు. "రండి" అంటూ శబరి బయలు దేరింది. "రామా! మృగపక్షిసమాకులమై మేఘమండలం లావున్న యిదే మతంగాశ్రమం. భావితాత్ము లైన నాగురువులు మంత్రాలతో పూజించి గంగాదిపుణ్యతీర్థా లన్నీ యిక్కడకు ఆహ్వానం చేశారు. నాగురువులు శ్రమవల్ల వొణుకుతున్న చేతులతో పుష్పోపహారం చేస్తూవుండిన దేవపూజాస్థానం యిదే. వారి తపఃప్రభావంవల్ల ఆవేది యిప్పటికీ దివ్యప్రభలు ప్రసరింపచేస్తోంది. చూశావా? ఉపవాసశ్రమవల్ల వారు కదలలేక స్మరణమాత్రాన యిక్కడికి రప్పిం

చుకున్న సప్తసాగరాలూ యివిగో చూశావా? స్నానం చేసి వారు చెట్లకొమ్మలకు ఆరగట్టుకున్న నారచీర లిప్పటికీ చివికిపోకుండా యెగిరి పోకుండా నశించిపోకుండా యెలా వున్నాయో చూశావా? వారు దేవపూజ చేసిన పుష్పా లివిగో వాడిపోకుండా యిప్పుడుకోసి తెచ్చిన ట్టెలా వున్నాయో చూడూ. రామా! నీకు చూపించవలసిం దంతా చూపించాను. చెప్పవలసిం దంతా చెప్పాను. ఇక యీకళేబరం విడిచి పెట్టడానికి నాకు సెలవియ్యి. ఇది యెవరి ఆశ్రమమో, యెవరికి నేను పరిచర్య చేశానో ఆమహాత్ములదగ్గిరికి వెళ్ళిపోడానికి తొందరగా వుంది, నాకు సెలవియ్యి" అని ప్రార్థించింది.

ధర్మిష్ఠం అయిన శబరి మాట విని రామలక్ష్మణులు "చాలా ఆశ్చర్యంగా వుంది." అనుకుంటూ యెంతో ఆనందించారు. తరవాత రాముడు నియమనిష్ఠలతో వ్రతంనిర్వర్తించిన శబరితో "శబరీ! నువ్వు నన్ను చాలా భక్తితో పూజించావు. ఇక సుఖంగా నీయిష్టంవచ్చి నట్టు వెళ్ళిపో" అన్నాడు. రాము డిలా చెప్పగానే జడలూ నార చీరలూ ధరించివున్న ఆవృద్ధశబరి ఆక్షణంలోనే ఆజీర్ణదేహం అగ్ని హోత్రంలో ఆహుతిచేసేసి అగ్నిలాగ వెలిగిపోతూ స్వర్గానికి వెళ్ళి పోయింది. వెళ్ళిపోయేటప్పుడు దివ్యదేహం తాల్చింది. చక్కని దివ్యవస్త్రాలూ, దివ్యాభరణాలూ, దివ్యమాల్యాలూ, ధరించి మెరుపు లాగ మెరిసింది. తరవాత సుకృతాత్ములైన తన గురువు లున్న చోటికి విమానం యెక్కి వెళ్ళిపోయింది.

## ౭౫

## రాముడు పంపాసరస్సు చేరుకోవడం

తన దివ్యతేజస్సుతో శబరి స్వర్గానికి వెళ్ళిపోయాక రాముడు ఆమునుల ప్రభావం చింతించి, ఏకాగ్రచిత్తుడై వున్న లక్ష్మణుణ్ణి చూసి "మహా

త్ములయిన మహర్షుల ఆశ్రమం చూశాము. ఇక్కడ యెన్నో వింత
లున్నాయి. రకరకాల పిట్టలున్నాయి. క్రూరజంతువులూ సాధు
జంతువులూ అన్యోన్యవిశ్వాసంతో కలిసిమెలిసి వున్నాయి. ఈసప్త
సాగరతీర్థాలలో స్నానం చేశాము. పితృతర్పణమున్నూ చేశాము.
అమంగళా లన్నీ నశించాయి. శుభంకలగబోతోంది. అంచేత నామ
నస్సు ఇప్పుడు చాలా ఉల్లాసంగావుంది. కనక, యిక చక్కని
పంపాసరస్సుకి వెడదాం రా. అక్కడికి ఋశ్యమూకం దగ్గిరగానే
వుందిట కాదూ? వాలి భయంవల్ల సుగ్రీవుడు అక్కడేకదూ వుంటు
న్నాడు? సీతను వెతకడం సుగ్రీవుని ఆధీనంలోవుంది. అంచేత అతన్ని
చూడ్డానికి నాకు చాలా తొందరగా వుంది" అన్నాడు. దానిమీద
"నాకూ తొందరగానే వుంది. పద" అని లక్ష్మణుడు కూడా
అన్నాడు.

ఇద్దరూ బయలుదేరి పంపాసరస్సు చేరుకున్నారు. అది యెందరో
మహర్షులు సేవించిన పుణ్యస్థలం. ప్రపంచంలో వున్న వృక్షజాతు లన్నీ
అక్కడ వున్నాయి. తామరపువ్వులతో ఎర్రనై, తెల్లకలవలతో
తెల్లనై నల్లకలవలతో నల్లనై అది రత్నతివాసీలా వుంది. రాముడు
దానికి సమీపానే వున్న మతంగసరస్సులో స్నానంచేశాడు. ఆసర
స్సులో నల్లకలవలూ, తెల్లకలవలూ యెర్రకలవలూ ముమ్మరంగంగా
వున్నాయి. ఆచుట్టుపట్ల మామిడిచెట్లూ బొట్టుగుచెట్లూ దానిమ్మ
చెట్లూ, మాదీఫలచెట్లూ, చంద్రచెట్లూ తెల్లమద్దిచెట్లూ, పొన్న
చెట్లూ,మల్లెపొదలూ, మాలతీలతలూ, మొగిలిడొంకలూ, అశోక
చెట్లూ- ఇంకా అనేకజాతుల చెట్లూ పూసీ కాసీ, పండీ కన్నులపండు
వుగా వున్నాయి. నెమిళ్ళు క్రేంకారాలు చేస్తున్నాయి. చిలకలూ,
బెగ్గురుపక్షులూ మృదువుగా కూస్తున్నాయి. అది చూసి చాలా

ఆనందించి వారు పంప వొడ్డుకు వెళ్ళారు. పంపాజలం చాలా చల్లగా వుంది. దాని గట్లమీద కూడా ఎన్నో జాతులచెట్లు చాలా రమ్యంగా వున్నాయి. అవన్నీ చూశాటప్పటికి రామునకు కామాగ్ని పెల్లెగిసింది. దాంతో అతను పంప వొడ్డుకి వెళ్ళాడు. అక్కడ అతను లక్ష్మణునితో "ఈపంపాతీరానే ధాతుమండిత మైన ఋశ్యమూక పర్వతం వుం దని కబంధుడు చెప్పివున్నాడు. ఆపర్వతం మీాదే ఋక్ష రజుని కొడుకు సుగ్రీవుడున్నాడనిన్నీ చెప్పివున్నాడు. మనల్ని అతని దగ్గిరికిన్నీ వెళ్ళ మన్నాడు; కాని, లక్ష్మణా, సీత లేకుండా నేను బతకడం యెలాగా" అంటూ మిక్కిలీ విచారించాడు.

సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమహేంద్రవరము 1956

# రామాయణం - రాబోయే సంపుటాలు




రాముడు కిష్కింధలో వాలిని సంహరించి సుగ్రీవునితో స్నేహం చేసుకున్నాడు.




సుగ్రీవుడు పంపగా హనుమంతుడు లంకకు వెళ్ళి అక్కడ సీతనుచూసి రాక్షసులతో యుద్ధంతటస్థించగా లంక కాల్చేసి వచ్చేశాడు.



వానరసేనతో లంకలో ప్రవేశించి రాముడు రాక్షసుల నందరినీ సంహరించేశాడు. తరవాత సీత, అగ్నిలో ప్రవేశించి తన ప్రాతివ్రత్యం ప్రకటపరుచుకుంది.



సీతను నిండుచూలా లయివుండగా రాము డరణ్యాలకు పంపేశాడు. అక్కడ ఆమె కుశలవులను కన్నది. వారిని గొప్ప వీరులుగానూ చేసుకుంది.